


(సాంఘిక నవల)



గ్రంథకర్త

కవిభూషణ

ండిమెడ వేంకట సుబ్బారావు, B. A., B. Ed.,

*Author of*

KHILJI RAJYA PATHANAM, etc., etc.,

1953




(సాంఘిక నవల)




గ్రంథకర్త

కవిభూషణ

గుండిమెడ వేంకట సుబ్బారావు, B A., B. Ed.,

*Author of*

**KHILJI RAJYA PATHANAM, etc., etc.,**


 [Price Rs. 2-0-0

# పీఠిక

ఆంధ్ర మహాజనులారా !

ఇంతవఱకును, భగవంతుడు నా కనుగ్రహించిన శక్తినంతయు నాటక రచనమునందే వినియోగించుచు వచ్చితిని. గద్య కావ్య రచనమువైపు నా దృష్టియే మఱలకుండెను. అనేక మిత్రుల ప్రోద్బల హేతువుచే ఇప్పు డీ నవలా రచనమునకు సాహసించితిని.

ప్రపంచ నవలా వాఙ్మయమునందు ఉత్తమోత్తమ శ్రేణికి జెందిన 'ఈస్టిన్' అను ఆంగ్ల నవలారత్నమునందలి కథావిధానము నాధారముగా జేసుకొని నే నీ గ్రంథమును రచించితిని. పరమా ద్భుతమైన మానుష ప్రకృతిని చిత్రించుటయే నా సంకల్పము. ఎంత వరకు కృతకృత్యుడ నైతినో తెలియదు.

నాచే రచింపబడిన 'రాణాప్రతాప్, ఖిల్జీరాజ్య పతనము, పృథ్వీపుత్రి, దుర్గాదాస్' ఇత్యాది గ్రంథములపట్ల వివిధ విశ్వవిద్యా లయములును, అశేషాంధ్రలోకమును జూపిన యపరిమితాభిమానమే యీ నా నూతన రచనకు సహితము లభించునను సంపూర్ణ విశ్వాస ముతో దీనిని ఆంధ్ర సారస్వత ప్రపంచమున విడచుచున్నాను.

ఛత్రపురము
16-5-1953

ఇట్లు
బుధ విధేయుడు,
గుండిమెడ వేంకట సుబ్బారావు.



శ్రీ గుండీమెడ వేంకట సుబ్బారావు, B A., B.Ed

గ్రంథకర్త




## అధ్యాయము 1

సువర్ణదుర్గము ప్రకృతి సౌందర్యమునకే కాక ధనధాన్య సౌభాగ్యమునకు గూడ ప్రఖ్యాతి వహించిన సంస్థానము. సంస్థానాధిపతియైన సంజీవరాయలు సమస్తైహిక సౌఖ్యములను సమగ్రముగ భోగించిన విలాస పురుషుడు. యౌవనమునందు కన్నుగానక విశృంఖలముగ వ్యవహరించిన యువకులకు కాలక్రమమున బట్టు దుర్గతియే సంజీవరాయలకు గూడ సంభవించెను. ఆ యౌవన ప్రాదుర్భావ మిప్పుడు లేదు. ఆ విలాస జీవన మిప్పుడు లేదు. సంపద్వ్యాహానితో బాటు ఆతని దేహలత సహితము క్రమక్రమముగ శుష్కించి పోయెను. నిరాశాచ్ఛాయలచే ముఖము వివర్ణమై పోయెను. అంధకారమునందు జ్యోతిని జూచియుండిన ఆ నేత్రముల తోడనే యాతడిప్పుడు జ్యోతియం దంధకారమును గాంచుచుండెను. చీకటి రాత్రులను పట్టపగళ్ళుగా మార్చియుండిన సంజీవరాయలకు ఇప్పుడు పట్టపగళ్ళే చీకటిరాత్రు లయ్యెను.

సంస్థానము ఋణగ్రస్త మగుచుండెను. సువర్ణదుర్గము మట్టిదిబ్బయగుచున్నదని యూనోట నానోట గుసగుసలు వ్యాపింపసాగెను. క్షణమాత్రమైనను చిత్తవిశ్రాంతి యెరుగని సంజీవరాయలకు పాపము, గోరుచుట్టుపై రోకటిపోటు వలె పక్షవాత మావహించి మంచము పట్టించెను. చికిత్సార్థము పరివారముతో గూడ తన సువర్ణదుర్గమును విడచి యాతడు కలకత్తా నగరమునందు నివాస మేర్పరచుకొనెను.

ఒకనాటి సాయంసమయమున నాతడు మంచముపై బండు కొని గతించిన తన యావజ్జీవన శీలను స్మరించుకొనుచుండెను. అంతలో నొక సేవకుడు ప్రవేశించి, "మహాప్రభూ! ఎవరో తమ దర్శనమునకై వచ్చి యున్నారు." అని నివేదించెను. ఋణదాతల యొత్తిడి యధిక మగుచుండిన ఆ దినములలో నాతి డెవ్వరో తన్ను పీడించుటకే వచ్చియుండెనని యాతడు భావించి, "లోనికి దోడ్కొనిరమ్ము" అని హీనస్వరముతో బల్కెను. ఉత్తరక్షణముననే ఒక యిరువదియారేండ్ల యువకుడు ఆతని యెదుటకు గొనిరాబడెను. సుందరమై శరత్కాల పూర్ణిమవలె ఆతని ముఖమండలము ప్రశాంత మందహాసవిలసితమై యుండెను. తేజోవంతమై విశాలమై యున్న యాతని ఫాలభాగమున దర్పణమునందు వలె ఒక నిష్కల్మషమైన యంతరంగము ప్రతిఫలించుచుండెను. కనుకొలకుల నుండి యౌదార్యము తొంగిచూచుచుండెను. ఆపాదమస్తకమును సువ్యక్త మగుచుండిన యొకానొక యవ్యక్త విశిష్టత అతి డొక యసామాన్య వ్యక్తి యని చెప్పకయే చెప్పుచుండెను.

సంజీవరాయలు ఆతని జూచి, "ఆర్యా! దయచేయుడు. చూచితిరా నా యవస్థ! ఈ స్థితియందు నేను యథోచితముగ మిమ్ము సత్కరింపజాలక పోయినందుకు చింతించుచున్నాను." అని పల్కెను.

"చింతింపకుడు. భగవత్సంకల్ప మనివార్యము." అనుచు ఆ ప్రక్క నున్న సోఫాపై నాతి డాసీను డయ్యెను. అనంతరము వారిరువురు నిట్లు సంభాషించుకొనిరి.

"ఆర్యా! మీ నివాసము ?"

"కల్యాణ నగరము."

"సువర్ణదుర్గమునకు చేరువనున్న కల్యాణనగరమా ?"

"అగును. అచ్చట నేనొక న్యాయవాదిని. నాపేరు కృష్ణ మోహన్."

"సంతోషము. ఏదో విశేష ప్రయోజనము లేక మీరు నా యొద్దకు రారు."

కృష్ణ:—చిత్తము. తమ సువర్ణదుర్గము విక్రయమునకు వచ్చుచున్న దని గాలివార్త నా కర్ణముల బడినది. నిజమే యగునా ?

సంజ:— (కొంచె మాగి) ఆర్యా, మన ప్రస్తుత సంభాషణము నందు మీ హృదయము నిష్కల్మష మనియే నేను భావింతును.

కృష్ణ:— తమ యభిప్రాయము నాకు దెలియుట లేదు.

సంజీ:— క్షమించుడు. నా ప్రస్తుత పరిస్థితులు నా నీడను సహితము నాచే శంకింప జేయుచున్నవి. విశేషముగ ఋణగ్రస్తుడనై యున్నాను. నా రహస్యములను గనుగొనుటకు నా ఋణ దాతలు విశ్వప్రయత్నములు చేయుచున్నారు.

కృష్ణ:— ఆర్యా! నన్ను విశ్వసింపుడు. మోసమేమియో నేటివరకును నాకు దెలియదు. మోసగాండ్రు దైవమును మోసము చేయ లేరని నాకు దెలియును.

సంజీ:— సంతోషము. తెలియక శంకించినందుకు క్షమించుడు. ఇంక యథేచ్ఛగ మనము సంభాషించుకొనవచ్చును.

కృష్ణ:— తమ సువర్ణదుర్గము విక్రయింపబడ నున్నదని రహస్యముగ విని యుంటిని. అది నిజమైనచో నేను దానిని కొనదలచుకొని యున్నాను.

సంజ:— అది యంత స్వల్ప విషయమా?

కృష్ణ:— శంకింపకుడు. నాకు ధనమునకు కొఱత లేదు. ఏదైన నొక శాశ్వత వసతిపై నేను నా ధనమును వెచ్చింపదలచియున్నాను. మా కల్యాణనగరమునకు చేరువ యగుటచే సువర్ణదుర్గము నాకు చాల సదుపాయముగ నుండును.

సంజీ — కృష్ణమోహన్! నా పరిస్థితులు బాగులేవు. నేను ప్రస్తుతము దుస్తరమైన యార్థిక దుస్థితి యందు చిక్కువడి యున్నాను. నా యావదాస్తియందును ఈ సువర్ణదుర్గ మొక్కటే యింకను ఋణగ్రస్తము కాక మిగిలి యున్నది. ఈ విషయము లోకమున కింకను తెలియదు. దీనిని విక్రయించితి నని నా ఋణ దాతలకు తెలసినచో ఈ మూలమున నాకు లభించు ధనములో నొక్క చిల్లి గవ్వయైనను వారు నాకు దక్కనీయరు. నేను కేవలము నిరాధారుడనై పోవుదును.

**కృష్ణ:**— తమ యభిప్రాయము గ్రహించితిని. ఈ వ్యవహారమున నా బాధ్యత నేను పూర్తిగ నిర్వహించెదను.

**సంజీ:**— సంతోషము.

**కృష్ణ:**— తాము దీనిని విక్రయింప నున్నారను విషయము తెలిసిన వరకు దీనిని తమ కుమార్తె పరము చేసిరని భావించి యుంటిని.

**సంజీ:**— లేదు. పాపము, ఆ మాతృవిహీనబాలికకు నే నేమియును మిగుల్పలేదు. ఆమెకు తగు వరణము నెప్పుడైన సేయగలను కదా యని యశ్రద్ధ వహించితిని. చూచుచుండగనే కర్పూరము వలె సమస్తమైన యాస్తియు హరించిపోయినది. ఇప్పుడామె కేవలము నిరాధార. అసామాన్యమైన సౌందర్యమును భగవంతు డామె కనుగ్రహించి యున్నాడు. ఆమెకు వివాహము కాదను భయము లేదు. ఊర్జితమైన సంబంధమే యామెకు లభింపగలదు. కాని, తండ్రినై నేకైక సంతానాంకురమైన యా బాలికకు నే నేమియు నీయలేకపోతినికదా యను విచారము మాత్రము నన్ను దహించివేయుచున్నది.

**కృష్ణ:**— ఆర్యా! భగవత్సంకల్ప మెట్లున్నదో! మనము నిమిత్తమాత్రులము కదా!

**సంజీ:**— కృష్ణమోహన్! ఈ సువర్ణదుర్గమును మీరు కొన్నచో, నా దొక్క ప్రార్థనము కలదు. ఈ వ్యవహారము మూడవ వానికి తెలియరాదు. తెలిసినచో నాకును నా కుమార్తెకును భిక్షాటనము తప్ప వేఱుగతి యుండదు. ఒక్క చిల్లిగవ్వయైనను నా చేత బడదు. ఋణదాతలు వేయి కన్నులతో కనిపెట్టుకొని యున్నారు. ఈ సువర్ణదుర్గము ఇంకను నా స్వత్వమే యై యున్నట్లు కొంతకాలము వరకును లోకము భావించుచుండవలెను. ఇందుకు మీ కభ్యంతర ముండదని యాశింతును.

**కృష్ణ:**— (కొంచెము యోచించి) అట్లే కానిండు. ఈ వ్యవహారము నేడే స్థిరపఱచుకొందము. ఇంక నాకు సెలవిండు.

అని సోఫాపైనుండి లేచెను. సంజీవరాయులు ఆరాత్రి తన యాతిథ్యమును స్వీకరింపవలసినదని కృష్ణమోహనుని నిర్బంధించెను. ఆతని కోరికను నిరాకరింపజాలక ఆత డందుకు సమ్మతించెను.

ఆ రాత్రియే అనతి దూరమందున్న శోణాపురపు జమీందారిణి గారి యింటికి విందున కాహ్వానింపబడి, సంజీవరాయుల కుమార్తె స్వర్ణలత సిద్ధమగుచుండెను. నిర్ణీతసమయము సమీపించుచుండుటచే తండ్రి యనుమతి గైకొనుటకై యామె యా గదిలోనికి ప్రవేశించెను. సర్వాంగ సుందరమై యున్న యామె విగ్రహమును జూచినంతనే కృష్ణమోహన్ కన్నులు మిఱుమిట్లు గొల్పెను. ఇట్టి సౌందర్యము నాత డీవరకు జూచి యుండలేదు. పదియారేండ్ల నవయౌవన వివాహిని! జీవజ్యోతు లుట్టిపడుచున్న మనోహర నేత్రములు! సౌహార్ద్రము, ముగ్ధత్వము, ప్రశాంతభావమును దాండవించుచున్న వదనబింబము! వెన్నెలలు కాయుచున్న మందహాసము! ఈశ్వర సృష్టియందు ని యట్టి పదార్థము కలదా యని కృష్ణమోహన్ దృగ్జాలములు నిశ్శబ్దముగ నామెను ప్రశ్నించుచుండెను.

ఆమె ప్రవేశింపగనే సంజీవరాయులు చెంత జేర్చుకొని, "అమ్మా! వీరు కల్యాణనగరము నందలి గొప్ప న్యాయవాది, కృష్ణమోహన్. నన్ను జూడగోరి వచ్చి యున్నారు." అని చెప్పి, కృష్ణమోహన్‌తో, "ఆర్యా! ఈమెయే నా యేకైక కుమార్తె, స్వర్ణలత! మాతృవిహీన బాలిక!" అని కన్నుల నీరు నింపుకొనెను. ఆ దివ్యసుందర నేత్రములయం దావిర్భవించుచున్న అలౌకిక జ్యోతి యందు కృష్ణమోహన్ మనఃప్రాణ సర్వస్వమును లీనమై యుండెను. తెప్ప వాల్చక ఆత డామెవైపు జూచుచుండెను. క్షణమాత్ర మాతని వైపు జూచి స్వర్ణలత, "నాన్నగారూ! వారు నాకై వేచుకొని యుందురేమో!" అని మృదుమధురమైన సాధుస్వరముతో తండ్రి యనుజ్ఞను కోరెను.

"అగును, అమ్మా! పోయి రమ్ము. బండి సిద్ధముగ నున్నది కదా! కృష్ణమోహన్! ఈ పాడురోగము నన్ను లేవనిచ్చుట లేదు. నా బిడ్డను వీథిలోని కంపకము పెట్టుటకైనను నేను నోచుకొనలేదు." అని నిట్టూర్పు విడచెను.

ఆతని యభిప్రాయమును గ్రహించి, కృష్ణమోహన్, "ఆర్యా! అభ్యంతరము లేదని నే నామెను బండి నెక్కించి వత్తును." అని పల్కెను. సంజీవరాయలు కృతజ్ఞతా సూచకముగ నాతనివైపు జూచెను. స్వర్ణలత మందహాసము జేసి తన సమ్మతిని వెలిబుచ్చెను.

చిత్రవర్ణాలంకృతమై యున్న యొక చక్కని జోడుగుఱ్ఱముల బండి ద్వారముకడ వేచి యుండెను. కృష్ణమోహన్ సగౌరవముగ స్వర్ణలతతో మేడమెట్లు దిగి యామెను బండిపై నెక్కించెను. ఆ సమయమున ఏదో విపరీతభావము లా యువతీయువకుల యంతరంగములందు పల్లవించినవో యూహింపజాలము. ఆమెను వీడ్కొల్పి కృష్ణమోహన్ తిరిగి మేడమీదికి వచ్చెను.

## అధ్యాయము 2

జోడుగుఱ్ఱముల బండి వచ్చి యొక విశాలారామ పరివృతమైన సుందరభవనపు ప్రాంగణమునందు నిలచెను. ఇరువదియేండ్ల జవ్వని యొకతె వికటహాసము జేయుచు ప్రాంగణద్వారమున నిలచి యుండెను. స్వర్ణలత మందహాసము జేయుచు "లిలా! కొంచె మాలస్య మైనది. అమ్మమ్మగారు నాపై నాగ్రహించుచున్నారేమో!" అనుచు బండిలోనుండి దిగెను.

"లేదు. ముద్దుపెట్టుకొందురు." అని వికటహాస్త విన్యాసములతో లిల స్వర్ణలతను లోనికి దోడ్కొని పోయెను.

మూడు ద్వారములు దాటి యొక విశాలమైన గదియందు వారు ప్రవేశించిరి. కన్నులు మిఱుమిట్లు గొల్పుచున్న దీపజ్యోతియందా ప్రదేశము పట్టపగలువలె నుండెను. ఏవైపుజూచినను భాగ్యలక్ష్మీ తాండవమే! చిత్రవిచిత్రములైన యాసనములు యథోచిత స్థలములయం దమర్చబడి యుండెను. పుష్పమాలాలంకృతములైన భవన ద్వారములు నాల్గువైపులనుండియు నేత్రపర్వ మొనర్చుచుండెను. ఎదుట నొక చక్కని మయూరాసనముపై సుమారు ఎనుబదియేండ్ల వృద్ధాంగన యొకతె యాసీనయై యుండెను. స్వర్ణ

లతను దోడ్కొని లీల యామెను సమీపించెను. అంత నా ముదుసలి, "స్వర్ణా! ఇంత యాలస్యమైన దేమి ?" అని ప్రశ్నించెను. స్వర్ణలత, "అమ్మమ్మా! నాయనగారిని జూచుట కెవ్వరో యొక భక్తస్వామి వచ్చిరి. వారు మాయింట నేటిరాత్రి యతిథులై యున్నారు. ఆ కారణమున నించుక విలంబమైనది. క్షమింపుము." అనుచు నామె చెంత నొక యాసనముపై గూరుచుండెను.

లీల యిరువదిరెండేండ్ల నవయౌవన. శరీర సౌష్టవమునకు గొఱత లేదు. కాని, ఆపాదమస్తకము దంభము, స్వాతిశయము ప్రతి రోమకూపము నుండియు తొంగి చూచుచుండెను. ఆమె తల్లి చిఱుత ప్రాయమునందే మరణించుటచే. ఆమె మాతామహియైన యీ వృద్ధస్త్రీ యామెను తన చెంతనే యుంచుకొని యత్యంతానురాగముతో నామెను పెంచి వివాహము జేసెను. ఆమె భర్త దేవేంద్ర రాయలు. ధారానగర సంస్థానమున కధిపతి. మరియు. పుత్రసంతానము లేని సంజీవరాయలకు సన్నిహితదాయాదుడు.

భోజనానంతరము అన్యోన్య సల్లాపములతో నత్యానందముగ సుమారొక గంటకాలము జరిగెను. ముగ్ధత్వమును సౌజన్యమును మూర్తీభవించిన స్వర్ణలతను జూచి యా వృద్ధురాలెంతయో ఆనందించి, మనుమరాలివైపు జూచి, "లీలా! నీకును స్వర్ణకును గల తారతమ్యము జూచితివా ?" అని మెల్లగా బల్కెను.

"తారతమ్యము లేకేమి? ఈ పక్షి ఆకాశ మార్గమున విహరించుచు భూమినిజూచి హసించును. ఆ పక్షి భూమిని విడచి పైకెగురజాలదు. ఇదియే తారతమ్యము."

"మాటలకు కొఱత లేదు. భూమిని విడచి పైకెగురువాటికే యెన్నటికైనను నేలబడు ప్రమాదము. ఈ సత్యము గ్రహించుటకు నీకింక నెంతకాలము పట్టునో! సౌజన్యము, నమ్రభావము లేని సంస్కారము సంస్కార మనిపించుకొనదు. చాల చదువు చదివితివి. ఏమి ప్రయోజనము ? స్వర్ణలతను జూచి నమ్రత్వము నేర్చుకొనుము."

తన సమక్షమున స్వర్ణలతను గొప్ప జేయుచున్న తన మాతామహి వాక్యములచే లీల స్వాతిశయము రగుల జొచ్చెను. ఆమె ముఖము జేవురింప మొదలిడెను.

అంతలో ఆ వృద్ధాంగన పౌత్రుడును, ఆమెకు ఏకైక వారసుడును అగు రమాపతి యచ్చటకు వచ్చెను. ఆతఁ డొక సైనికోద్యోగియై యుండెను. ఇరువదియారేండ్ల నడి యౌవనము! చూపు మాత్రముననే యెదుటివారి హృదయముల నాకర్షింప గల ప్రసన్న ముఖవిలాసము! వినువారిని వివశీకృతుల గావింపజాలు వాక్చాతురి! ఆతని ప్రత్యేకాణువునందును ఆకర్షణ శక్తి కలదు. కాని, ఆ శరీరము నందు స్పందించుచున్న హృదయము మాత్రము పాషాణనిర్మితము. అది స్నేహజ్యోతికి దావులేని గాఢాంధకార గహ్వరము. ఆ వ్యక్తి యొక్క బాహ్య ప్రకృతికిని, ఆంతరంగిక ప్రకృతికిని స్వర్గమునకును నరకమునకు గల భేదము కలదు.

"స్వర్ణా! ఈతడు నా పౌత్రుడు రమాపతి. — రమా! ఈమె సువర్ణదుర్గపు జమీందారులైన సంజీవరాయుల కుమార్తె స్వర్ణలత!" అని యా వృద్ధాంగన కావించిన యన్యోన్య పరిచయముచే నా యువతీయువకులు ఒకరివైపొకరు చూచి మందహాసము జేసికొనిరి. ప్రాపంచికానుభవమున నింకను ప్రథమ సోపానమైన మెట్టని స్వర్ణలతకు రమాపతి మందహాసము మరుగున నేమున్నదో యేమి తెలియును? స్వర్ణలత మందహాసవదనమున నాటుకొని పోయిన రమాపతి దృగ్జాలములు విడిపడుట లేదు.

కాలాతీత మగుటచే స్వర్ణలతను ఆమెయింటికి కంపకము పెట్టి రమ్మని వృద్ధనారాత లీలతో జెప్పెను. ఇరువురును దమ యాసనములపైనుండి లేచుచుండగా స్వర్ణలత కంఠమునందు వ్రేలుచుండిన యొక చక్కని నవరత్న చక్రము తళుక్కుమని యా వృద్ధస్త్రీ దృష్టి నాకర్షించెను.

"స్వర్ణా! ఏదీ, ఆ చక్రము నిటు చూడనిమ్ము. ఎంత యందముగా నున్నది!"

"అమ్మా! నాతల్లి తన మరణశయ్యపై దీనిని నాకిచ్చినది." అని తన మెడనుండి యాచక్రము వ్రేలుచున్న సువర్ణహారమును దీసి యామెచేత బెట్టెను.

"నీకున్న యాభరణ సర్వస్వము నిదియే గాబోలు!" అని లీల యెకసక్కెము లాడెను.

"మొదట నొక వజ్రహారమును గూడ ధరించితిని. కాని మరల తీసివైచితిని".

"ఏమి?"

"ఏమో! ఆ యాడంబరత నాకు రుచింపలేదు. నా యాభరణములచే నేనితరుల దృష్టి నాకర్షింతునేమో యని వెఱచితిని."

"వెఱచితివా? పాపము, నీవు ఇతరుల దృష్టి నాకర్షించుటయే లేదు!"

ఇంత నిశితముగ లీల పలుకుటకు గారణము లేకపోలేదు. అంతవఱకును రమాపతిదృష్టి స్వర్ణలతనుండి మఱలనే లేదు.

"అమ్మా! ఇదిగో, మరల మెడలో వైచుకొనుము. ఎన్ని వజ్రహారములైనను దీని శోభ నీయజాలవు. లీలమాటల కేమిలే." అనుచు నా వృద్ధాంగన యా హారమును స్వర్ణలత కందిచ్చుచుండ రమాపతి మధ్య నందుకొని యామెచేత బెట్టబోయెను. ఇట్లందుకొనుటయందు ప్రమాదవశమున నా హారము నేలబడి యా నవరత్న చక్రము రెండు ముక్కలయ్యెను. క్షణమాత్ర మెవ్వరి నోటను మాట రాలేదు.

"దీని కుత్తరవాది యెవ్వరు?" అని వృద్ధమాత గర్జించెను. చక్రముతోబాటు స్వర్ణలత హృదయము పగిలినట్లయ్యెను. నేలబడి యున్న భగ్నచక్రమును గని ఒక్కసారి కన్నులు మూసికొనెను. ధారాపాతముగ గన్నీరు కారజొచ్చెను.

"ఇంతటి మహాభరణము పగిలిపోయినదని యేడ్చుచుంటివా?" అని లీల నవ్వసాగెను.

"స్వర్ణా! దుఃఖింపకుము. చక్రమును తిరిగి యతికించుకొన వచ్చును లెమ్మ." అని వృద్ధమాత బుజ్జగించెను.

తన యపకార్యమును గుర్తించుకొని శిలాప్రతిమవలె స్తంభించి నోట మాటరాక యున్న రమాపతిని జూచి కన్నీరు తుడుచుకొని, చిరునవ్వు దెచ్చుకొని స్వర్ణలత, "ఆర్యా! విచారింపకుడు. ఈ ప్రమాదమునకు దా మొక్కరే కారణము కాదు. నేనుగూడ సమాన భాగహారిణినే కదా! అమ్మమ్మగారు చెప్పినట్లు దీని నతికించి

బాగుచేసుకొనవచ్చును" అని పల్కుచు భగ్న చక్రమును హారము నుండి విడదీసి, హారమును మెడలో వైచుకొనెను.

"అభాజనుడా! ఎట్టి యకార్యము జేసితివి!" అని వృద్ధమాత రమాపతిపై గర్జించి, స్వర్ణలతను బండి నెక్కించి రమ్మని లీలతో జెప్పెను. రమాపతి కూడ ఆ పనికే సిద్ధపడి యామెతో ప్రాంగణ ద్వారములు దాటి బండియొద్దకు వచ్చి యామెను బండి నెక్కించెను. ఒకానొక అపరిచిత వ్యక్తిచే స్వర్ణలత బండి నెక్కించబడుటకు ఆ దినమున అది రెండవసారి. వచ్చినప్పుడు కృష్ణమోహన్, పోవు నప్పుడు రమాపతి. తన యపరాధమును క్షమింపవలసినదని రమాపతి యప్పటికి స్వర్ణలతను పదిసారులు ప్రార్థించియుండును. దుఃఖమును దిగమ్రింగుచు స్వర్ణలత పదిసారు లాతని జింతింప వలదని వారించి యుండును. "నా యావజ్జీవమును నీకు సపర్యచేసి నను నేను కావించిన యపరాధము మాయదు." అని యాతడు కడసారి తన విచారమును వెలిబుచ్చెను. భావగర్భితమైన యా వాక్యముతో లీల వికటహాసముతో బండి కదలిపోయెను.

బండియందలి యా యపరూప సుందరితో అంత సమీపమున నిలచి అంతదనుక మాటాడుచుండిన రమాపతిని జూచి దారి బోవుచుండిన యొక వ్యక్తి "పాపము! ఆ యమాయిక స్త్రీ యెవ్వరో! ఈ హృదయ విహీనునకు బలి కాబోవుచున్నది" అని నిట్టూర్పు విడచి తన దారిని బోయెను.

## అధ్యాయము 3

కల్యాణనగరము కేవల మొక కుగ్రామమును గాదు, పట్టణమును గాదు. మధ్యస్థమై యున్న యొక చక్కని జనపదము. గ్రామవాసులయందు నాగరకు లనేకులు గలరు. గ్రామమునందలి పెద్దలు తరుచు కలసికొనుచుండు ఒక పురమందిరము కలదు. నాలుగైదు దేవాలయములు కలవు. ఆ చుట్టుపట్లనున్న గ్రామ సముదాయమున కంతకును అదియే వ్యవహార స్థలము. చుట్టును సుందరములైన పండ్లతోటలు. ధనధాన్య సమృద్ధి గలిగి యుచ్చటి ప్రజానీకము

ప్రశాంతముగ కాలము గడుపుచున్నా రనుటకు గావలయు నిదర్శ నము లన్నియు నచ్చట గలవు. సువర్ణదుర్గమును గొనదలచిన కృష్ణమోహన్ ఈ గ్రామ నివాసియే యని చదువరులకు జ్ఞప్తి యుండును.

అచ్చటకు సుమా రొక యరమైలు దూరమునందు చుట్టును ప్రాకారము కలిగిన యొక చక్కని తోట కలదు. ఆ తోటయం దొక సుందర భవనము కలదు. కల్యాణనగరపు ప్రధాన న్యాయాధి పతి యైన హరిహరరాయలు ఆ గృహ యజమాని. హరిహర రాయలు ఆ ప్రాంతపు న్యాయాధిపతులయందు పేరెన్నికగన్న యొక యసాధారణ వ్యక్తి. ప్రాణానసరఘట్టములందైనను న్యాయపరి పాలనమందు 'తూ' 'చా'లు తప్పని యచంచల స్వభావుడు. గృహ పరిపాలనమునందు సహితము ఆ తీక్ష్ణతయే. స్నాన భోజనాది కములయందు ఏ వేళకు జరుగవలసిన పని యా వేళకు జరిగి తీర వలయును. ప్రాణోపద్రవము సంభవింప నున్నను నిర్ణీత కార్య క్రమమునందు తలవెంట్రుకవాసి మార్పునకైనను అంగీకరించడు.

అట్టి యజమానితో నాతని భార్య కుముద్వతీదేవి యిరువది యై దేండ్లయి సంసారము చేయుచుండెను. పెద్దకుమార్తె వివాహితయై భర్తయింటికి బోయెను. చిన్నకుమార్తె శాంత యింకను అవివాహిత. పదునారేండ్ల నవయౌవని. కుమారుడు నగేంద్రుడు వారి తొలికానుపు.

గృహిణి యైన కుముద్వతీదేవి యత్యంత సాధుశీల. భర్త యనిన యపారమైన భక్తిగౌరవములతో బాటు అపరిమితమైన భయము. ఆతను గీచిన గీటు దాటి యెఱుగదు. సంతానమునందు, చిన్న కుమార్తె యగు శాంత మాత్రము సమయము వచ్చినచో తండ్రి యాజ్ఞను సరకుసేయని స్వతంత్ర బుద్ధి కలది.

కుముద్వతీదేవి, పాపము, కొంతకాలమై వ్యాధిగ్రస్తురాలై క్రమక్రమముగ శీర్ణించి పోవుచుండెను. మరువరాని మహావిపత్తి యొకటి సంభవించి యామె మాతృహృదయమును చూర్ణవిచూర్ణము జేయుచుండెను. ఏదో పరధ్యానముగ దివాస్వప్నముల జూచుచు నొక మూల బడియుండును. క్షణక్షణమును ఉపచారములతో ఉప

శమన వాక్యములతో శాంత యామె నంటిపెట్టుకొని యుండనిచో నామె యేనాడో గుండెపగిలి మరణించి యుండెడిది.

"అమ్మా! నోరెండుచున్నది. ఎంతవేళ యైనదో చూడుము. ఏడుగంటలు కావలెను కదా." అని యామె నిట్టూర్పు విడచెను. శాంత గోడనున్న గడియారమువైపు జూచి, "ఇంకను పావుగంట యున్నది. అయిన నేమి? ద్రాక్షరసము దెచ్చెద నుండుము."

"వలదు. తెలిసినచో నాన్నగారు కోపగించెదరు. ఏడు కొట్టనిమ్ము" అని దీనముగ బలికెను. ఇంతలో హరిహరరాయలు తలుపు దెరచుకొని లోనికి వచ్చెను.

శాంత, "నాన్నగారూ! అమ్మకు గొంతెండి యార్చుకొని పోవుచున్నది. కొంచెము ద్రాక్షరస మిత్తునా?" అని యడుగగా నాతడు గడియారమువైపు జూచి, ఇంకను పదునైదు నిముషము లున్నది. ఏడు కొట్టనిమ్ము." అని పలికి, మూలనున్న చేతికఱ్ఱను దీసికొని బయటకు బోయెను.

తండ్రి మెట్లు దిగి, తోట దాటి, ప్రాకారద్వారము గడచి యావలకు బోయినంతవఱకు గనిపెట్టి, శాంత వడివడిగా వచ్చి భయము లేదని చెప్పి తల్లికి ద్రాక్షపానీయము నిచ్చెను.

ఆనాడు శరత్కాల పౌర్ణమి. గవాక్షమునుండి సంపూర్ణచంద్ర మండలము దృష్టి నాకర్షించుచుండెను. మెల్లగా శాంత గవాక్షము కడకుబోయి చంద్రకళా విలసితమైన బాహ్యప్రకృతి నవలోకించుచు నిలువబడెను. ప్రశాంతమై యుండిన యా జవ్వని గభీరహృదయము నందు అనేకములైన భావతరంగములు లేచి పడుచుండెను.

"ఇంకను దిరిగి రాకుండుటకు గారణమేమో! ఇంత యాకస్మికముగ నాతడు కలకత్తా పోవలసిన పని యేమైయుండును? మూడు దినములైనది. ఇంకను తిరిగి రాలేదు. ఆ మధుర మందహాసమును జూచి మూడుదినములైనది. ఇంకను రాకుండుటకు గారణమేమో!" అని తనలో తాను వితర్కించుకొనుచు తదేకధ్యానముతో ప్రాకారమున కావలనున్న రాజమార్గమువైపు జూచుచుండెను. చూచుచుండగనే నిర్జనమై యున్న యా బాటపై దూరమున నొక వ్యక్తి

కానవచ్చెను. వెంటనే యామె తలుపు తెఱచుకొని బయల్వెడలి ప్రాకార ద్వారము కడకు వడివడిగా బోయి యచ్చట నిలచి యా వ్యక్తి యెవ్వరా యని చూచుచుండెను. మరి నాలుగైదు నిముష ములలో నా పురుషుడు సమీపించెను. ఆతని జూచినంతనే శాంత మహానందపరవశయై, "కృష్ణమోహన్!" అని యాతని బలుక రించెను. "ఎవరు! శాంతా! ఇచ్చట నేమి చేయుచుంటివి? తోట కాయుచుంటివా?" అని కృష్ణమోహన్ మందహాసము జేయుచు ద్వారముకడ నిలచెను.

"ఎప్పుడు కలకత్తానుండి తిరిగి వచ్చితివి?"

"ఇప్పుడే వచ్చుచున్నాను. ఇంకను ఇల్లు చేరుకొనలేదు."

"అంత తొందరగా కలకత్తా పోవలసిన పని యేమి వచ్చినది?"

"పని లేకయే పోవుదునా, శాంతా?"

"మరునాడే తిరిగి వచ్చెదవని మీ యక్కగారు చెప్పినారు."

"అగును. అట్లే యనుకొంటిని. కాని, కలకత్తానగరము ఒక్క పనితో నన్ను విడచిపెట్టునా? అమ్మ క్షేమముగా నున్నదా?"

"అట్లే యున్నది. ఆ చేతిలోని వస్తువేమి?"

"అది నీకు సంబంధించినది కాదు. అమ్మకు సంబంధించినది."

"కలకత్తానుండి అమ్మకోస మేదో తెచ్చియుందువు."

"అదిగో! నీకోస మేమియు తేలేదని కాబోలు మొగము వాడి పోయినది!"

"నాకోసమా! నీవు వచ్చితివి. అది చాలదా?"

"వెట్టిపిల్లా! ఇదిగో నీకోస మేమి తెచ్చితినో చూడు" అని కృష్ణమోహన్ ఒక చిన్న పెట్టెను తన జేబునుండి తీసి, అందుండి చక్కని రత్నపతకముతో నిగనిగలాడుచుండిన యొక బంగారు గొలుసును దీసి ఆమె మెడలో వైచెను. ఆ ముహూర్తమునందు ఆమె హృదయము ఎన్నిసార్లు కొట్టుకొనినదో యూహింపజాలము. ఆనందాతిశయమున నామె నోట మాట రాకుండెను.

"ఏమి, శాంతా! ఈ గొలుసు నీకు నచ్చినదా? పద. అమ్మ యొద్దకు బోవుదము." అని శాంత ప్రక్క నడువ, కృష్ణమోహన్ వడివడిగా నడచి గృహము జొచ్చి కుముద్వతి యెదుట నిలచెను.

"కృష్ణా! ఎప్పుడు వచ్చితివి?"

"ఇప్పుడే వచ్చుచున్నాను. ఇంకను ఇల్లు చేరుకొనలేదు. నీ కొఱకు దెచ్చిన యీ పదార్థమును నీకిచ్చువఱకు నాకు తొందర యైనది. ఇదిగో, చూడు" అనుచు ఒక తెల్లని వస్త్రమునందు గట్టబడియున్న యొక చక్కని కాశ్మీరశాలువను బైకదీసి యిచ్చెను. కుముద్వతి బ్రహ్మానందముతో, "నాయనా! ఎంత చక్కగా నున్నది! ఎంత విలువైనదో!"

"అక్కతో జెప్పకుమా. నలుబదియైదు రూప్యములైనది ఇంత సొమ్ము వెచ్చించితినని తెలిసినచో అక్క మండిపడును. శాంతనైపు జూచితివా? ఇప్పుడు శాంత యెట్లు కనబడుచున్నది?" అనినంతనే శాంత తన మెడలోనున్న బంగారు గొలుసును దీసి "అమ్మా! ఇదిగో కృష్ణమోహన్ నాకు దెచ్చిన వస్తువు. బాగున్నది కదూ?"

"ఎంత బాగున్నది. కృష్ణా! మా సంతోషమునకు ఇంత సొమ్ము ఖర్చుపెట్టితివా?

"లేనిచో, నీ వూరకున్నను శాంత యూరకుండునా? నా ప్రేమచిహ్నములుగ మీ యిర్వురును వీటిని గ్రహింపుడు. అక్కకుగూడ నిట్టి శాలువనే కొని తెచ్చితిని."

"సంతోషము".

"ఇంక నేను పోయి వచ్చెదను. ఇంకను నేను ఇల్లే చేరలేదు. అని యాతడు బయలుదేరెను. బాల్యమునుండియు అత్యంత స్నేహముతో నాతడా కుటుంబమునందు మెలగుచుండెను. కాలక్రమమున యుక్తవయస్కుడై ఉన్నత విద్యావంతుడై, ప్రఖ్యాత న్యాయవాదియై స్వకార్య కలాపములందు దెఱపిలేక యున్నను కృష్ణమోహన్ దినమున కొక్కసారియైనను వీరి యింటికి వచ్చి యోగక్షేమము లరయుట మానలేదు. వారి యావత్ కుటుంబమునకును గూడ కృష్ణమోహన్ అనిన ప్రాణాధికమైన యనురాగము. అందు శాంత హృదయసరోజమున కాతడు బాలార్కుడే యని చెప్పవగును.

అతని సంపర్కము పెట్టుటకు శాంత తోటద్వారము వఱకును వెంట నేగెను. అతని సన్నిధానమునందు ఆమె స్వర్గసౌఖ్యము ననుభవించు చుండెను. అతని హస్తస్పర్శ యామె కమృతసేవనము వలె నుండెను. ప్రాకారద్వారమును జేరుచు వారిట్లు సంభాషించు కొనిరి.

"శాంతా! అమ్మ యారోగ్యము దినదినమును క్షీణించు చున్నట్లు కన్పడుచున్నది."

"అగును. ఏవో స్వప్నములు: రాత్రింబగళ్ళు ఆమె రక్తమును ఆర్చివేయుచున్నవి."

"ఆనాటి ఆ సంఘటనము విషయమేమైన యుండును."

"అగును. ఆ హత్యాకాండమే. అన్నయ్య పలాయితుడై నప్పటినుండియు క్షణక్షణమును ఆమె శుష్కించి పోవుచున్నది. ఈ విషయమై యెట్టి ప్రసక్తియు నాన్నగారి చెవికి బోగూడదుకదా! లోలోన గుమిలిపోవుచున్నది."

"అగును, పాపము." అని కృష్ణమోహన్ తలవంచి యొక నిట్టూర్పు విడచెను. ఏనాడు ఆ హత్య సంభవించెనో ఆనాటినుండియు ఆనందకందమై యుండిన యా భవనముపై నొక గాఢ విషాదచ్ఛాయ ఆవరించెను. ఆ కుటుంబమునందు శాంతి నశించెను.

"మోహన్! ఎన్నటికైన అమ్మ హృదయమునకు స్వస్థత లభించునా?"

"భగవత్సంకల్ప మెట్లున్నదో! మేఘములు చెదరవలెను కదా! వేచుకొని యుందము."

ఇట్లు సంభాషించుకొనుచు వారు ప్రాకారద్వారము కడకు వచ్చిరి. కృష్ణమోహన్ శాంత చేయి బట్టుకొని, "ఇంక నేనింటికి బోయెదను. ఇంక నాలస్యమగునేని అక్క ప్రశ్నపరంపరలకు నేను సమాధానము జెప్పజాలను. శాంతా, ఇంక లోనికి బొమ్ము." అని యామె చేయి నొక్కి తలుపు దెఱచుకొని బయటకుబోయి గృహోన్ముఖుడై వడివడిగా నడువసాగెను. దృష్టిపథమునుండి తప్పి

పోవునంతకును శాంత యాతనివైపే జూచుచు నిలువబడి యుండెను. ఒకానొక మధురస్వప్నమునం దామె మైమఱచి యుండెను.

చంద్రప్రభావిలసితమై ప్రకృతియంతయు నిశ్శబ్దమైయుండెను. రాజమార్గము నిర్మానుష్యమై యుండెను. ఇంతలో మార్గమును నానుకొని యావలి ప్రక్క నున్న మామిడితోపునందు ఏదో యలికిడి వినవచ్చెను. ఈ యలికిడి వలన నామెకు స్వప్నభంగ మయ్యెను. ఎదుటనున్న వృక్షసముదాయమువైపు ఆమె దృష్టి మఱలెను. కొమ్మల సందులనుండి భూమిపై బ్రసరించుచున్న చంద్రకాంతి యందు అస్పష్టముగ నొక వ్యక్తి యామె దృష్టి నాకర్షించెను. ఆమె హృదయము ఒక్కసారిగ క్రుంగిన ట్లయ్యెను. ఆపాదమస్తకము నామె తనూలత పులకాంకురిత మయ్యెను. మనస్సు పరిపరివిధముల బోయెను. చూచుచుండగనే చెట్లచాటునుండి యా వ్యక్తి చేతులెత్తి, "రమ్ము, రమ్ము." అని సౌంజ్ఞ చేయుచుండుట ఆమెకు స్పష్టముగ గోచరించెను. అపూర్వమైన భయోత్పాతము ఆమెను వెనుకకు లాగుచుండినను, సహజముగ ధైర్యశాలిని యగుటచే చలింపక ఆవైపునకే జూచుచుండెను. "రమ్ము, రమ్ము, రమ్ము" అని యవిరామముగ ఆ ఛాయావ్యక్తి సౌంజ్ఞ జేయుచునే యుండెను. కొలది కాలము క్రిందటనే సంభవించిన హత్యా సంఘటనము ఒక్కసారి యామె యంతర్దృష్టియందు తళుక్కు మనెను. ఈ వ్యక్తి యెవ్వరో ఆ సంబంధమే వై యుండు నని యామెకు దట్టెను. ఎంత ధైర్యశాలినియో కాని, "కానిమ్ము, చూతము" అని యామె మెల్లగా రాజమార్గము నతిక్రమించి యా తోటలో బ్రవేశించి యా సంజ్ఞాతవ్యక్తి వైపునకు నడచి పోయెను.

## అధ్యాయము 4

నిశ్శబ్దముగ నడుగులు లెక్కించుకొనుచు శాంత యా ఛాయామూర్తిని సమీపించు చుండెను. ఇంకను ఆ వ్యక్తి సౌంజ్ఞ జేయుచునే యుండెను. సమీపమునకు బోయి శాంత నిలువబడి, యొక మ్రాని వెనుక కొత్తిగిలి నిలచియున్న యా వ్యక్తితో "ఎవరు మీరు? ఏమి కావలెను?" అని గుప్తస్వరముతో బ్రశ్నించెను.

"శాంతా! నీవు నన్ను గుర్తింప లేదా?" అని యాతడు మెల్లగా బల్కెను.

గుర్తించెను. ఆ సుపరిచిత కంఠస్వరము నామె గుర్తించి దుర్వారమైన హర్షాతిశయమును మట్టిపెట్టుచున్న భయోత్పాత ముతో ద్రుళ్ళిపడెను. బొటబొట మని కన్నులనుండి యశ్రువర్షము కురిసెను. పాలముకొప్పువలె దుస్తులు ధరించుకొని రూపుమారియున్న యాతని జూచి శాంత, "అన్నయ్యా! ఈ వేషమేమి? ఇంత కాలము నెచ్చట దాగియుంటివి?" అని యావేదనముతో బ్రశ్నించెను.

"గుర్తించితివా, సోదరీ!"

"నేను గుర్తింపలేకుంటిని. కాని, నా హృదయము గుర్తించినది! అన్నయ్యా! ఇచ్చటకు నీవు వచ్చుట యెంత ప్రమాదకరమో తెలియునా? నీవు పట్టువడినచో — ప్రాణాపాయము!" —

"అగును, ఉరికంబముపై — నాకు దెలియును. విధిలేక వచ్చితిని. ప్రస్తుత పరిస్థితులయందు నీ జీవనయాత్ర అసాధ్యమైనది. ఇంతవఱకును నేను కలకత్తాలో ఒక గుఱ్ఱపుసాలలో కూలిపని చేయుచుంటిని."

"కలకత్తాలోనా?"

"అగును. ఈ గుఱ్ఱపుసేవయందు ఇంక నేనుండజాలను. నాకు మరియొక యుద్యోగము లభించుచున్నది. కొంచెము ధనముమాత్ర మవసరము. దాని నిమిత్తమే నేను ప్రాణములను లెక్కించక యిటు వచ్చితిని."

ఆతని దీనావస్థ నవలోకించి శాంత దుఃఖము నాపుకొనలేక యాతని గౌగిలించుకొని యేడవసాగెను.

"అన్నయ్యా! అన్నయ్యా! ఆనాడు ఆదుర్బుద్ధి నీకేల కలిగెను? అది నీ స్వబుద్ధి కాదు."

"సోదరీ! ఆ హత్య నేను చేయలేదు. హంతకుడను నేను కాను."

"ఏమీ! ఆ హత్య నీవు చేయలేదా?"

" లేదు, భగవంతుడు సాక్షి. ఆ హత్య జరిగినప్పుడు నే నా స్థలమునందే లేను."

ఈ పలుకులు వినుచు శాంత కొయ్యబారుచుండెను. శరీరము వణక జొచ్చెను.

" ఏమీ! ఏమీ! నీవు కేవలము నిర్దోషివా? నిర్దోషినా న్యాయస్థానము శిక్షించ నున్నది?" అని శాంత వెక్కి వెక్కి యేడువ జొచ్చెను.

" సోదరీ! హంతకుడు గౌరి."

" గౌరి యెవ్వరు?"

" నాకు దెలియదు. తెలుసుకొన గోరుచున్నాను. అయినా స్నేహితుడు — ఎవరైన నేమి? నా నిర్దోషిత్వము చెప్పుకొనిన ప్రయోజనము లేదు. నేనే దోషినని న్యాయస్థానము నిర్ణయించినది. పోనిమ్ము. నాపట్ల నాన్నగారి ప్రస్తుత వైఖరి యెట్లున్నది?"

" అణుమాత్ర మైనను మారలేదు. నీ పేరు ఉచ్చరింపరు. అన్యుల నుచ్చరింప నీయరు. పదియేండ్ల పిమ్మట నైన నీవు మఱల నాతని కంట బడినచో నిన్ను బట్టి న్యాయస్థానమున కొప్పగించెదనని యాతడు కోర్టి న్యాయాధిపతుల యెదుట శపథము బూనెనట!"

" ఆతని ప్రకృతి నాకు దెలియనిదా? పోనిమ్ము. అమ్మ నొక సారి నేను చూడవలెను."

" ఇప్పు డది యసాధ్యము. నాన్నగా రెచ్చటికో బోయి యున్నారు. ఇంటికి వచ్చు వేళ యైనది."

" సోదరీ! పదునెనిమిది మాసములైనది ఆమెనుజూచి! ఆమెను జూడకయే పోవలెనా?"

" అన్నయ్యా! ఏమి చేయుదము. విపరీత పరిస్థితులు!"

" సొమ్ముమాట యేమి? అయిదువందలు కావలెను!"

" అన్నయ్యా! సొమ్ము లభింపగలదు. కాని, ఇప్పుడు కాదు. రేపు రాత్రి నీవు మఱల నిచ్చటకు రమ్ము. — అన్నయ్యా! నీవు నిర్దోషి వైనచో నీ నిర్దోషిత్వము నిప్పుడు నిరూపించుటకు గాదా?"

"అది యెట్లు సాధ్యమగును ? నాకు సాక్ష్య మేదీ ? ఇంతకును న్యాయవిచారణము పూర్తియై పదునెనిమిది మాసములైనది. నేను దోషినని నిర్ణయింపబడినది. మరియు, హంతకుడు గౌరి లోకులదృష్టి యందు లేనే లేడు కదా ! పోనిమ్ము. నాప్రాప్తమున కెవ్వ రేమి చేయగలరు ?"

"అన్నయ్యా ! నాకొక యుపాయము తోచుచున్నది. జరిగిన దంతయు కృష్ణమోహన్‌తో జెప్పినచో ఆత డొక్కడే తప్పక నీ నిర్దోషిత్వమును నిరూపించి నిన్ను గాపాడగలడని నాకు దోచు చున్నది. ఆతని ప్రజ్ఞావిశేషము నీకు దెలియును కదా !"

"అవును. ఆతని సహాయము దైవసహాయముతో సమానము."

"అట్లే. రేపటిరాత్రివఱకు నీ వెచ్చట దాగియుందువు ?"

"ఇచ్చటకు మూడుమైళ్ళ దూరమున నున్న యొక పల్లెకోన యందు దాగియుండెదను."

ఇంతలో రాజమార్గముపై దూరమున నొకవ్యక్తి వచ్చుచుం డుట కనబడెను. శాంత భయసంభ్రమములతో, "అన్నయ్యా ! ఆ వచ్చునది నాన్నగారే. నేను పోయెదను. రేపు రాత్రి తొమ్మిది గంటలకు దిరిగి యిచ్చోటికే రమ్ము" అని శీఘ్రగమనమున నిశ్శబ్దముగ తిరిగి వచ్చి యిల్లు చేరెను. మరి యైదు నిముసములలో హరిహరరాయలు ఇంట ప్రవేశించెను.

## అధ్యాయము 5

కల్యాణనగరమున ప్రశాంతమైన యొక భాగమునందు కృష్ణ మోహన్ నివాసగృహము ప్రాకారావృతమై యున్నది. సుమారు దాని కెదుటి పట్టుననే యాతని కచేరీగృహ మున్నది. ఆ ప్రాంతము నందు పేరెన్నికగన్న న్యాయవాది యగుటచే కార్యకలాపములపై వచ్చిపోవు ప్రజానీకముచే నా గృహ మెప్పుడును కలకల లాడుచునే యుండును.

అతిశైశవమందే కృష్ణమోహన్ తల్లిదండ్రులు మరణించి యుండుటచే, ఆతని యేకైక సోదరి సులోచనాదేవి యాతని నత్యం

తానురాగముతో బెంచి పెద్దనుజేసెను. కృష్ణమోహనే యామెకు ప్రపంచము. తమ్ముని విడచి పోజాలక ఆమె యవివాహితగానే యుండిపోయినది. కృష్ణమోహన్‌కు సహితము ఆమెయం దపరిమితమైన భయభక్తులు. ఆమె గీచినగీటు దాటడు. గృహయాజమాన్యమంతయు నామెదే. అతని యాదాయ వ్యయములపై యామెదే సర్వాధికారము. ఇప్పు డామెకు నలుబది యేండ్ల వయస్సు. పూర్వార్జితమైన యావదాస్తియు, అఖండమైన కృష్ణమోహన్ ప్రస్తుతాదాయమును రాజభోగములకు దావిచ్చుచుండినను అత్యంత వివేక పరిశీలనముతో నామె గృహకార్యములను నడపుచుండెను. ఎట్టి పరమ రహస్యమైనను కృష్ణమోహన్ ఆమెతో జెప్పితీరవలెను. దేనికైనను ఆమె యనుజ్ఞ కావలయును. కృష్ణమోహన్‌కు తల్లి, తండ్రి, గురువు, మిత్రుడు, సర్వము నామెయే యై యుండెను.

ఆనాటి యుదయమున కచేరీ గృహమందు లోపలి గదిలో కృష్ణమోహన్ కూర్చుండి తదేకదీక్షతో నేదో కాగితములను జూచుకొనుచుండెను. చావడిలో గుమాస్తా విశ్వాసరాయులు వచ్చిపోవు వారికి సమాధానము లిచ్చుచు తన పని తాను చేసుకొనుచుండెను. విశ్వాసరాయులు పేరునకు దగిన వ్యక్తి. ఏబది యేండ్లు దాటినవి. కృష్ణమోహన్ పై విశేషమైన యభిమానము. నిరంతరము నాతని శ్రేయస్సునే వాంఛించు నిష్కపటశీలుడు. సముద్రతరంగములవలె కచేరీ చావడిలోనికి వచ్చి పోవుచుండిన 'పార్టీ'ల సందడి కొంత కాలమునకు అణగిపోయెను. విశ్వాసరాయులు ఒంటిగా కూర్చుండి యేదో వ్రాసుకొనుచుండెను. అంతలో శాంత యచ్చటకు వచ్చి, "అయ్యా! కృష్ణమోహన్ లోన నున్నారా?" అని ప్రశ్నించెను.

"ఉన్నారు. కూర్చుండుడు" అని యొక యాసనము జూపుచు లోనికిబోయి యామె రాక కృష్ణమోహనున కెఱిగించి, ఉత్తర క్షణముననే తిరిగివచ్చి, "అమ్మా! దయచేయుడు" అని యామెను లోనికి వీడ్కొల్పెను. ఆమెను జూడగనే, కృష్ణమోహన్ విస్మయముతో, "ఏమి శాంతా! ఇటు వచ్చితివి? నాన్నగారు ఇంటియొద్ద లేరా?" అని ప్రశ్నించెను.

శాంత:-"లేని సమయము జూచుకొనియే వచ్చితిని. ఒక వింత సమాచారమును నీకు జెప్పవచ్చితిని. ఇచ్చటి మన సంభాషణము నెవ్వరైన వినుట కవకాశమున్నదా?"

కృష్ణ:- అణుమాత్రమును లేదు. నిర్భయముగ జెప్పుము.

శాంత:- ఇప్పుడు అన్నయ్య ఈ గ్రామ సమీపమునందున్నాడు.

కృష్ణ:- అన్నయ్య! నరేంద్రుడు!

శాంత:- అగును. నిన్నరాత్రి నీవు నన్ను విడచిపోయిన పిమ్మట, నీవైపే జూచుచు నేను ద్వారముకడ చాల సేపటివఱకు నిలచియుంటిని. ఇంతలో మామిడితోటలో సలికిడి యైనది. తిరిగి చూచితిని. చెట్లమధ్యనుండి వెన్నెల వెలుగులో నస్పష్ట దృశ్యముగ నొక వ్యక్తి కానబడి, అవిరామముగ సౌంజ్ఞ జేయుచు నన్ను బిలువసాగెను. మొండిసాహసము వహించి నేను మెల్లగ నా వ్యక్తిని సమీపించితిని. నా శరీరము జలదరించినది. వికారమైన మారువేషములో అన్నయ్య నా యెదుట ప్రత్యక్షమై యుండెను. ఈ పదునెనిమిది మాసములై యాతడు కలకత్తానగరమునందొక యశ్వశాలలో నజ్ఞాతవాసము జేయుచుండెనట! హత్యావిషయమునందు కేవలము నిర్దోషినని చెప్పుచున్నాడు. ఎవడో గౌరి యనువాడు హత్య గావించెనట!"

కృష్ణ:- గౌరియా? ఎవడా గౌరి?

శాంత:- ఎవడో అమీనా స్నేహితుడట! తాను నిర్దోషినని భగవంతుడు సాక్షిగ జెప్పుచున్నాడు. ఆతని పల్కులయందు నాకు సంపూర్ణ విశ్వాసము కల్గినది. ఈ రాత్రి తిరిగి యాతడా స్థలమునకే వచ్చును. ఒక్కసారి నీ వాతని గలియగోరెదను. ఆతని నోటనే నీ వన్ని విషయములను విన్నచో, ఆతని రక్షణమునకు నీకేదైన నుపాయము తోచ గలదు.

కృష్ణ:- నరేంద్రు డిప్పు డిచ్చటకు వచ్చుటకు హేతు వదియేనా!

శాంత:- కాదు, తన రక్షణ మింక నసాధ్య మనియే యాతని యభిప్రాయము. ఆ యాశ యాతని కేమాత్రమును లేదు. కొంత

ధనసహాయము కావలసి వచ్చియున్నాడు. అయిదునందల రూప్యములు ప్రస్తుత మాతనికి లభించినచో ఒక మంచి జీవనోపాధి కనకాశ మున్నదని చెప్పుచున్నాడు. ఆతని రాక నాన్నగారికి దెలిసినచో వానికి ప్రాణోపద్రవము కదా! అమ్మ నన్ను నీ యొద్దకు బంపినది.

కృష్ణ:— ఇప్పుడే కావలయునా?

శాంత:— ఈ రాత్రి మఱల నాత డచ్చటకు వచ్చును కదా! నీవే స్వయముగ నాతని గలసి, మాటాడి, ఈయవచ్చును.

కృష్ణ.— అది చాల... ప్రమాదకరము... సరియే. నేనీరాత్రి వానిని గలసెదను. ఏ వేషము ధరించి యున్నాడు?

శాంత:— నిడుద మీసములతో నొక పొలముకాపువలె నున్నాడు. ఇచ్చటకు మూడు మైళ్ళ దూరమున నొక రహస్య స్థలమందు ఈ దినమంతయు గడపి, రాత్రి తొమ్మిది గంటల వేళకు తోటలోనికి వచ్చును.

కృష్ణ:— మంచిది. మన మీ రాత్రి వానిని గలయుదము.

శాంత:— కాని, ఆ వేళకు నాన్నగా రింటియొద్ద నున్నచో, ఎట్లు?

కృష్ణ:— (ఇంచుక యోచించి) అది నాకు విడిచిపెట్టుము. ఇంక నేమైన చెప్పవలసి యున్నదా?

శాంత:—చెప్పవలసిన దంతయు జెప్పితిని. ఇంక నేను పోయెదను. నాన్నగారు వచ్చువేళ యైనది.''

అని శాంత లేచి నిలచెను. కృష్ణమోహన్ ఆమెను ద్వారము దాటించి తలుపు వేసుకొనెను.

శాంత వచ్చుటయు బోవుటయు వీధి ద్వారమునుండి కృష్ణ మోహన్ సోదరి సులోచనాదేవి కనిపెట్టుచుండెను. పని ముగించుకొని యాత డింట నడుగుపెట్టినంతనే యామె, "కృష్ణా! శాంత యేల వచ్చినది?" అని ప్రశ్నించెను. ఎట్టి రహస్యమైనను ఆమెతో జెప్పుటకు కృష్ణమోహన్ వెనుదీయడు. ఆమెయం దట్టి గాఢవిశ్వాస మాతనికి గలదు. ఆమె సహితము ఆతని రహస్యముల నట్లే కాపాడుచుండును. శాంతివలన విన్న వృత్తాంత మంతయును పూస

గ్రుచ్చినట్లు ఆత డామెతో జెప్పి, "అక్కా! ఈ రాత్రి తొమ్మిది గంటల సమయమున హరిహరరాయలు తన యింట లేకుండునట్లు మనము చేయవలసి యున్నది. నాకొక యూహ తట్టినది. ఈ రాత్రి మన యింట ఆ సమయముననే ఒక విందు నేర్పరచి ఇచ్చటి న్యాయాధిపతుల నందరను ఆహ్వానింతము. హరిహరరాయలను ప్రత్యేకముగ నే నాహ్వానించెదను. ఆతడు తప్పక వచ్చును. తదుపరి కార్యక్రమము నేను చూచుకొందును. ఏమందువు?" అని ప్రశ్నించెను.

"అట్లే కానిమ్ము. పాపము, ఆ కుటుంబమున కెట్టి యవస్థ ప్రాప్తి వచ్చినది!" అని యామె యొక నిట్టూర్పు విడచెను.

ఆమె యంగీకారమును గైకొని, కృష్ణమోహన్ తక్షణమే కచేరి గదిలోనికి బోయి, ఒక కాగితముపై నేదో వ్రాసి, దాని నొక 'కవరు'లో బెట్టి, పై విలాసము తన పేరే వ్రాసి, దానిని గుమస్తా విశ్వాసరాయులచేతి కిచ్చి, "ఈ రాత్రి మనయింట న్యాయాధిపతులకు విందు జరుగును. విందు ప్రారంభించు సమయమున ఈ లేఖను నీవే స్వయముగ దెచ్చి నాచేతి కందిమ్ము" అని యాజ్ఞాపించెను. పిమ్మట, అక్కగారితో విందు విషయమై జ్ఞప్తిపఱచి, కార్యాంతరముపై వీధిలోనికి బోయెను.

## అ ధ్యా య ము 6

రాత్రి యెనిమిది గంట లైనది. ముగ్గురు న్యాయాధిపతులును ఒకరి వెనుక నొకరు కృష్ణమోహన్ భవనద్వారమున బ్రవేశించిరి. యథోచిత సత్కారములతో కృష్ణమోహన్ వారిని లోనికి దోడ్కొనిపోయి సుఖాసీనుల జేసెను. కొంతకాలము వారు పరస్పర సంభాషణములతో హాస ప్రతిహాసములతో గడుప జొచ్చిరి. ఇంతలో నొక సేవకుడు ప్రవేశించి కృష్ణమోహన్‌తో "బాబూ! గుమాస్తా విశ్వాసబాబు తమకొఱకు వచ్చియున్నారు" అని నివేదించెను. మోహన్ లేచి చావడిలోనికి బోయి రెండు నిముసములలో చేత నొక యుత్తరముతో దిరిగివచ్చి యతిథులతో,

"అకస్మికముగ నొక్క యరగంటపాటు నేను మిమ్ము విడువవలసి వచ్చుచున్నది. క్షమింతురా, అతి త్వరితముగ దిరిగి వచ్చెదను!" అని ప్రార్థించెను.

"నిర్విచారముగ బోయిరమ్ము. ఆరగింపుల యానందము ఆరగింపులలో లేదు. వాటికొఱకు వేచియుండుటయందే యానందమున్నది" అని పకపక నవ్వుచు హరిహరరాయలు అందఱి యంగీకారమును తానే తెలియజేసెను.

మరుక్షణముననే కృష్ణమోహన్ గృహము విడచి వడివడిగా తోటవైపునకు నడచిపోయెను. చంద్రకాంతి వృక్షచ్ఛాయలయందు దాగుడుమూతలాడుచుండెను. అంతయు నిశ్శబ్దముగ నుండెను. ఒక్కసారి తోటలోనికి దృష్టిసారించి, కృష్ణమోహన్ హరిహరరాయల ప్రాకారద్వారము జేరెను. వేయి కన్నులతో గనిపెట్టుకొని యున్న శాంత యెదురు వచ్చెను.

"శాంతా! ఇంకను రాలేదా?"

"తప్పక వచ్చును. వచ్చి సౌంజ్ఞ జేయును." అని అత్యంత సంభ్రమముతో నాతని దోడ్కొని గృహము జొచ్చెను. ఆతని జూచి కుముద్వతీదేవి అప్రయత్నముగ కన్నీరు కార్చుచు నిలువబడెను.

"అమ్మా! ఇదిగో సొమ్ము. ఇది నీయొద్ద నుంచుము."

"నాయనా! నా కుమారుని నేనొకసారి చూచుటకు వీలు లేదా? నేనుకూడ నీతో వత్తునా? లేక వానినే యిచ్చటకు దేగలవా?"

"వానినే యిచ్చటకు దెచ్చెదను. ముందు నేను వానితో గొంత సంభాషించి, యనంతరము తోడ్కొని వచ్చెదను."

ఇంతలో గవాక్షమునుండి ఏదేని దృష్టితో తోటలోనికి జూచుచున్న శాంత ఆవేగముతో వచ్చి, "అదిగో! అదిగో! మోహన్! అటు చూడుము." అని గద్గదికతో బల్కెను.

కృష్ణమోహన్ నిదానించి, "మంచిది. నేను వానిని గలసి వచ్చెదను. ఏ మాత్రమును మీరు కలవరము బొందకుడు." అని

ధైర్యము జెప్పి బయలుదేరి బోయెను. రెండు మూడు నిముసములలో నాతడు నరేంద్రుని యెదుట నిలచెను. సహజముగా నాకర్షణీయమై యుండిన యాతని మూర్తి పదునెనిమిది మాసముల యజ్ఞాతవాసముచే పూర్తిగ మారిపోయెను. దానికి తోడు మారు వేసము. నల్లని నిడుదమీసములు. పొలముకాపు దుస్తులు. ఆ వ్యక్తి నట్లె నిదానించుచు కృష్ణమోహన్ కొంతసేపు నిలచి మందహాసముతో, "నరేంద్రా!" అని సంబోధించెను.

"గుర్తించితివా, మోహన్? నా యూ పెట్లున్నది?"

కృష్ణ:-"ప్రశాంతముగ నున్నది! ముద్దులు కట్టుచున్నది! ఆ కోర మీసముతో చాలు, కోట్లకు పడగలెత్తుచున్నవి!"

నరేం:-"నన్ను చూచుటకు అమ్మ వచ్చునా?"

కృష్ణ:-"రాదు. నీవే అమ్మయొద్దకు బోవలెను. మీ నాన్నగారు ఇంటియొద్ద లేరు."

నరేం:- అట్లైన నడువుము. విలంబమున కవకాశము లేదు. నేను శీఘ్రముగ తిరిగి పోవలెను. ఏమైన ధనసహాయము లభించునేమో యని వచ్చితిని.

కృష్ణ:- ధనసహాయము లభించగలదు. హత్యాసంబంధమైన యావద్ వృత్తాంతమును నాకు నీవు తెలుపగోరితివని శాంత చెప్పినది. అంతయు నిచ్చటనే చెప్పుము.

నరేం:- నేను తెలుపగోరలేదు. శాంతయే తెలుపగోరినది. కాని, యేమి ప్రయోజనము? నా మాటల విశ్వసించువా రెవ్వరు? నీవు సహితము విశ్వసింపవు.

కృష్ణ:- అయినను వినగోరెదను. జరిగిన దంతయు సాధ్యమైనంత క్లుప్తముగ జెప్పుము.

నరేం:- నేను హమీద్ కుమార్తెయైన అమీనాను ప్రేమించి యున్నానని మనవా రందరి యభిప్రాయమై యున్నది. కానచ్చును, కాక పోవచ్చును. హమీద్ నా తమ్మ మాట నొక సారి యడిగి యుండెను. ఆనాటి సాయంకాలమున నేను అమీనాను—కాదు, ఎవ్వరినో జూడబోనప్పుడు—.

కృష్ణ:— ఇదిగో, నరేంద్రా ! నీ న్యాయవాది యెదుటను, నీ వైద్యుని యెదుటను దాపరికము పనికిరాదు. నే నేమైన చేయగలనో లేదో తెలిసికొనుటకు ఉన్నది యున్నట్లు నీవు చెప్పవలసి యుండును. అటు కానిచో నే నేమియును విచారించుకొనలేదు.

నరేం:— (తలవంచుకొని) మోహన్ ! ఉన్నది యున్నట్లు చెప్పెదను వినుము. నీవు నమ్మవేమో ! భగవంతుని యెదుట సత్యము బలుకుచున్నాను. అమీనాను నేను ప్రేమించితిని.

కృష్ణ:—ఆమె నీ ప్రేమ నంగీకరించినదా ?

నరేం:— చెప్పజాలను. ఒకప్పు డట్లే యగుపడుచుండెను. మరొక ప్పుడు కొంచెము భిన్నముగ నగుపడుచుండెను. నాకంటె మరియొకనితో కలసిమెలసి యుండుట కామె కెక్కువ యభిలాష యున్నట్లు తోచుచుండెను.

కృష్ణ:—అతడెవరు ?

నరేం:— గౌరి.

కృష్ణ:— గౌరి ? నే నెప్పుడును వాని పేరే వినియుండలేదే!

నరేం:— నీవే కాదు, ఈ కల్యాణనగరమునం దెవ్వరును వాని పేరు వినియుండరు. ఆ విషయమై వా డతిజాగ్రత్తగ వ్యవహరించు చున్నాడు. ఏదో దూరప్రదేశమునుండి అతిరహస్యముగ ఆమె యింటికి వాడు వచ్చుచుండెను. చీకటి పడిన పిమ్మట అశ్వారూఢుడై వచ్చి గుఱ్ఱము నొక మ్రానికి గట్టి ఆమె యింట జొచ్చెడివాడు. ఆమె తండ్రి అమీర్ జాన్ ఇంట లేనిచో రెండుమూడు గంటలు ఇంటిలోనే గడపెడి వాడు; ఇంట నున్నచో ఇరువురును బయటకు బోయి వనవిహారము జేసెడివారు.

కృష్ణ:—సరియే. హత్య జరిగిననాటి విశేషములు జెప్పుము.

నరేం:— ఆనాడు నే నామె యొద్దకు బోవుటకు ఆమెతో ముందే నిర్ణయించుకొంటిని. తన తుపాకి చెడి యున్నందున నా తుపాకి నొకసారి యిమ్మని అమీర్ జాన్ అడిగి యుండుటచే, దానిని పట్టుకొని ఆ సాయంకాలము నేను బయలుదేరితిని. ఎచ్చటకు

పోవుచున్నావని నాన్నగారు ప్రశ్నింపగా, స్నేహితుడు రామ్‌దయాల్ కడకు పోవుచుంటినని చెప్పి వడివడిగా వన మార్గమున హమీరాన్ గృహమునకు పోయితిని. వీధి గుమ్మముపై అమీనా నిలువబడి, "ఇప్పుడు వీలు కాదు. ఇంటికి మరలి పొమ్ము" అని చెప్పెను. ఆపై మా యిద్దఱకును కొంత సంభాషణము జరిగెను. ఆ సమయముననే రామసింగ్ ఆ మార్గమున పోవుచు నా చేత తుపాకి యుండుట చూచెను. ఆమె యాజ్ఞానుసారము నేను మరలి పోవుచు, "ఈ తుపాకి మీ తండ్రి కిమ్ము. జాగ్రత్త సుమా! లోన తోటా నమర్చియున్నాను" అని మరలి వచ్చితిని. కాని, నేను సరాసరి యింటికి రాలేదు. దాని యింట నప్పుడు గౌరి ప్రవేశించి యుండునని నాకు గట్టి సందేహము కల్గెను. ఆ సందేహ నివృత్తికై నేను అచ్చటనే చెట్ల మరుగున నక్కి-యుంటిని. రామసింగ్ తిరిగి వచ్చుచు నన్ను జూచి, "ఏల నిచ్చట దాగియున్నావు?" అని యడిగెను. కాని, నేను వాని కేమియు బ్రత్యుత్తర మీయలేదు. తన దారిని వాడు పోయెను. సుమారు ఇరువది నిముసములైనది. తుపాకి ప్రేలిన శబ్దము వినవచ్చినది. అప్పుడు సూర్యాస్తమయ మగుచుండెను. శబ్దము వినబడిన యుత్తరక్షణమే చెట్ల గుమిలోనుండి వెల్వడి దీక్షిత్ అమీనాజాన్ గృహమువైపు పోవుట నేను చూచితిని. మరి రెండుమూడు నిముసములలో ఆ గృహమునుండి రోజుకొనుచు గౌరి బయటకు లంఘించి నా ప్రక్కనుండి పరుగిడి పోసాగెను. వాని ముఖము జేవురించి యుండెను. దృష్టి చలించుచుండెను. నాకు ప్రత్యర్థి యైన యీ ధూర్తు నెదుర్కొనుటకు హుంకించితిని. కాని ధైర్యము చాలినది కాదు. మరి రెండు నిముసములలో వాని గుఱ్ఱపు డెక్కల చప్పుడు వినవచ్చినది. కన్నుమూసి తెరచినంత కాలములో నశ్వారూఢుడై వా డదృశ్యు డయ్యెను. వీ డింత రోజుకొనుచు పోవుటకు కారణ మేమై యుండునా యని యోచించితిని. బహుశా అమీనాతో నేదో కలహము

సంభవించి కోపముతో బొబ్బరించుచున్నాడేమో యని భావించి సరాసరి నే నా యింటికడకు బరుగున బోయితిని. ఇంట నడుగు బెట్టితినో లేదో అమీరు మృతశరీరముపై దొర్లి నేలబడితిని. ఆ శరీరము రక్తమయమై యుండెను. చావడి యంతయు రక్తపుమడుగై యుండెను. నా తుపాకి యా మృత శరీరము ప్రక్క బడియుండెను. గుండెలపైనున్న గాయము నుండి యింకను రక్తము కారుచునే యుండెను. "అమీనా" అని గట్టిగా బిలచితిని. ఎవ్వరును పలుకలేదు. ఆ యింట నెవ్వరి యలికిడియు లేదు. విపరీతమైన భయోత్పాతము కల్గి, లేచి, ప్రక్కనే పడియున్న నా తుపాకిని దీసికొని బయటకు ఒక్క కేక గంతు వైచితిని. ఈవల బడితినో లేదో రామసింగు కన్నులకు గనబడెను. వానిని జూడగనే గుండె యాగిపోయినట్లైనది. శరవర్షము వలె నొక భావపరంపర నన్ను ఉక్కిరిబిక్కిరి చేసినది. చేతనున్న తుపాకి నింటిలోనికి విసరివైచి పరుగెత్తి సాగితిని. "నరేంద్రా! నరేంద్రా!" అని రామసింగు వెనుకనుండి కేక వైచుచుండెను. కాని నేను వెనుదిరగ లేదు.

కృష్ణ:- నరేంద్రా! నీవు చేసిన ఈ యొక్క యవివేక కార్యమే నీకు ప్రాణోపద్రవము దెచ్చినది. న్యాయస్థానమునందు రామసింగ్ స్పష్టముగ ఈ విషయము జెప్పినాడు. తుపాకి పట్టుకొని రోజు కొనుచు హత్యాగృహములోనుండి యీవలకు వచ్చితివి. రామసింగును జూచి తొట్రుపాటు పడి తుపాకిని తిరిగ యింటి లోనికి విసరివైచి పరుగిడ సాగితివి. అతడు పిలచుచున్నను ఆగక పరుగెత్తితివి. ఇంతకంటె నేరమునకు ఋజు వేమి కావలెను?

నరేం:- నా కర్మము. నా పిరికితనమే నన్నింతకు దెచ్చినది. భగవంతుడు నన్నొక గొఱ్ఱెను జేయవలసె యుండెను. ఈ గొఱ్ఱె బుద్ధికు ఈ ప్రాప్తినే తగి యున్నది.

కృష్ణ:- సరియే, తరువాత నేమైనది?

నరేం:- ఇంతలో దీక్షిత్ నా కెదురయ్యెను. 'గారిని నీవు చూచి తివా' అని నేను వాని నడిగితిని. "ఏ గారియో, యెవ్వరును

నా కెదురుపడలేదని వాడు చెప్పెను. 'తుపాకి శబ్దము విన లేదా?' అని యడిగితిని. 'వింటిని. అది యీ వనములో వేటచేయుచుండిన రామసింగ్ తుపాకిశబ్దమై యుండును' అని వాడు బదులు చెప్పెను. గౌరిని వాడు చూడలేదనుట స్పష్టము. వానిని విడచి నేను నా దారిని బోయితిని.

కృష్ణ:- ఆరాత్రియే నీవు కల్యాణనగరమునుండి మాయమైపోతివా?

నరేం:- అగును. పోవుటకు ముందు మాత్రము, మరొకసారి అమీనా నెట్లైన జూడగోరి యామె యింటికి బోయితిని. నన్ను జూడగనే యామె పిచ్చిపక్కివలె మొఱగ జొచ్చెను. ఆ యఱపులకు ఇంటిలో నిద్రాగియున్న వారందఱును బయటకు వచ్చిరి. ఆమెయే నాపై దోషారోపణము జేసినచో, లోకుల మాట చెప్పనేల యని నేనా ప్రదేశమును విడచి ఆరాత్రియే కలకత్తా నగరమునకు బోయి యజ్ఞాతవాసము సేయ జొచ్చితిని.

నరేంద్రుడు తన కథను పూర్తిజేసెను. కృష్ణమోహన్ నరేంద్రుని నోట వెల్వడిన ప్రతివాక్యమును అత్యంత సావధానముగా వినుచు బ్రధానాంశములను గుర్తుపెట్టుకొనుచుండెను. క్షణమాత్ర మాగి, యాత డిట్లనియెను.

"నరేంద్రా! అట్లైన, ఆ సాయంకాలమున, ఆ గృహప్రాంతమునందు నలుగురు మాత్రమే యుండిరి. నీవు, దీక్షిత్, రామసింగ్, గౌరి. ఈ నలుగురిలో నెవ్వరో యొకరు తుపాకి ప్రేల్చియుండవలెను. నీవు దూరమున చెట్లగుబురుగున నుంటివి. రామసింగ్ కాజాలడు. వానిని నీ వా క్షణమందే చెట్ల గుబిలోనుండి వచ్చుట జూచితివి. మరి దీక్షిత్?

నరేం:- దీక్షిత్ కాడు. వాడు సహితము ఆక్షణమందు దూరమున నా దృష్టిపథమునందే యుండెను. నిస్సందేహముగ ఆ హంతకుడు గౌరియే. నీవు నన్ను విశ్వసింపవా?

కృష్ణ:- ఇంకను యోచింపవలసి యున్నది. ఆ గౌరి పేరే నే నిదివఱకు వినియుండలేదు. వానిని నీవు బాగుగ గుర్తింపగలవా?

నరేం:— గుర్తింపలేకేమి? సుమారు ఇరువదియైదేండ్ల ప్రాయము. మంచి పొడుగరి. పలుచని శరీరము. నల్లని శిరోజములు. కుడిచేతి వ్రేలిపై నొక పెద్ద వజ్రపుటుంగరము! మంచి స్ఫురద్రూపి యనియే చెప్పవచ్చును. వేషమును బట్టి చూడ నేదో గొప్పయింటి బిడ్డ యనియే చెప్పవలెను. తఱచుగా ముఖముపై దిగజారుచుండు ముంగురులను కుడిచేతితో మీది కెగద్రోచుకొనుచుండును. ఆ సమయమున ఆ వజ్రపుటుంగరపు కాంతి యెల్లర దృష్టి నాకర్షించుచుండును.

కృష్ణ:— (ఇంచుక యోచించి) వా డెచ్చటనుండి వచ్చుచుండెనో నీవేమైన గనిపెట్టితివా?

నరేం.— ఒకసారి మాత్రము ఏదో సందర్భమున, వాడు జమాల్ పురమునుండి వచ్చుచుండెనని అమీనా చెప్పియుండెను.

కృష్ణ:— జమాల్ పురమా? ... ఇచ్చటికి సుమా రిరువదిమైళ్ళ దూరములో నున్నది.

నరేం:— కావచ్చును. నేను రూఢిగా జెప్పజాలను.

కృష్ణ:— ఇప్పుడు అమీనా యెచ్చట నున్నది?

నరేం:— అది నా కెట్లు తెలియును? నే నా రాత్రియే పోయితినికదా!

కృష్ణ:— ఆమె కూడ నీతోనే పోయినదని యిచ్చట నందఱి యభిప్రాయమునై యున్నది.

నరేం:— నాతోనా? రామ, రామ! ఆనాటినుండి ఆమెను గూర్చి నేను వినియైన యుండలేదు.

కృష్ణ:— పోనిమ్ము. ఇంక నాతో నీవు చెప్పదలచిన యంశములేమైన నున్నవా?

నరేం:— అంతయు జెప్పితిని. ఇందొక్క యక్షరమైన మిథ్య లేదు. భగవంతుడే సాక్షి.

కృష్ణమోహన్ అతి మెలకువతో నాతని కథ యంతయు నాలించి, "మంచిది. రమ్ము. అన్ని నొకసారి చూడుము." అని యాతని దోడ్కొని గృహము జొచ్చెను.

ఇంట దాస దాసీ జనుల యలికిడి యేమియు లేదు. కుము ద్వతియు, శాంతయు, వేయి కన్నులతో వారి రాకకై వేచుకొని యుండిరి. నరేంద్రుని జూడగనే కుముద్వతి తటాలున బోయి వానిని కౌగిలించుకొని ముద్దుపెట్టసాగెను. మాతాపుత్రులను యన్యోన్య ప్రేమ సంభాషణములకు విడచి, కృష్ణమోహన్ నరేంద్రుని నోట తాను వినిన యావద్వృత్తాంతమును విమర్శించుకొనుచు గృహము జేరెను.

"కాలహరణము జేసితిని. క్షమింప గోరెదను." అని చేతులు జోడించుచు నాతడు గౌరవనీయులైన యా యతిథుల యెదుట నిలచెను.

"ఏమియు కాలహరణము కాలేదు మోహన్! మా సంభాషణములలో నీవు పోయినది నెప్పుడో, వచ్చితి నెప్పుడో కూడ మేము గుర్తించ లేదు." అని హరిహరరాయులు మందహాసము జేసెను.

సద్రసోపేతములైన భక్ష్యపానాదులతో నొక యర్ధగంటలో విందు పూర్తి యయ్యెను. తదుపరి ధూమపానములతో, లోకాభిరామాయణములతో, హాస్య ప్రసంగములతో మఱియొక గంట గడచిపోయెను. పిమ్మట గౌరవనీయులైన యా యతిథు లందఱును యుచితోచిత శయ్యాగృహములలో నిద్రించిరి. కృష్ణమోహన్ తన కచేరి గృహములోనికి బోయెను. అంతవఱకును గని పెట్టుకొని యున్న గుమాస్తా విశ్వాసరాయులను మాత్రము లోనికి బిలచి కూర్చుండ నియమించి, యిట్లు సంభాషించెను.

కృష్ణ:— విశ్వాస్, ఇచ్చటికి సుమారు యిరువది మైళ్ళ దూరములో జమాల్ పురమను గ్రామము కలదు కదా!

విశ్వా:— అగును. ఆ గ్రామము నాకు కొంత పరిచితమే.

కృష్ణ:— అచ్చట గౌరి యను వ్యక్తి, యిరువది యైదేండ్ల ప్రాయపువా డెవడైన గలడా? మంచి స్ఫురద్రూపి; పొడుగరి; పలుచని శరీరము; వ్రేళ్ల వజ్రపు టుంగరములతో, విశేష బాహ్యాడంబరముతో ధగధగ లాడుచుండును. అట్టి యువకు డెవ్వడైన నా గ్రామమునందు గలడా?

విశ్వా:— గడచిన ఆదివారము నాడు నేనచ్చటనే యుంటిని. అట్టి వా డెవ్వడు నా దృష్టి నాకర్షించలేదే! ఏమీ! విశేష మేమైన గలదా?

కృష్ణ:— కలదు. ఆ నాటి హత్యా సంఘటనమునందు మన నరేంద్రుడు నిర్దోషియేమో అని నాకు సందేహము కలుగుచున్నది.

విశ్వా:— నిర్దోషియైనచో నదృశ్యుడై పోవుట యేల?

కృష్ణ:— కాదు. అందలి రహస్యమును నీకు జెప్పుచున్నాను. నరేంద్రుని నేను కలసితిని. అతని మాటలయందు నాకు గొంత విశ్వాసము కలుగుచున్నది. హత్య గావించినది యెవడో గౌరి యని చెప్పుచున్నాడు. ఈ విషయమై నేను రహస్య పరిశోధనము జేయదలచితిని. నీవు నాకు సహాయము జేయ వలెను.

విశ్వా:— బాబూ! హృదయపూర్వకముగ నేను మీకు దోడ్పడెదను.

కృష్ణ:— సాధ్యమైనంత త్వరలో మరల నీవు జమాల్ పురమునకు వెళ్లి, అట్టి వ్యక్తి యెవ్వడైన నా ప్రాంతమునందు కలడేమో కనిపెట్టుము.

విశ్వా:— చిత్తము.

అని విశ్వాస్ బాబు సెలవుదీసికొని వెడలిపోయెను. అర్ధ రాత్రి కావచ్చినది. విందు సంబంధమైన పత్ర పాత్రాదికముల సవరణ యింకను జరుగుచుండెను. పని ముగిసినపిమ్మట నొక్కసారి వినిపొమ్మని దాసి యైన మంజరికి కృష్ణమోహన్ కబురంపెను. ఒక పావుగంటలో నామె యాతని యెదుట నిలచెను. వారిరువురకు నిట్లు సంభాషణము జరిగెను.

కృష్ణ:— మంజరీ! అమీనా నీకు పరిచితయే కదా!

మంజ:— అగును.

కృష్ణ:— ఆమె సమాచార మేమైన దెలియుచున్నదా!

మంజ:—ఆమె సమాచార మెట్లు తెలియును బాబూ? తన తండ్రిని జంపిన నరేంద్రబాబుతో బాటు తానుకూడ మాయమైనది. ఎచ్చట నున్నదో!

కృష్ణ:- ఆయన లేనప్పుడు ఇంకొక వ్యక్తి తరచు మీ యింటికి వచ్చుచుండెను కాదా?

మం:-(కొంచెము కలవరపడి) ఆతడు వచ్చుచుండుట మీకు తెలియునా?

కృష్ణ:- అప్పుడు తెలియదు. ఇప్పుడు తెలిసినది. అతడు జనాక్‌పురమునుండి వచ్చుచుండెనట కాదా?

మం:- అవును, వినోదిని. ఒకసారి యీతని ప్రసంగము రాగా 'అంత వానితో సంపర్కము నీకేల' యని నే నంటిని. మాకు ఆపై కొంత వాగ్వాదముకూడ జరిగినది.

కృష్ణ:- అంతవా డంటివి? ఎంతవాడు?

మం:- నాకు తెలియదు. అతడొక గొప్పవాడని వినోదిని చెప్పును. నే నాతని నొక్కసారి మాత్రమే చూచితిని. అప్పు డతడు ఆమెచెంత కూర్చుండి యుండెను. చూచు దగిన మనిషియే. వ్రేళ్ళపై ధగధగలాడుచున్న ఉంగరములు, ఇంక నేవేవో యలంకారములు, మెరసిపోవుచున్న దుస్తులు, అతడెంతో గొప్పయింటివాడే యని తోచినది. అంతే కాక సైనికోద్యోగియట!

కృష్ణ:- ఎట్లు తెలిసినది?

మం:- అమీనా చెప్పినది.

కృష్ణ:- అతనితోడనే యామె పారిపోయినదేనా!

మం:- కాదు. నరేంద్రునితోనే పోయినదని నాకు గట్టినమ్మకము. మన కల్యాణనగర మంతయు నదేమాట!

ఆమె 'గట్టి నమ్మకము' నుండి యామెను మరల్చుటకు కృష్ణమోహన్ ప్రయత్నించలేదు. 'సరియే' అని యాతడామెను బంపివైచెను.

అనేకములైన యాలోచనములతో నాతని తల బరువెక్కి యుండెను. నిద్రించుటకు బోయెనే కాని, చాల కాలము వఱకు నిద్ర పట్టలేదు.

అప్పుటు, నరేంద్రుడు ఒక యర్ధగంటలో తన తల్లితో సంభాషణము ముగించుకొని యింద్రస్త్రమును బట్టుకొని గృహము విడచి వృక్షచ్ఛాయలయం దదృశ్యుడయ్యెను.

## అధ్యాయము 7

సువర్ణదుర్గము రహస్యముగ కృష్ణమోహన్‌కు విక్రయింప బడెనన్న విషయము ఇంతవఱకును లోకమునకు తెలియదు. సంజీవ రాయలకు ఈ వ్యవహారమును గుఱ్చి తానిచ్చిన వాగ్దానమును కృష్ణమోహన్ పూర్తిగ పాలించుచుండెను. సువర్ణదుర్గమున కిప్పుడు సర్వాధికారి కృష్ణమోహన్ అని పిట్టకైనను తెలియదు. యథాప్రకారముగనే యా ప్రాంత ప్రజానీకము సంజీవరాయలనే యా సంస్థానమున కధిపతిగా గణించుచుండిరి. చివరకు తాతని కుమార్తెయగు స్వర్ణలతకు గూడ లోపలి గుట్టు తెలియదు. ఆ విధముగా సుమారు మూడు మాసములు గడచి పోయెను.

కలకత్తా నగరమునందు రోగచికిత్స పొందుచుండిన సంజీవ రాయలు కొంత కాలము మార్పునకై సువర్ణదుర్గమునకు సపరివారముగ వచ్చెను. అతని రాకకు ఆ గ్రామమునందేగాక, పరిసర గ్రామములందు సహితము ప్రజాహృదయములకు పండుగవలె నుండెను. ముఖ్యముగ, నాగరికులైన కలకత్తానగర వాసులకు ప్రాంతీయ జమీందారుడైన అతని యెడల విశేష గౌరవప్రపత్తు లుండెను. అనుదినమును అతని నివాస భవనము ఆ ప్రాంతమందలి పెద్దల రాకపోకలచే కలకల లాడుచుండెను. రోగగ్రస్తుడైయున్న యాతనిపట్ల వ్యక్తిగతముగ తన సానుభూతి జూపుటకు పెద్ద యని పించుకొనిన ప్రతి పౌరుడును వచ్చిపోవుచుండెను. పిన్నయయ్యును పెద్దలచేత సహితము మన్ననలు పడయుచుండిన కృష్ణమోహన్ మాత్రము సన్నిహిత బంధువువలె విశేషకాల మాతనితో గడపు చుండెను. అది సంజీవరాయలకు సహితము మహానందప్రదముగ నుండెను. అతని పరివారమంతయును కృష్ణమోహన్‌పట్ల విశేష భక్తిగౌరవములు కల్గియుండెను. అతని ప్రశస్తిని సహితము వారి భక్తివిశ్వాసములకు దగియుండెను. హరిహరరాయల యింట నాతడెంత చనవుగ మెసలుచుండెనో సంజీవరాయలయింట సహిత మాతడంత చనవుగనే మెసలుచుండెను.

ఒకసారి జమీందారుగారి కుమార్తె స్వర్ణలతతో కృష్ణ మోహన్ చనవుగా మాటాడుచుండుట శాంత కంటబడెను.

అది మొదలు ఆమె హృదయమునందు అనేకములగు వింత వింత భావము లుప్పతిల్లసాగెను. తన ప్రేమనిధానమైన కృష్ణమోహన్ హృదయము అన్యాక్రాంతమైనదా యని యామె రేయింబవళ్లు తదేకధ్యానయై నిద్రాహారములకు దూరస్థ యగుచుండెను. ఒకసారి కృష్ణమోహన్ హృదయమును గుర్తింపదలచి, ఆమె యాతనితో, "మోహన్! జమీందారుగారి కుమార్తె స్వర్ణలతాదేవి చాల యందకత్తెయట!" అని మందహాసము జేసెను. ఆ ప్రశ్నయందలి యంతరార్థమును కృష్ణమోహన్ గుర్తింపలేదు. "ఔను. చాల యందకత్తె. ఆమె యుపరూప సౌందర్యమునకు ఆమె సుగుణసంపత్తి వన్నె గూర్చుచున్నది. ఆమె నొకసారి చూడగోరెదవా?" అని యమాయకముగా నూరుబల్కెను. ఈ పల్కులు ముల్కులవలె శాంతిహృదయమున నాటుకొని పోయెను. ఆమె వదనబింబము కళావిహీనమై పోయెను. ఆతనితో నింక సంభాషణము సాగింపజాలక, ఏదో మిషపై నామె యాతని సమీపమునుండి వెడలిపోయెను. ఆమె హృదయాకాశమునందు ఎట్టి ప్రళయమేఘములు ఘోషించుచుండెనో, ఎట్టి ఝంఝామారుతములు వీచుచుండెనో, కృష్ణమోహన్ కేమియు దెలియదు. తన హృదయాకాశము మాత్రము అత్యంత నిర్మలమై, తేజస్సాంద్రమై యుండెను. అణుమాత్రమైన కలుషచింతలేని పవిత్రహృదయు మది! ఇంతవఱకును కృష్ణమోహన్‌కు స్వర్ణలతపట్లను, శాంత పట్లను సోదరీభావము తప్ప అన్యభావము లేదు.

సంజీవరాయుల ఆంతరంగిక వేదనకు దోడు ఆతని శారీరక వ్యథ దినదినమునకు తీవ్రతర మగుచుండెను. రేయింబవళ్ళు ఆతనికి నిద్రలేదు. అవకాశము కల్గినపుడెల్ల కృష్ణమోహన్ - ఆతని యొద్దనే కాలము గడపుచు నాతని కించుక మనశ్శాంతి జేకూర్చుచుండెను. ఆతని కేకైక ప్రాణబంధువై యుండిన స్వర్ణలత తన మనఃప్రాణ సర్వస్వము నాతనిపైనుంచి యాతనికి బరిచర్య జేయుచుండెను.

ఒక మాసము దినములు మాత్రము సువర్ణదుర్గమునం దుండి యంతటితో ఆ నివాసమునకును తనకును గల చిరకాల బంధమును

సడలించుకొని పోవుటకు ఆత డచటకు వచ్చి యుండెను. కాని, ఆ మాసము దినములు గడునక పూర్వమే భగవంతు డాతనిని ప్రాపంచిక బంధనముల నుండియే సడలించి వైచెను.

ఆనాడు కృష్ణచతుర్దశి. కల్యాణనగరము నందలి యొక నిరుపేద గాయకుని సహాయార్థము ఏర్పరుపబడిన గానసభకు తండ్రి యనుజ్ఞ గైకొని స్వర్ణలత పోయి యుండెను. ఆమె యుద్దేశ్యానుసారము కృష్ణమోహన్ సహితము మాసభకు బోయి యుండెను. సభ క్రిక్కిఱిసి యుండెను. యుక్తాసనముపై స్వర్ణలత పరిజనముతో నాసీనయై యుండెను. కృష్ణమోహన్, తదితర భద్రజనులును యథోచితాసనము లలంకరించి యుండిరి. గానసభాకార్యక్రమము సక్రమముగ సాగుచుండెను. ఆ గాయకుని గానకళా ప్రదర్శనమునందు విశేష మేమియు లేకుండినను, ఆతని పేదస్థితిపట్ల సర్వత్ర ప్రదర్శిత మగు చుండిన సానుభూతిచే సభామందిరము ప్రశాంతముగా నుండెను. సుమా రొక గంట కార్యక్రమము గడచిపోయెను.

అంతట, రోజుకొనుచు నొక సేవకుడు "కృష్ణమోహన్ బా బెచ్చట?" అని వగర్చుకొనుచు ద్వారము నద్ద సందడి చేయ సాగెను. తన నిమిత్త మెవ్వరో వచ్చియున్నారని తెలిసి కృష్ణ మోహన్ లేచి యావలకు బోయెను. సేవకు డతని జూచినంతనే నమస్కరించి. "బాబూ! తక్షణము స్వర్ణలతాదేవిని దోడ్కొని రండు. ప్రభువువారు జీవించునట్లు తోచదు. లక్షణము లన్నియు చాల విపరీతముగా నున్నవి." అని పల్కెను.

"డాక్టరుగారు వచ్చియున్నారా?" అని యాత డడిగెను.

"వచ్చియున్నారు. ఏదో చికిత్స చేయుచున్నారు. కాని, ఆతని ముఖముపై నిరాశ కన్పడుచున్నది. తక్షణమే మిమ్మును, అమ్మగారిని, దోడ్కొని రమ్మని నన్ను బంపినారు. బండి వేచి యున్నది. దయచేయుడు" అని తొందర జేసెను.

కృష్ణమోహన్ తిరిగి లోన ప్రవేశించి, క్రిక్కిఱిసియున్న ప్రేక్షక బృందము మధ్యనుండి త్రోవ జేసికొని, స్వర్ణలత చెంతకు

బోయి, సగౌరవముగ నామెతో నేమియో చెప్పి, ఆమెతో గూడ బయటకు వచ్చెను.

"నాన్నగారికి వ్యాధి విషమించి యున్నదట! తక్షణమే రమ్మని వార్త బంపిరి"

"ఏమి! ఏమైనది? నేను వచ్చుసరి కేమియును లేదే! ఇంతలో నేమి ముంచుకొని వచ్చినది?" అని యామె భయకంపితయై గద్గదికతో నాతని బ్రశ్నించెను.

"విశేష మేమియు నై యుండదు. ఆ వ్యాధి లక్షణమే యట్టిది. హఠాత్తుగ విషమించుచుండును. తిరిగి శాంతించుచుండును. ఏమియును భయపడవలదు." అని ధైర్యము గొల్పుచు నామెను బండిలోని కెక్కించి, తాను ముత్తముపై గూర్చుండి, బండివానిని శీఘ్రముగ దోలుమని యాజ్ఞాపించెను. పది నిముసములలో బండి వచ్చి భవన ద్వారమున నాగెను. అంతయు నిశ్శబ్దముగ నుండెను. కాని, ఆ నిశ్శబ్ద వాతావరణము సామాన్యముగ నర్ధరాత్రివేళ నుండునట్టిది కాదు. గవాక్ష ద్వారములనుండి వెలికి వచ్చుచున్న వెలుగునం దేదో యొక అసామాన్యత, ఏదో యొక అవ్యక్త దైన్యత, ఏదో యొక అస్పష్ట ఖిన్నతా ప్రసారిత మగుచుండెను. అందలి యర్థము దృశ్యాదృశ్యముగ కృష్ణమోహన్‌కు స్ఫురించెను. ఏదో యొక యపూర్వ యాతన స్వర్ణలత హృదయము నదలించుచుండెను. ఇరువురును వడివడిగా బండిదిగి లోన బ్రవేశించిరి. అవనతవదనుడై యొక సేవకు డెదురువచ్చి, "ప్రభువువారు పరమపదించినారు" అని గద్గదికతో బల్కెను. పిడుగువంటి యీ వార్త కర్ణముల సోకినంతనే 'ఆఁ!' యని కెవ్వున నొక కేక వైచి యతిసుకుమార యగు నా బాలిక మూర్ఛాగతయై నేలగూలెను. ఆమె కేకైక ప్రాణబంధు వగు తండ్రి గతించెను. మహాసముద్రమున ఝంఝానిల మధ్యమున జిక్కుపడియున్న యామె కొక కింక దిక్కెవ్వరు! క్షణమాత్రము కృష్ణమోహన్ ఆమె దీనవదనముపై దృష్టినిల్పి, సేవకుల సహాయమున ఆమెను తన గదిలో మంచముపై బరుండబెట్టి, ఒక సేవకురాలి నచ్చట గాపుంచి, తాను మేడమీదికి బోయెను.

## అ ధ్యా య ము 8

అస్తమయముతో అంధకారమువలె సంజీవరాయల మరణ వార్త క్రమముగ సర్వత్ర వ్యాపించెను. అశ్వారోహులై వచ్చిన వారు, శకటారూఢులై వచ్చినవారు, కాలినడకను ధూళి ధూసరితాంబరులై వగర్చుకొనుచు వచ్చినవారు, వందలకొలది భవనప్రాంగణమున గ్రిక్కిఱిసి పోవుచుండిరి. సంజీవరాయల మరణమునకై సంతాపమును దెలుపుటకు వీరెల్లరును రాలేదు. ఋణగ్రస్తుడై మరణించిన సంజీవరాయల ఋణదాతలు వీరు. పదులిచ్చినవారు, వందలిచ్చినవారు, వేలిచ్చినవారు; ఇప్పుడు వారిగతి యేమికావలెను? వారి ఋణము లెట్లు తీరును? ఆతడు చిల్లిగవ్వయైనను మిగుల్చ లేదని కర్ణాకర్ణిగా దెలియుచుండెను. నానా దుర్భాషలతో, శాప వాక్యములతో, హుంకారములతో, ఝుంకారములతో, ఆ గృహా వరణ మంతయు మారుమ్రోగుచుండెను. ఈ మహా సముద్రము నెదుర్కొనుటకు ఆ గృహమునం దెవ్వరు కలరు? దిక్కుమాలిన పక్షి, ఒక్క స్వర్ణలత తప్ప ఉత్తరవాది యింకెవ్వరు కలరు? తన తండ్రి ఇంత ఋణగ్రస్తుడై యుండెనని యా బాలిక యింత వఱకు నెఱుగదు. పితృమరణాఘాతముచే గ్రుంగిపోయి మూలబడియున్న యా సుకుమార బాలిక యీ ఋణదాతల యాగ్రహాలాపములు చెవిని సోకినంతనే గజగజ వణకసాగెను. క్షణక్షణమును వారి వికృత గర్జనములు అధికమగుచు మిన్ను ముట్టుచుండెను. కోపావేశమున గొందఱు ఘాతుకులు అత్యాచారమునకు సహితము సిద్ధమగుచున్నట్లు కన్పడుచుండెను. ఈ ప్రమాదస్థితిని గుర్తించి యొక దాసి స్వర్ణలతను మేడపైకి దీసుకొని పోయెను. క్రింద ఆవరణ మంతయు నిందాఘోషములతో, రోషాలాపములతో వాతావరణమును ఘూర్ణిల్ల జేయుచున్న ప్రజా సంఘములో నల్లకల్లోలముగ నుండెను. ఆ మాటల తుపానులో నుండి, "వాని ఘారసురాలైన ఆ పిల్ల యేదీ? దాగిపోయి నంతమాత్రమున 'తప్పిపోవు ననుకున్నదా?" అను మాటలు ఆమె కర్ణముల బడెను. ఆ మాటలు వినినంతనే ఆమె మేడ దిగివచ్చి చావడి యంతయు నిండి విక్రమించుచున్న జనసమ్మర్దము

నెదుట నిలచెను. ఆ బాలిక యచ్చట ప్రత్యక్ష మైనంతనే యొక్కసారిగ సముద్రము నిశ్శబ్దమైన ట్లయ్యెను. అందఱి దృష్టులును ఆమె బాష్పాకుల నేత్రములపై కేంద్రీకరించెను. రెండు మూడు నిముసముల వఱకు ఎవ్వరి నోటను మాట రాలేదు. పిమ్మట, పెద్దమనిషివలె గన్పడుచున్న యొక వయోవృద్ధుడు ముందునకు వచ్చి, "అమ్మా! నీవేనా జమీందారుగారి కుమార్తెవు?" అని ప్రశ్నించెను.

"ఔను" అని యామె మెల్లగ దలవంచెను.

"పాపము, వివేకశూన్యుడై నీతండ్రి నిన్ను సహితము నిరాధారను జేసి విడచెనని వినుచున్నాము." అని యాతడు కొంత మృదువుగా బల్కెను.

"దుర్మార్గుడు! తన తాతగారిసొమ్ము! ఈపీనుగ మా ఋణము దీర్చుటెట్లు? నీవు తీర్చెదవా?" అని గ్రుడ్లెఱ్ఱజేసికొని మఱియొకడు కఠినముగ బ్రశ్నించెను.

క్రమక్రమముగ నాల్గువైపులనుండియు ప్రశ్నపరంపరలు శరపరంపరలవలె నా సుకుమారిపై వర్షింపసాగెను. నోట మాటరాక, ఆమె యేకధారగ నట్టె యేడ్చుచు, కొంతసేపటికా జనసమూహము నుద్దేశించి,

"అయ్యలారా! నేను కేవలము నిస్సహాయను! నాచేత నొక్క కాసైనను లేదు. నన్నేమి చేయుమందురో ఆజ్ఞాపించుడు" అని దీనముగ బల్కెను. దీనాలాపములకు గఱగిపోయెడి మృదుల హృదయ మొక్కటియు నా జనసమూహమునందు లేదు. 'ఈమె నా ఋణమును దీర్చునా? ఈ మేజా నాది. ఈ సోఫా నాది. ఈ బీరువా నాది.. ఈ కుర్చీలు నావి. ఇది నాది., అదినాది' అని యెవరికి దొరికిన వస్తువులను వారు హక్కుపఱచుకొనుచు రాబందు మూకలవలె ఋణదాతలు గృహాంగణమునందు గల ప్రతివస్తువుపైనను వ్రాలుచు భీభత్సము జేయుచుండిరి.

ఈ సమయమున తటాలున కృష్ణమోహన్ ఆ చావడియందు బ్రవేశించి యచ్చటి విపరీత దృశ్యమును గాంచి, "ఎవరు వీరు?

ఇచ్చట మీ కేమి పని యున్నది?" అని సింహగర్జనము జేసెను. ఆ గర్జాధ్వనికి చేపల సంత వలె చెలరేగుచున్న యీ వాతావరణ మంతయు నిశ్శబ్ద మయ్యెను. అందఱి దృష్టులును కృష్ణమోహన్ వైపు మఱలెను. ముకుళితమై యుండిన స్వర్ణలత ముఖపద్మము వికసింప నారంభించెను. సుమారు రెండు నిముసములు ఆ యావత్ ప్రజానివహమునందును ఒకరిపై నొకరు చూపులు తప్ప యెవ్వరి నోటను మాట వెల్వడ లేదు. పిమ్మట, అందొకడు ధైర్యము వహించి కృష్ణమోహన్ తో, "అయ్యా! జమిందారుగారు మీ స్నేహితులే యైనచో, మేమిప్పు డేమి కోరుచున్నామో మీ రెఱిగియే యుందురు. మేము వారి ఋణదాతలము. ఋణ పరిష్కారము కై వచ్చితిమి." అని చెప్పెను. అంత నాతడు "అయినను, మీ కిచ్చట నేమి పని యున్నది? మీ రీ గృహమునం దఱుగు పెట్టుట నా చట్ట విరుద్ధము! ఇంకను మీ రిచ్చట మసలితి రేని మీ యావన్మందిపై నేను చర్య దీసికొన వలసి వచ్చును." అని కఠినముగా బల్కెను.

ఈ మాటలకు విచ్చవడి యొకరిద్దరు, "అనగా? మీ యభిప్రాయ మేమి?" అని బొమలు ముడుచుకొనుచు బ్రశ్నించిరి. అంతట కృష్ణమోహన్ అచ్చట నున్న యొక సోఫాపై నాసీను డగుచు,

"మీకు ఇంకను దెలియక పోవచ్చును. ఈ సువర్ణదుర్గము యావత్ వస్తుసమేతముగ నాకు విక్రయింపబడినది."

"ఎప్పుడు? ఎప్పుడు?"

"మూడు మాసములైనది. ఇప్పుడు దీని యధిపతిని నేనని గుర్తించుడు."

"అసంభవము! సువర్ణదుర్గము విక్రయింప బడినదట! మోసము!"

"అధిక ప్రసంగములు చాలించి, కచేరికి బోయి నిజానిజములు తెలిసికొనుడు. నేను కళ్యాణనగర వాసిని. నాపేరు కృష్ణమోహన్. నన్నెఱిగినవారు బహుశా మీలో కొందఱుందురు. నే నొక న్యాయవాది నని మీకు దెలిసినచో ఈ వ్యవహారమునందు

లోప ముండదని మీరు గ్రహించగలరు. సంజీవరాయలు ఇంత కాలము నిచ్చట నివసించియుండుట కేవలము నాయింట నొక యతిథివలెనే యని గ్రహించుడు. మీ రాతని ఋణదాతలైన, ఆతని యాస్తి యెచ్చటగలదో అచ్చటకు బొండు. ఇచ్చట మీకు బని లేదు.'' అని స్పష్టముగ జెప్పెను.

నీరు జల్లిన నిప్పుకణములవలె నా జనసమ్మర్దమంతయును చప్పున చల్లారిపోయి మసిబొగ్గగ్గిమివలె నల్లబారెను. ఇంక నచ్చట నుండిన ప్రయోజనము లేదని చీమలబారువలె నా జనప్రవాహము ఘుమ ఘుమ లాడుచు వచ్చిన త్రోవను బయటకు బోయిరి. 'మొఱ్ఱో' యని వారు పోవునపుడు హృదయాంతరాళమును భేదించుకొని పై కుబుకుచుండిన దుర్భర వేదనతో కన్నీరు గార్చుచు స్వర్ణలత, ''అయ్యలారా! నేను ప్రస్తుతము నిస్సహాయను. నిరాధారను. నా తండ్రిపక్షమున నేను మీకు ఋణగ్రస్తురాలనై యున్నాను! ఎన్నటికైన భగవదనుగ్రహము కలదేని, నేను మీ ఋణమును సంపూర్ణముగ దీర్చుకొందును. నన్ను క్షమింపుడు, క్షమింపుడు'' అని చేతులు జోడించి వెక్కి వెక్కి యేడువనాగెను. ఆమె వాగ్దానము నా సమయమున విని విశ్వసించువారెవ్వరు? ఛీత్కారములతో, ఫూత్కారములతో, హాహాకారములతో నామూక యంతయు బయటకు బోయెను.

పిమ్మట ఏకధారగ కన్నీరుగార్చుచు నొకమూల నిలచియున్న స్వర్ణలత యొద్దకు కృష్ణమోహన్ పోయెను. ఆమె దుఃఖము నుపశమింప జేయుగల శక్తి ప్రపంచమునగలదా యనిపించుచుండెను. ఇంక నామె కెవ్వరు దిక్కు? తనది యని చెప్పుకొనుటకు ఒక తన శరీరము తప్ప వేఱేదియు నచ్చట లేదు! అఖండైశ్వర్య వాతావరణమున, తండ్రి యపరూప ప్రేమసుధా తరంగములపై రాజహంసివలె విహరించుచుండిన యా బాలిక యొక్కసారిగ నిరాశాంధకారమున గూలబడెను. ఆమె కన్నులనుండి స్రవించుచుండిన బాష్పప్రవాహమునకు విరామము లేకుండెను. ఆమెను జూచినంతనే కృష్ణమోహన్ గుండె నీరైపోయెను.

"స్వర్ణా! స్వర్ణా! భగవత్సంకల్ప మనివార్యము! ధైర్యము వహించుము." అని యాతడు మెల్లగా బల్కెను.

స్వర్ణ:- ఆర్యా! ధైర్యము కాక, ఇంక నాకేమున్నది? జీవములు మాత్ర మింకను నాకు మిగిలియున్నవి. ఈ భవనము, వస్తువాహన సర్వస్వ సహితముగా, మీ స్వత్వముకదా! ఇంక నే నిచ్చట నిలచుటకు సహితము నధికారము లేదు.

కృష్ణ:- స్వర్ణా! అట్టి చింత యేమాత్రమును వలదు. నా స్వత్వ మును నేను నీ యధీనము జేయుచున్నాను. ఎంత కాలమైనను నీ విచ్చట యథాప్రకారముగ నిశ్శంకముగ నుండవచ్చును. ఇచ్చటి ఖర్చు వెచ్చముల బాధ్యత నీ కించుకంతయు లేదు. ఆ శక్తి భగవంతుడు నా కిచ్చియున్నాడు. పరిస్థితులు చక్క బడక ఎప్పటికి నొకే తీరున నుండవు. దుఃఖింపకుము. మీ తండ్రిగారి సన్నిహిత వారసుడైన దేవేంద్రరాయలు నేడు వచ్చును. ఆతడు తన గృహమునకు నిన్ను దోడ్కొని పోవునని తోచుచున్నది.

స్వర్ణ:- ఆర్యా! ఏమి ఆదరాభిమానములకు ఈ దరిద్రబాలిక కృతజ్ఞురాలు! కాని......కాని......వారి యింటనా నేను నివసించుట!

కృష్ణ:- పోనిమ్ము. ఆ విషయ మిప్పుడేల? వారు రానిమ్ము. నీ యిష్ట మెట్లో యట్లే చేయుము. ప్రస్తుతము అన్యాలోచన లేక నీ గదిలోనికి బోయి యించుక విశ్రమింపుము. నేను త్వరలోనే మరల వచ్చెదను.

అని యామెను దాసి కప్పగించి, తాను అనంతర కార్య కలాపమును నిర్వహించుటకు బయటకు బోయెను.

## అధ్యాయము 9

ఆ మధ్యాహ్నము సుమారు రెండు గంటలకు దేవేంద్రరాయలు సువర్ణదుర్గమునకు వచ్చెను. ఈతడు గతించిన సంజీవరాయలకు సన్నిహిత వారసుడు. శోణాపురపు జమిందారిణియైన వృద్ధాంగన

యింట స్వర్ణలత విందునకు బోయిన సందర్భమున మనకు పరిచిత మైన యామె దౌహిత్రి లీల, ఈ దేవేంద్రరాయల పత్నియే.

బండి దిగి, ప్రేత భూమివలె నిర్జీవమైయున్న యా భవనమునం దాతడు ప్రవేశించెను. సరాసరిగ పోయి యాతడు స్వర్ణలతను జూచి, ఆమె చెంత గూర్చుండి, బాష్పనేత్రుడై, ఆమె నోదార్పసాగెను. వారిరువురును కొంతసేపు సంభాషించిన పిమ్మట ఆతని రాక దెలిసి కృష్ణమోహన్ సంజీవరాయల స్వకీయ కార్యదర్శితో కలసి యచ్చోటకు వచ్చెను. పరిస్థితు లన్నియు వారాతనికి తెలియజేసిరి. స్థిరాస్తు లన్నియు ఋణబద్ధములై యున్నవనియు, సువర్ణదుర్గము కృష్ణమోహన్‌కు విక్రయింపబడెననియు, ప్రస్తుతము ఖజానా సర్వశూన్యమనియు, చివరకు ఏకైక పుత్రిక యగు స్వర్ణలతకు కాసైనను వ్రాయబడలేదనియు, ఆమె కేవల మిప్పుడు నిరాధారయై యున్నదనియు, దాసదాసీజనముల వేతనము లింకను చెల్లింపవలసి యున్నదనియు, శవదహనాద్యుత్తర క్రియ లింకను మిగిలియున్నవనియు, వారివలన నాతడు తెలిసికొని నిశ్చేష్టుడై పోయెను.

"దుర్మార్గుడు! వివేక శూన్యుడు! సర్వనాశనము జేసి చివరకు చచ్చినాడా! ఆ పసిబాలిక గతి యేమి కావలెనని భావించెనో!" పరి నోట మాటరాక, ఆగ్రహాతిరేకమున వాని పెదవులు కంపింపుచుండెను. "కానిండు. ఇంక నిప్పుడు చేయగలిగిన దేమున్నది? ముందు శవదహనము కానిండు. ఉత్తరక్రియలు కానిండు. కృష్ణమోహన్! మీ గుణవిశేషములను స్వర్ణలతవల్ల నిప్పుడే విని యుంటిని. మీ యాదరాభిమానములకు కృతజ్ఞుడను! ఈ పరిస్థితుల యందు మీ సహాయమును నే నర్థించుచున్నాను. ఈ యవశిష్ట కార్యభారమంతయు మీరే వహించి నాకు తోడ్పడ గోరుచున్నాను" అని ప్రార్థించెను.

శవదహనాది క్రియలన్నియు యథావిధిగా ఉన్నతశ్రేణి కనుగుణ్యముగా నెట్టి లోపములును లేకుండ జరిగిపోయెను. దాస దాసీజనుల కీయవలసిన జీతము లన్నియు పూర్తిగ చెల్లింపబడుటయే కాక, అదనముగ నొక్కొక్కని కొక్కొక్క నూనపు వేతనము అధిక

మీయబడెను. ఇంక నొక్క స్వర్ణలత విషయము తప్ప వేరేమియు లేదు. నిరాధార, నిస్సహాయ యగు ఆ బాలిక భావినివాసము దేవేంద్రరాయల గృహము తప్ప వేరేమున్నది? తక్షణమే యామెను తన ధారానగరమునకు పంపివేయుటకు అతడు సర్వ సిద్ధము చేసెను. కార్యాంతరముపై అతి డచ్చటనుండి కలకత్తా నగరమునకు బోదలచి యుండుటచే, తానే స్వయముగ నామెను తన యింటికి తోడ్కొని పోవుటకు వీలుకాకుండెను. చిన్ననాటి నుండియు నామెను కనిపెట్టుకొని యుండిన యొక దాసితో నామెను ధారానగరమునకు బంపుటకు సిద్ధపఱచెను.

ఆ సమయమున స్వర్ణలత యంతర్లోకమందు ఎట్టి భయంకర మైన తుపాను రేగుచుండెనో చదువరు లూహించుకొనవచ్చును. ప్రేమనిధానమైన తండ్రిమరణము! సర్వసౌఖ్యనిలయమైన యైశ్వర్య శిఖరమునుండి పాతాళగహ్వరమునకు హఠాత్ పతనము! ఆనంద కందమైన స్వేచ్ఛావాతావరణమునుండి దుఃఖభూయిష్ఠమైన పరతంత్ర కారాప్రవేశము! అన్నిటిని మించినది ప్రత్యక్షహాలాహలయగు నీల యింటి నివాసము! కాని, పాప మా పరిస్థితియందు ఆ యసహాయ బాలిక యేమి చేయుగలదు? ధారానగరమునకు బోవక తప్పదు. భగవంతునిపై భారమువైచి యామె యందుకు తలయొగ్గెను.

ఆ నివాసభవనముసకును ఆమెకును ఋణముతీరినది. బొట బొట కారుచున్న కన్నీటిని తుడుచుకొనుచు నామె ప్రయాణ సన్నాహ యయ్యెను. ఆమె ప్రయాణమునకు పూర్వమే తాను బయలు దేరుటకు సిద్ధము చేసుకొనెను.

"అమ్మా! నీవు నిశ్చింతగ ధారానగరమునకు పొమ్ము. నీ కే లోపమును కలుగదు. నేను నాపని చూచుకొని త్వరలోనో యిల్లు చేరెదను." అని నచ్చజెప్పి, తాను బండినెక్కెను. బండి కదలిపోవు టకు పూర్వము ఆతడు కృష్ణమోహన్ చేయిబట్టుకొని, "అయ్యా! నేను మీ సహాయము నెన్నటికిని మఱువజాలను. సమయము చూచు కొని యొక్కసారి ధారానగరమునకు దయచేయుడు" అని ప్రార్థిం చెను. కృష్ణమోహన్ చిరునగవుతో నాతని యాహ్వానమును స్వీక రించెను. బండి కదలిపోయెను.

ఆతని సాగనంపి కృష్ణమోహన్ తిరిగి స్వర్ణలతకడకునచ్చెను. అత్యంత హృదయభారముతో నామె యాతని నుద్దేశించి, "ఆర్యా! ఈ యనాథ ప్రాణి కృతజ్ఞతా నమస్కృతులు స్వీకరింపుడు" అని చేతులు జోడించెను.

కృష్ణ:— స్వర్ణా! నీ కృతజ్ఞతకు తగు పాత్రత నేనింకను పొందవలసి యున్నది. మనము కలియుట కిదియే కడసారియైనచో—

స్వర్ణ:— ఏమీ! ఇప్పుడిప్పుడే కదా ధారానగరమునకు మీ రాహ్వానింపబడితిరి. ఆ యాహ్వానమును మీరంగీకరించితిరి కదా!

కృష్ణ:— అగును. కాని, ధారానగరము సువర్ణదుర్గము కాదుకదా! ఎప్పుడో! ఏమో! మన భవిష్యజ్జీవన మార్గము లొండొంటికి ఎంతదూరమున నుండునో! ఈశ్వర సంకల్పము మన మూహింపగలమా? భగవంతుడు నిన్ను సదా కాపాడుగాక! రమ్ము. బండి సిద్ధముగ నున్నది.

అని యామెను బండి నెక్కించెను. దిక్కులేని పక్షియై యేకాకినియై భవిష్యదంధకారమునందు జొచ్చుచున్న యా యనాథ బాలికను చూచుచు కృష్ణమోహన్ కంట తడిపెట్టుకొనెను. బాష్పాకులనేత్రయై యామె తన్ను తాను మఱచి యా బండియందు కూలబడెను. బండి కదలిపోయెను.

కొంతసేపటి కించుక చైతన్యము కలిగి, కన్నీరు తుడుచుకొని ప్రక్కకు మఱలినంతనే తన యొడియందున్న ఒక కాగితపు మడత యామెదృష్టి నాకర్షించెను. దానిని తీసి యామె పరీక్షింపగా అందు అయిదువందల రూప్యముల 'నోటు' ఒకటి యుండెను. ఆశ్చర్యచకితయై ఆమె యా పత్రమునుబట్టి, "ఇది అవశ్యము ఆ యుదారపురుషుడు నా సహాయమునకై విడచిపోయిన సొమ్ము! చెప్పినచో నేను గ్రహింపనని శంకించి యిచ్చుట పడవైచినాడు! ఇది నాకేల? ... నేను దీనిని స్వీకరింతునా? త్రిప్పివైచినచో ఆతని మృదుల హృదయమునకు బాధ కలిగింతునేమో! కాదు. దీనిని ప్రాణధనముగా పదిలపఱచి, నేను మఱల నాతని కలసినప్పుడు స్వయముగ సమర్పింతును." అని యామె నిశ్చయించుకొని దానిని భద్రపఱచెను.

ఆ జోడు గుఱ్ఱముల బండి శీఘ్రగమనమున రాజమార్గమున బోవుచుండెను. తమ ప్రాకార ద్వారము చెంత శాంతి నిలచియుండెను. కృష్ణమోహన్ ప్రేమరాజ్యమునందు తనకు ప్రతిపక్షురాలని తాను భావించుచుండిన స్వర్ణలతను చూచుటకే ఆ సమయమున నామె యచ్చట వేచుకొనియుండెను. కాని, బండి తలుపులు మూసియుండుటచే ఆమెను శాంతి చూడలేకపోయెను. బండి చాలదూరము పోవువరకు నామె యచ్చో నిలచియుండెను. ఇంతలో నామె తండ్రి హరిహరరాయులు కల్యాణనగరము వైపునుండి వచ్చి ద్వారముకడ నిలచియున్న శాంతను జూచి, "అమ్మా! కృష్ణమోహన్ ఇచ్చటకు వచ్చినాడా?" అని ప్రశ్నించెను.

శాంతి:— లేదు.

హరి:—కల్యాణనగర మంతటను పుకారుగానున్నది. కృష్ణమోహనట—

శాంతి:— (ఆత్రముతో) కృష్ణమోహన్?—— ఏమి చేసెను?

మెఱుపు మెరసినట్లు స్వర్ణలత యామె యంతరంగిక దృక్పథమునందు ఒక్కసారి తళుక్కుమనెను.

హరి:— కృష్ణమోహన్ సువర్ణదుర్గమును కొనివైచెనట!

శాంతి:— ఆ విషయము మనతో చెప్పనేలేదే!

హరి:— ఏమో, కావచ్చును. ఆతనికి ధనమున కేమియు కొఱతలేదు కదా!

ఈ సంభాషణము జరుగుచుండగనే సువర్ణదుర్గము వైపునుండి కృష్ణమోహన్ వడివడిగా వచ్చుచుండెను. వీరిని జూచి యాతడు మందహాసముతో పలుకరించెను. అంత హరిహరరాయులు, "మోహన్! సువర్ణదుర్గమును నీవు కొనివైచితివని గాలివార్తలు వచ్చుచున్నవి. నిజమేనా?

కృష్ణ:— (మందహాసముతో) నిజమే.

హరి:— ఆ విషయము మాతో చెప్పనైన చెప్పితివికావు!

కృష్ణ:— సంజీవరాయుల ప్రత్యేక ప్రార్థన ననుసరించి ఆ విషయము రహస్యముగ నుంచితిని. ఇంక దాచవలసిన పనిలేదు కదా!

హరి:— గ్రహించితిని. పాపము! ఋణవ్యథ అనుభవించినవానికే గాని తెలియదు! ... పోనిమ్ము. ఆ రాజభవనము అన్య హస్తంగతము కాకుండ నీవే పొందినందుకు సంతోషము!

శాంత:— అట్లయిన, ఇంక నూతన గృహప్రవేశ మెప్పుడు మోహన్!

కృష్ణ:— (చిరునగవుతో) నూతన గృహప్రవేశమునకు నీకు తొందరగానున్నదా? సుముహూర్తము కుదురవలెను కదా!

అని భావగర్భితముగ బదులుచెప్పి కృష్ణమోహన్ హరిహరరాయల సెలవుతీసికొని నిజగృహాభిముఖుడై పోయెను.

దేవేంద్రరాయలు స్వర్ణలతను ధారానగరమునకు పంపు నేర్పాటుజేసి, తాను కలకత్తానగరమునకు కార్యాంతరమున పోయెనని చెప్పియుంటిమి. అతడు కలకత్తానగరమునందు తన భవనమును చేరగనే అచ్చట నాతని భార్య లీల ప్రత్యక్షమై యుండెను.

"లీలా! నీవేల ఇచ్చటకు వచ్చితివి?" అని యాతని డాశ్చర్య చకితుడై ప్రశ్నించెను.

లీల:— మీరిల్లువిడచిన కొద్దికాలముననే పిల్లవాడించుక అనారోగ్యముగ కన్పడెను. స్థలాంతరమునకు తీసుకొనిపోవుట యుచితమని తోచి, యిచ్చటకుదెచ్చితిని. మరియు, ఇచ్చటినుండి పోయి స్వర్ణలతను స్వయముగ పరామర్శించుటకుకూడ నిశ్చయించుకొని వచ్చితిని.

దేవే:— ఏల? ఆమెయే మన ధారానగరమునకు పోయినదే!

లీల:— (చకితయై) అచ్చటి కేల పోయినది?

దేవేం:— చెప్పుకొనుటకు సిగ్గు! జమీందార్ సంజీవరాయలు చివరకు బిచ్చగాని చావు చచ్చినాడు. పాప మా పసిబిడ్డను నిరాధారను జేసి పోయినాడు. ఇంటి దాస దాసీజనులకు నెలబత్తెములనుకూడ నేనీయవలసి వచ్చినది. శవదహనమునకు సహితము రాగిడబ్బు మిగులలేదు.

లీల:— అట్లయిన, ఇంక స్వర్ణలత యెచ్చటికి పోవును?

దేవేం:— ఎచ్చటికి పోగలదు? ఇంకపై నామె మనయింటనే నివసింపవలెను.

లీల:— మనయింటనా ? అట్లెన్నటికి జరుగనేరదు.

దేవేం:— లీలా! అన్యగతి లేదు. ఆమెను మనతోనే యుంచుకొను టకు నిర్ణయించితిని. ఈసరికి ఆమె ధారానగరము చేరియే యుండును.

ఈ పలుకులు ములుకులవలె నామె కర్ణముల జొచ్చెను. ఆమె ముఖము జేవురించెను. రోషావేశమున నామె బొమలు ముడివైచు కొని, "ఎంతమాత్రమును నే నామెను నాయింట నుంచుకొనజాలను. ఆమె ముఖము చూచిన నాకు మంట! నాతో చెప్పకయే మీరు దాని కెట్లంగీకరించితిరి?" అని తీవ్రముగ నాతనివైపు జూచెను.

దేవేం:— అంగీకరించుటకు ఆమె నన్ను ప్రార్థించలేదు. నేనే స్వయ ముగ ఆ నిర్ణయము జేసితిని. మనము కాకున్న ఆమె కింక దిక్కెవ్వరు ? ఆమె యింక నెచ్చటకు పోవును ?

లీల:— నల్లకాటికి పోనిండు. నాకేల? నా యొద్దమాత్ర మామె యుండుటకు వలనుపడదు.

దేవేం:— లీలా ! శాంతముగ యోచింపుము. మనము కాకున్న ఇంక నీ ప్రపంచమున నా నిరాధార పక్షికి దిక్కున్నదా? ఇంతకును, ఆమె యీసరికి మన యిల్లు చేరియే యుండును. ఇప్పు డామెను బయటకు వెడలగొట్టుదుమా ? అది లోకము సహించునా ?

ఈ వాక్యములచే అంధకారమయమైయున్న యామె హృదయ గహ్వరమునందు ఇంచుక జ్ఞానజ్యోతి పొడగట్టెను. నిరుత్తరమై ముఖము చిట్లించుకొని కొంత తడ వామె యట్లే నిలచియుండెను.

దేవేం:— ఇంతకును, లీలా! ఆమె మనయింట నెంతకాల ముండును? వివాహ పర్యంతమే కదా?

లీల:— ఆ దరిద్రురాలికి వివాహము! సరియే. ఏ దరిద్రునకో ముడి వైచి, క్షణములమీద నీ చీడ బాపుకొనవలెను. ఇంక చేసెడిదేమి ?

అని విధిలేక వికలహృదయముతో నామె భర్త సమక్షము నుండి వెడలిపోయెను.

# అ ధ్యా య ము 10

స్వర్ణలత ధారానగరము చేరిన పది దినములకు దేవేంద్ర రాయలు భార్యాపుత్త్రులతో నిల్లు చేరెను. వచ్చుచునే యాతని యాదరణ పూర్వకముగ స్వర్ణలతను బలుకరించెను. లీల పలుకరింపు నందు మాత్రము అధికార గర్వమును స్వాతిశయమును సువ్యక్త మగుచుండెను. ఆమె వాయుస్పర్శ స్వర్ణలతకు అగ్నిస్పర్శవలె నుండెను. ప్రథమ సమావేశమే యిట్లున్నచో నింక నామె భావి జీవిత మా గృహమునం దెట్లుండునో యోచించుకొనవచ్చును. అది మొదలు గుసగుసలు, బుసబుసలు, దోషారోపణములు, రోషాలాప ములు, అనుక్షణమును పరంపరాగతము లగుచుండెను. పొగబెట్టిన గూడెమువలె నున్న యా వాతావరణమునందు ఆమె యూపిరి యాడ కుండెను. సద్గుణరాశియైన స్వర్ణలతయందు లీల కింతటి ద్వేషము నకు హేతువేమి? ఆమెకు తాను చేసిన యపకారమేమి? అసూయా పిశాచము తన్నావహించినది. తన సౌందర్యముచే లోకము నాకర్షింపవలెనని యామె కాంక్ష! ఈ ప్రయత్నమునం దాయిల్లాలు అసఫలతను సహితము పాటింపదు. చేపలను పట్టుటకు తన దృగ్జా లము లనెడి గాలములను నలువైపులకు వేయుట కామె వెనుదీయదు. ఆమె స్వైరిణి యని చెప్పుటకాదు. కాని, పరపురుషాకర్షణము లీల కొక లీల. ఇట్టి వన్నెల విసనకఱ్ఱకు సహజ సౌందర్యరాశి యగు స్వర్ణలత అసూయా హేతువగుటయం దాశ్చర్య మేమున్నది! ఆమె తన ప్రక్కనుండుట గులకరాయిచెంత వజ్రశకల ముండుట వంటిది. అది యామె సహింపజాలదు. అమాయిక యగు స్వర్ణలత కామె సౌందర్యమే ప్రబల శత్రు వైనది. ఆమెయెడల సంపూర్ణమైన యాదరభావము గల గృహయజమాని దేవేంద్రరాయలు నెలకు ముప్పదిరోజులు దేశాంతరమందే గడపుచుండును. మేఘములందు మెఱుపువలె ఎప్పుడో యొకసారి ముఖము జూపి యుత్తర క్షణమే యదృశ్యుడగుచుండును. ఆ యొక్క క్షణము తప్ప నక్కిన కాల మంతయు స్వర్ణలతకు కత్తులపై నడక యైయుండెను. ఆ విషవాయూ గోళమునుండి, ఆ జలావర్తమునుండి తొలగిపోవుటకు మార్గము లేక,

పాప మామె రేయింబవళ్ళు అశ్రుధారాసిక్తయై క్షణములు లెక్కించుచుకొనుచుండెను. ఆమె భావిజీవిత మామె కంధకార బంధురమై యుండెను.

ఇట్లుండగా నొకదినమున తన మాతామహియైన యావృద్ధయు నామె పౌత్రుడును వారసుడునైన రమాపతియు ధారానగరమునకు వచ్చుచున్నట్లును, అచ్చట కొంతకాల ముండునట్లును లీలకు వార్త వచ్చెను. పిడుగుపాటువలె నీ వార్త లీలను కల్లోలపఱచెను. రమాపతి యచ్చటకు వచ్చును. పూర్వ మొకప్పుడు రమాపతి హృదయము స్వర్ణలతా సౌందర్యముచే నెట్లాకర్షింపబడెనో యామెకు స్మరణకువచ్చెను. ఆ రమాపతివచ్చి తనయింట స్వర్ణలతను జూచును; ఆనాడు స్వర్ణలతపై కేంద్రీకరింపబడి తనవైపునకే మరలనొల్లని యాతని వీక్షణములు ఈనాడు మరలునా? ఆ యవమానమును లీల యెట్లు భరించగలదు. దుస్సహమైన యొక మహావిపత్తు ఇప్పు డామె నెదుర్కొన నున్నది. ఆమె హృదయమునందు ప్రళయవాయువులు వీచ నారంభించెను.

ఆ మఱునాడు వృద్ధాంగనయు రమాపతియు వచ్చిరి. స్వర్ణలత నచ్చట చూచినంతనే రమాపతికి పైడిపంటవలె నుండెను. ఆమెకు సంప్రాప్తమైన దీనావస్థ కెంతయు సంతాపము జూపుచు దినమంతయు నామె చెంతనే గడపుచుండెను. ఆమెతోడనే ఆహారవిహారములు చేయుచుండెను. అసూయాపరీతమగుచున్న లీల హృదయమున కిది ప్రాణసంకటమై దుస్సహమగుచుండెను. గ్రావద్రావ సంక్షుభితాంతరాళమైన యగ్నిపర్వతమువలె నామె పొగలు గ్రక్కుచుండెను. ఏ క్షణమున పతాలున పగిలి సర్వనాశన మొనరించునో యనునట్లుండెను.

స్వర్ణలత ఆ గృహము చేరినది మొదలు పంచవర్షప్రాయుడైన లీలకుమారుడన కామెయొద్ద విశేషమైన చేరిక కల్గెను. ఆమె నొక్క క్షణమైనను విడిచి యుండడు. ఆ యరణ్యవాసమునందు స్వర్ణలతకు ఆ బాలు డొక్కడే యించుక మనశ్శాంతికి హేతువగుచుండెను. ఒకనా డామె యాబాలునితో నచ్చటి కనతి దూరమునందున్న

యొక్క యీ రామమునకు విహరింప బోయెను. ఆమెతో పాటు రమాపతి నచ్చటకు బోయెను. అచ్చట వారు సుమారు చీకటి పడువరకు విహరించి యింటికి వచ్చిరి. వారు బయట నున్నంత కాలమును ఇంటిలో లీల నిప్పులు త్రొక్కుచుండెను. అవిరామముగ అనేకములైన వికృతభావములు ఆమె హృదయగోళమును కల్లోల పరచుచుండెను. అసూయా ప్రభావ మెట్టిదో యనుభవించిన వారికిగాని తెలియదు. అది జీవన్మరణ సంధివంటిది.

అట్టి పరితాపావస్థయందు చిందులు త్రొక్కుచున్న లీల వారిల్లు చేరినతోడనే స్వర్ణలతను బిలిచి కన్నుల నిప్పులు గ్రక్కుచు, “ఇంతసేపటివరకు నచ్చట నుంటివి? ఏమి చేయుచుంటివి?” అని గర్జించెను.

స్వర్ణ:— బాలుని దోడ్కొని యీ రామమునకు బోయి యుంటిని.

లీల:— ఈ కులటావృత్తికా నీవు నాపంచ జేరినది?

స్వర్ణ:— లీలా! నీ యభిప్రాయము నాకు దెలియుట లేదు.

లీల:— ఛీ! స్వైరిణీ! లజ్జాలేశము లేక రమాపతితో నింత కాలమును నీవు స్వైర విహారము చేయలేదా?

ఈ పలుకులు శూలములవలె స్వర్ణలత కోమలహృదయమున గ్రుచ్చుకొనెను. ఆమెవలెనే తాను సహిత మొక యున్నత కుటుంబమున జన్మించినది. ఉన్నత వాతావరణమున పెరిగినది. ఆత్మగౌరవ హాని కలుగుచున్న యీ సమయమున చేతులు ముడుచుకొని యామె నిరుత్తరయై యవమానమును దిగమ్రింగి యూరకుండగలదా? వ్రేటుపడిన నాగుపామువలె నామె కోపారుణిత నేత్రయై లీలవైపు చూచి, “ఏమంటివి? కులటనా? అట్టి కులటాలక్షణము లెందైన నున్నచో అవి నీయందున్నవి. కులటవు, స్వైరిణివి నీవు. నేను కాను.” అని నిశ్చయముగ బదులు చెప్పెను. ఈ వాక్యములు చెవిని బడినంతనే లీల మండిపడి, “ఏమీ! నోరు మూయుము” అని హుంకరించి చేయెత్తి చిక్కిన పాలుగారు ఆమె చెక్కిళ్ళపై నాలుగైదుసార్లు కొట్టెను. ఆ దెబ్బలకు ఒక పెద్ద కేకవైచి స్పృహతప్పి యామె కూలబడెను. చెంతనున్న పసిబాలుడు బావురు

మని యేడువసాగెను. ఆ బాలుని సొంత భ్రాతిని సహింతము దురాగ్ర హమున లీల సహింపలేదు. "నోరుమూయుము" అని ఆ పసిబుగ్గలు కందునట్లు రెండుచరపులు చరచి యీడ్చుకొని పోయెను.

ఆ రాత్రి యంతయు స్వర్ణలతకు నిద్రలేదు. కన్నులనుండి స్రవించుచున్న బాష్పధారకు విరామము లేదు. ఇంక తానచ్చట నుండుట యసాధ్యము. ఎచ్చటకు బోవును? ఎచ్చట నామె కాశ్రయము లభించును? తండ్రి గతించుటకు పూర్వమే తన కేల, మరణము సంభవింపలేదు? ఇంక తానేల జీవించవలెను? పరిపరి విధములైన యిట్టి యాలోచనములతో నామె కా రాత్రి యెట్లో గడచిపోయెను.

అసూయాగ్రస్త యగు లీల యూహించినట్లు రమాపతితో నామె స్వైరవిహార మొనర్పలేదు. కాని యాతనిపట్ల నామె మనో భావము ప్రేమకు చాల సమీపమే యని చెప్పవచ్చును. ఒకానొక యజ్ఞాతబంధనము అత్యంత బలీయముగ నామె నాతనివైపు లాగు చుండెను.

తెల్లవారెను. అనిద్రారుణనేత్రములతో నామె లేచి, ప్రాతఃకృత్యముల దీర్చుకొని, ఒంటిగా తన గదియందు కూర్చొని యుండెను. ఇంతలో దివారాత్రములు తన జట్టు విడువని యా బాలుడు తలుపు తెరచుకొని యామెయొద్దకు వచ్చి నవ్వుమొగ ముతో "అక్కా! అమ్మ యెక్కడికో పోవుచున్నది. అదిగో చూడు! ఇంక మనకు భయములేదులే." అని గవాక్షము కడకు తీసుకొనిపోయెను. బండిలో లీల కూర్చొని యుండెను. రమాపతి ముత్తముపై నుండెను. చూచి, స్వర్ణలత బాలునితో "ఇంక మనకు భయములేదు. క్రిందకు పోవుదము రమ్ము." అని మేడమెట్లు దిగి వసారాలోనికి వచ్చెను. వచ్చిన నాలుగైదు నిముషములలో నొక సేవకుడు వచ్చి "అమ్మా! మీ కొఱ కెవ్వరో వచ్చి ద్వారముకడ వేచియున్నారు" అని చెప్పెను.

"నా కొఱకా? నా కొఱకు వచ్చువా రెవ్వరు?...తోడ్కొ కొని రమ్ము." అని వానిని పంపెను. ఉత్తరక్షణమే కృష్ణమోహన్

ఆమె యెదుట ప్రత్యక్షమయ్యెను. ఆతని జూచినంతనే ఆమె హృదయ మానందపారవశ్యమున సుప్పొంగి పోయెను.

"ఆర్యా! నేడెంతె సుదినము? దయచేయుడు" అని యభ్యుత్థాన మొనర్చి యాసీను జేసెను.

కృష్ణ:— "స్వర్ణా! ఈ ప్రాంతమునకు కార్యాంతరమున వచ్చితిని. నిన్నొకసారి చూడక యే యెట్లు పోగలను? దేవేంద్రరాయలు గ్రామాంతర మేగియున్నారని వింటిని!"

స్వర్ణ:— అగును. వారు ఇంటిపట్ల నుండుటయే చాల యరుదు.

కృష్ణ:— పోనిమ్ము. నిన్ను చూచితినికదా! ఈ బాలు డెవరు?

స్వర్ణ:— దేవేంద్రరాయల యేకపుత్త్రుడు. నన్నొక్క క్షణమైన విడువడు.

కృష్ణ:— అట్లనా, నాయనా! (అని బాలునెత్తి ముద్దుపెట్టుకొని) స్వర్ణా! ఇచ్చట నీ కన్నివిధముల సదుపాయముగ నున్నదా! నా దృష్టికి నీ యారోగ్య మంత సంతృప్తికరముగ నున్నట్లు తోచదు.

స్వర్ణ:— ఏమంత సంతృప్తికరముగ లేదు. నా కిచ్చట నింక నుండవలెనని లేదు.

అని కన్నుల నీరు నింపుకొనెను. అంత నా బాలుడు కృష్ణమోహనుతో, "మా అమ్మ నిన్నరాత్రి అక్కను కొట్టినది. నాకెంతో యేడుపు వచ్చినది. అప్పుడు నన్నుకూడ కొట్టి యీడ్చివేసినది. అందుచేత అక్కకు ఇక్కడ నుండవలెనని లేదు." అని బిక్కమొగముతో చెప్పెను. ఈపలుకులు వినినంతనే, కృష్ణమోహను చకితుడై. "స్వర్ణా! నిజమేనా? కారణమేమి?" అని ప్రశ్నించెను.

స్వర్ణ:— (కన్నీటితో) నా దురదృష్టము! ఇంక నేనీ గృహమునందు వసించుట యసాధ్యము! ఈ విశాల ప్రపంచమున నాకింక తలదాచుకొనుటకు తావే లేనిచో, మరణము తప్ప మరి శరణ్యము లేదు.

ఈ మాటలు కృష్ణమోహను హృదయము ద్రవీభూతము కాసాగెను. నోటమాట రాక క్షణమాత్ర మాతడు స్వర్ణలతవైపు జూచి, పిమ్మట నామెతో, "స్వర్ణా! ఈ పరిస్థితులయందు నేనేమైన నీకు తోడ్పడుట కవకాశము లేదా?" అని యడిగెను.

"నాకు తోడ్పడగలవా రెవ్వరును లేరు. నేను హత భాగ్యను!" అని బొట బొట కన్నీరు గార్చుచు నామె ముఖము త్రిప్పుకొనెను.

కృష్ణమోహను డాలోచనా సముద్రమున మునిగి పోయెను. పరంపరాగతములగుచున్న అనేక భావతరంగము లాతని నుక్కిరిబిక్కిరి చేయుచుండెను. నిరుత్తరుడై కొంతసే పామె బాష్పపూరిత నేత్రములపై దృష్టి నిల్పి, యాతఁ డామెతో "స్వర్ణా! సువర్ణదుర్గమునకు తిరిగి వచ్చెదవా?" అని యడిగెను.

స్వర్ణ:— ఎట్లు రాగలను?

కృష్ణ:— ఇచ్ఛగించినచో దాని కధికారిణివై రాగలవు!

ఈమాటల యర్థ మామెకు సువ్యక్తము కాలేదు.

స్వర్ణ:— ఎట్లు? దానిపై నాకేమి యధికారమున్నది?

కృష్ణ:— నాకధికారమున్నదికదా! నా యధికారమునందు నీవు భాగహారిణివి కావచ్చును.

ఈ పల్కుల యంతరార్థము పాపమామె కింకను స్ఫురింపలేదు.

స్వర్ణ:— ఆర్యా! మీ మాటలు నా కర్థమగుటలేదు.

కృష్ణ:— స్వర్ణా! హృదయపూర్వకముగ నీ కంగీకారమైనచో నీవు నా గృహిణివై సువర్ణదుర్గమున కధికారిణివి కావచ్చును. ...స్వర్ణా! ఈ మాటలచే నీ హృదయమును నేను నొప్పించుట లేదుకదా?

ఈ పల్కులు వినినంతనే స్వర్ణలత కండ్లయెదుట చేతనా చేతనమైన ప్రపంచ మంతయు గిరగిర తిరుగసాగెను. సుడిగాలియందు చిక్కువడిన పక్షివలె నామె హృదయము కొట్టుకొనసాగెను. ఇంత వరకును కృష్ణమోహన్ పట్ల నామె హృదయము నిష్కల్మషమై యుండెను. అపారమైన గౌరవప్రపత్తియు, నిర్మలమైన భ్రాతృ

భావముతప్ప అన్యభావ మామె కాతనియెడ లేదు. ఆతనికి నేనిప్పుడు గృహిణి యగుటయా? ఏమి చెప్పుటకును ఆమెకు నోరాడకుండెను.

ఇంతవరకును కృష్ణమోహన్‌కు సహితి మామెయెడ నట్టి భావము పొడచూపలేదు. ఆ యుదార మానసమును ఆమెపట్ల నిష్కలుషమైన బంధుప్రేమతప్ప అన్యభావ మెన్నడును లేకుండెను. ఆ యసహాయబాలిక దీనావస్థయే యిప్పుడాతని హృదయ పరివర్తనమునకు హేతువు. నిష్కలుషమైన యంతరాత్మతో నాతడు సాహసించి తన మనోభిప్రాయము నామెకు వెలిబుచ్చెను. ఆమె ప్రత్యుత్తరమునకై వేచుకొని యుండెను. ఏమి ప్రత్యుత్తర మిచ్చుటకును ఆమె యంతరంగము నిర్ణయింపజాలకుండెను. ఆమె హృదయ రాజ్యము నీవరకే రమాపతి యాక్రమించుకొనెను. ఆతని నందుండి యామె బహిష్కరింపజాలదు. ఇంక అందు కృష్ణమోహన్‌కు స్థాన మెట్లు లభింపగలదు? నిరుత్తరయై స్వర్ణలత తలవంచుకొని యతని యెదుట శిలాప్రతిమవలె నిలచియుండెను.

ఇంతలో లీల తోటలోనికి ప్రవేశించి అంత దనవ్వుగా స్వర్ణలత చెంత నిలచియున్న యా యపరిచిత వ్యక్తి యెవ్వరాయని చూచు చుండెను. స్వర్ణలత యించుక ధైర్యము తెచ్చుకొని యాతనితో "ఈమెయే ధారానగర జమీందారిణి, లీల" అని యామెను కృష్ణమోహన్‌కు పరిచిత మొనర్చెను.

అంత కృష్ణమోహన్ ఆమెతో "దేవేంద్రరాయలు గ్రామాంతర మేగియుండుట నా దురదృష్టము. నేను వారికి సుపరిచితుడను. నా పేరు కృష్ణమోహన్" అని తన్నెఱుక పఱచుకొనెను.

లీల:—మిమ్ముగూర్చి వినియుంటిని. మీకును స్వర్ణలతకును ఇంత చనవున్నదని నాకు తెలియదు.

కృష్ణ:— ఇంతవఱకును అట్టి చనవు లేదు. ఇప్పుడే దానికి ప్రారంభము. ఇప్పుడిప్పుడే అట్టి చనవు నాకు చేకూర్పుమని యామెను కోరుచుంటిని. ఆమె యిచ్చగించినచో నే నీమెను వివాహమాడ దలచియున్నాను.

ఈ మాటలు లీల కపరిమితమైన యానందమును కలిగించెను. అసూయా జనితమైన యామె యాంతరంగిక రోగమున కిప్పు డొక సిద్ధౌషధము అప్రయత్నముగా లభించినది. తన యింటినుండి తనకు కంటకలకమైయున్న స్వర్ణలతను తప్పించుకొనుట కిప్పు డొక మహావకాశము లభించినది. మందహాసముతో నామె కృష్ణమోహన్ వైపు జూచి,

"ఆర్యా! అంతకంటె స్వర్ణలతకు మహాభాగ్య మేమి కలుగును?" అని పలికి యామెతో "స్వర్ణా! అంగీకారమేనా?" అని ప్రశ్నించెను. ఆమె ప్రశ్నకు స్వర్ణ ప్రత్యుత్తర మీయకయే, కృష్ణమోహన్‌తో మెల్లగా "ఆర్యా! నేను యోచించుకొనుటకు కొంచెమవకాశ మిండు" అని ప్రార్థించెను. కృష్ణమోహన్ ప్రసన్న హృదయముతో, "అట్లే కానిమ్ము. నేను తిరిగి సాయంకాలము వచ్చెదను." అని యథాయోగ్యముగ లీల యనుమతి బొంది యచ్చటినుండి కార్యాంతరముపై వెడలిపోయెను.

అది మొదలు స్వర్ణలత హృదయరంగమున నొక మహా యుద్ధము ప్రారంభమయ్యెను. దేవతా ప్రతిమానుడైన యుదార చక్రవర్తి కృష్ణమోహన్! ఆతని హృదయ మమృతకుంభము! ఆ ప్రేమసుధారాశి నామె గౌరవించుచున్నది. కాని ఆతని నామె ప్రేమించుటలేదు. రమాపతి యామె ప్రేమ సర్వస్వము నాకర్షించుకొని యుండెను. ఎంత ప్రయత్నించినను ఆ యాకర్షణశక్తినుండి యామె హృదయము మరలుటలేదు. కృష్ణమోహన్ ప్రేమ ప్రసారమును తిరస్కరింపజాలదు. తన హృదయ సింహాసనముపై సుప్రతిష్ఠితుడై యున్న రమాపతిని అందుండి బహిష్కరింపజాలదు. సాయంకాలమైనది. ఆమె యింక నెట్టి నిర్ణయమునకును రాలేదు.

తన వాగ్దానము ననుసరించి కృష్ణమోహన్ వచ్చుచుండుట గవాక్షమునుండి యామె చూచెను. చూచి వడివడిగా మేడ మెట్లు దిగి యాతని నెదుర్కొనుటకు క్రిందికి వచ్చెను. కాని ఇప్పు డాతని కేమి ప్రత్యుత్తర మీయవలెనో యామెకు తెలియదు. మెట్లుదిగి, వసారాలోనికి వచ్చినంతనే రమాపతి యామె కెదురుపడెను.

ఆమెను జూచి రమాపతి, "స్వర్ణా! ఇంకేమి! నీవు చాల యదృష్టవతివి! సువర్ణదుర్గమున కధికారిణివి కాబోవుచున్నావు! కృష్ణమోహన్ భర్తయగుట సామాన్యమా? నిన్ను నే నెంతయు నభినందించుచున్నాను." అని మందహాసము చేసెను. స్వర్ణలత యెకసక్కెముగా "సంతోషించితిని. మీ యభినందనముల కింకను సమయము రాలేదు." అని ముఖము త్రిప్పుకొనెను.

"పోనిమ్ము, ఎప్పుడు సమయము వచ్చునో అప్పుడే స్వీకరింపుము. నే నెప్పటికైన నిన్ను అభినందించవలసిన వాడనే కాని, నీతోకూడ అభినందనములను అందుకొను వాడను కాను కదా! ఇంతవరకును ఏవేవో మధుర మధురస్వప్నములను గాంచుచుంటిని. కాని, అవి కేవలము స్వప్నములే యని నాకు తెలియును. నేనేమి మహైశ్వర్యవంతుడను కానుకదా!" అని పలుకుచు రమాపతి ముఖము త్రిప్పుకొని యచ్చటనుండి వెడలిపోయెను.

ఉత్తరక్షణమే కృష్ణమోహన్ ప్రవేశించి యామెను సమీపించెను. స్వర్ణలత నోట మాట రాకుండెను. క్షణమాత్ర మూరకి యాతడు మందహాసముతో "స్వర్ణా! అంగీకారమేనా?" అని ప్రశ్నించెను.

స్వర్ణ:— (భగ్నస్వరముతో) అంగీ ... కారమే! కాని ... కాని... నే నేదో చెప్పవలె ననుకొంటిని ...

కృష్ణ:— సంతోషము! స్వర్ణా! చెప్పు. ఏమి చెప్పదలచితివి?

స్వర్ణ:— ఏమియును లేదు ... కాని ... కాని ... క్షమింపుడు ... ఆవేగముచే నా చిత్తము చలించుచున్నది.

కృష్ణ:— స్వర్ణా! అన్యచింతలను నీ హృదయమునుండి బహిష్కరింపుము. నిర్విచారముగ నుండుము.

అని యామెను బుజ్జగించెను. కాని, ఆమె హృదయగోళము నందు ఆక్షణమునం దెట్టి భయంకర వహ్నిజ్వాలలు చెలరేగుచుండెనో యాతని కణుమాత్రమును తెలియదు.

# అధ్యాయము 11

అసామాన్య పరిస్థితులను బట్టి, అతి నిరాడంబరముగ, క్షణముల మీద నా వివాహము జరిగిపోయెను. దేశాంతరమందున్న దేవేంద్రరాయలు వచ్చుటకు సహితము వ్యవధి లేదు. ఆ వృత్తాంతమాతనికి శీల తెలిపినదో లేదో కాని, కృష్ణమోహన్ సవిస్తరముగ దెలియజేసెను. ఈ పీడ యెంత వేగముగ వదలిపోవునా యని శీల! ఈ దురవస్థనుండి యెంత వేగ మా దుర్భాగ్య బాలికను తప్పింతునా యని కృష్ణమోహన్! ఇరువురి ప్రయత్నములును అగ్నికి వాయువునలె పరస్పరము తోడయ్యెను. ఒక్క రమాపతికి మాత్రము ఈ కార్యవేగము రుచింపకుండెను. సహజముగ నిత్యవిలాసనంతమగు నాతని వదనమును మాత్రము ఒకానొక యపూర్వచ్ఛాయ కళావిహీనము జేసెను.

ఆ మరునాడే కృష్ణమోహన్ స్వర్ణలతను తోడ్కొని సరాసరి కలకత్తా నగరమునకు బోవుచు, తాను ధారానగరమున ప్రత్యేక పరిస్థితులందు స్వర్ణలతను వివాహమాడితి ననియు, పదిదినములలో భార్యాసమేతముగ ఇల్లు చేరెద ననియు, అక్కగారికి జాబు వ్రాసెను. ఈ జాబు చూచినంతనే ఆమెకు కండ్లు చీకటులు గ్రమ్మెను.

"ఎట్టి వా ప్రత్యేక పరిస్థితులు! నా యంగీకారము కూడ వాని కవసరము లేకపోయెనా? వాని కేమి పిచ్చియెత్తినదా? ఆ బంగారు పిచికను భరింపగలననియే యామెను పెండ్లాడెనా? వాని వివేక మేమైనది? రానిమ్ము. రానిమ్ము. కొంపకు వినాశకాలము రాబట్టియే వీడీ పని చేసినాడు. నా సమ్మతి లేక కాలైన కదల్పని వాడు ఇంత స్వతంత్రుడయ్యెనా?" అని పిచ్చియెత్తిన దానివలె చిందులు త్రొక్కి త్రొక్కి, యా వింతసమాచారమును హరిహరరాయల యింట దెలియజేయుటకు ఆమె తక్షణమే బయలుదేరెను.

హరిహరరాయల కుటుంబ మంతకును ఆ వృత్తాంతము అత్యంతాశ్చర్యము గలుగజేసెను. ముఖ్యముగ శాంత హృదయముపై ఆ వార్త నిర్మలాకాశమునుండి పిడుగు పడినట్లయ్యెను. ఒక్కసారిగ

ప్రపంచ మంతయు నామె కింధకార మయ్యెను. తన మనఃప్రాణ సర్వస్వము నాతని కర్పించి యుండెను. ఆమెపట్ల నాతడు ప్రదర్శించుచుండిన ప్రేమాభిమానములకు మురిసిపోవుచుండెను. ఆతని సన్నిధానమామెకు పెన్నిధానమువలె నుండెను. ఆతనితోడి సంభాషణ మామెను పరవశ మొనర్చుచుండెను. ఎన్నటికైనను ఆతడే తనకు భర్తయని సంపూర్ణముగ విశ్వసించి యుండెను. అట్టి కృష్ణమోహన్ తన్ను విస్మరించెనా? అన్యకాంతకు తన హృదయము నర్పించెనా? తన యాశలన్నియు నిరాశలై పోయెనా? స్వర్గసౌధమునకు తాను నిర్మించుకొనుచుండిన రత్నసోపానము లన్నియు నొక్కసారిగ కూలిపోయెనా? తన కిక ప్రపంచమున తావులేదు. దుర్భరమైన హృదయభారముతో, పొంగి పొరలి వచ్చుచున్న మహాదుఃఖముతో, తన ముఖము నచ్చట చూపజాలక ఆమె యచ్చోటు విడచి మేడమీదికి బోయి తన గదిలో మంచముపై కూలబడి, వెక్కి వెక్కి యేడువ సాగెను. కన్నీరు వరదయై పారసాగెను. తన మనోవేదన నెవ్వరితో చెప్పుకొనగలదు? సుమా రొక గంటసేపు ఆమె యట్లేడ్చి యేడ్చి మెల్ల మెల్లగ స్వప్నమయ ప్రపంచమున మేను మఱచెను. ఎన్ని మధుర మధురసంఘటనము లా స్వప్నరంగమున నామె నలరించి యుండెనో యెవరి కెఱుక! కన్నీటిజాడల మరుగున తొలకరించుచుండిన ఆనంద రేఖలతో నామె లేచి మంచముపై కూర్చుండెను. కాని, చూచుచుండగనే స్వప్నానంద వికసితమైన యామె వదన మండలము తిరిగి మేఘాచ్ఛన్న మయ్యెను. స్వర్గసౌధమునుండి యొక్కసారిగ అగాధ నరకకూపమునం దామె కూలినట్లయ్యెను. కృష్ణమోహన్ స్వర్ణలత సొత్తు! కృష్ణమోహన్ తన కిక జీవితమునందు అందరాని యాకాశ కుసుమము! ఎంత యాపుకొన యత్నించుచున్ను ఆగక ఏకధారగ నామె కన్నులనుండి బాష్పవర్షము కురియుచు సాగెను. ఇంతలో తల్లి పిలుపు ఆమె చెవిని బడెను. వడివడిగా లేచి, కన్నీరొత్తుకొని, లేని సంతోషము ముఖముపై తెచ్చుకొని, మేడమెట్లు దిగి క్రిందికి వచ్చెను.

అప్పటికి కుముద్వతీదేవి యెదుట కృష్ణమోహన్‌పై నగ్ని వర్షము కురిపించుచున్న యాతని యక్కగారు ఎట్టకేలకు శాంతించిన

యగ్నిపర్వతముఁవలె నేడి నిట్టూర్పు లెగయించుచు కూర్చుండి యుండెను. "దుర్మార్గుడు! వివేకశూన్యుడు! ఆమె యంతర మేమి? తన యంతర మేమి? ఆ మదపుటేనుగను భరింపగలననియే తలపై నెక్కించుకొనెనా? అనుభవించును. సర్వనాశనముతోపాటు వానికి పశ్చాత్తాపము కల్గును." అని ధుమధుమ లాడుచు, కాలాతీత మగుటచే లేచెను. నవ్వుమొగముతో శాంత యామెకడకు బోయి, "అమ్మా! పోనిమ్ము. ఆతని కామంత్రము స్వేచ్ఛ లేదా? సువర్ణ దుర్గము నూతన వధూవరులచే నూతనశోభ గాంచగలదు" అని సాంత్వన వాక్యము లాడెను.

"శోభ! ఆ నూతన శోభ యెట్టిదో చూచెదవులెమ్ము." అని, శాంత వెంట నడువ ఆమె గృహోన్ముఖి యయ్యెను.

శాంతహృదయము నామె యీవఱకే గుర్తించి యుండెను. కృష్ణమోహను నామె ప్రేమించి యున్నదని యామెకు తెలియును. ఆ ప్రేమపట్ల నామెకు సంపూర్ణ సానుభూతి యుండెను. యుక్త సమయమున వారిరువురకును వివాహము చేయుట కామె వేచుకొని యుండెను. ఇంతలో నీ చిచ్చర పిడుగు వచ్చి పడెను. ఇంక చేయున దేమి?

తమ్ముని జాబు ననుసరించి యామె సంసారమంతయు కల్యాణ నగరమునుండి సువర్ణదుర్గమునకు మార్చివేసెను. ఇది యామెకు రుచింపకున్నను, ఆతడెట్లును సువర్ణదుర్గముననే నూతన వధూ సహితముగా నుండక తీరడనియు, ఇంక తానొక్కతెయే వేఱింట నుండుట యవివేకమనియు నామె భావించెను. మఱియు, ఆ క్రొత్త సంసారమును పగ్గములు పట్టియుంచవలసిన బాధ్యత తనదే యనియును తాను భావించెను. యథాయోగ్యముగ నూతన భవనమునందు సంసార సామగ్రి నంతయు నమర్చెను.

పదియవనాడు నూతన వధూసమేతముగ కృష్ణమోహన్ సరాసరి సువర్ణదుర్గమునకే వచ్చెను. వచ్చినంతనే, లేని యానందము ముఖమునకు దెచ్చుకొని, వారి కభ్యుదాన మొనర్చి గృహప్రవేశము చేయించెను. అంతరాళమున మండుచుండిన అగ్నిహోత్రమును అతి

ప్రయాసమున చల్లార్చుకొనుచు, ఒక్క కఠినోక్తిచేనైన వారి హృదయములను నొప్పింపక, ఆ దినమంతయు నెట్లో గడపెను.

ఆజన్మపరిచితమైన యా గృహమునం దడుగు పెట్టగనే, గతించిన తన యావజ్జీవన లీలయు స్వర్ణలత యంతర్దృష్టికి గోచరించెను. ప్రేమ నిధానమైన తండ్రి శయనాగారము కడకు బోయి దుఃఖము పట్టజాలక పెద్ద పెట్టున నేడువ సాగెను. ఎట్లో ఆమె దుఃఖము నుపశమింపజేసి కృష్ణమోహన్ సహస్ర విధముల ప్రేమోపచారములచే నామెకు మనశ్శాంతి గూర్చెను.

ఆ రాత్రి సావకాశముగ కృష్ణమోహన్ అక్కగారి యెదుట గూర్చుండి, తన వివాహ కథా కాండము నంతయు పూసగ్రుచ్చినట్లు ఆమెకు విన్నవించెను. మాటయందుగాని, ప్రవర్తనయందుగాని మార్దవమేమో యెఱుగని జాతి వ్యక్తి యామె! అయినను రెండవ నాటికే స్వర్ణలత ప్రశాంత మధుర మానసము ఆమె హృదయము నాకర్షించెను. ఐశ్వర్యమునందు పుట్టి పెరిగి, ఆడంబర వాతావరణమున కలవాటుపడి, చెప్పుటయే కాని, చేసి యెరుగని యాధిక్య గౌరవమున విహరించి యుండిన యా జమీందారుబిడ్డ, ఇంత నిరాడంబర జీవియు, ఇంత వినయ వినమ్రయు నగునని యామె భావించి యుండలేదు. సంసారము సర్వనాశనమై పోవుననే కలవరము ఇప్పుడామెకు దూరస్థ మయ్యెను.

మరునటి దినమంతయు సువర్ణదుర్గము నూతన వధూవరుల నభినందించుటకై వచ్చిపోవు బంధుమిత్ర సంఘములచే శోభాయమానమై యుండెను. ఆ ప్రాంతమునందు కృష్ణమోహను నెఱుగని వారును, ఆతనితోడి పరిచయమునకు గర్వించనివారును లేరు. ఇప్పుడు జమీందార్ కుమార్తెయైన స్వర్ణలతతోడి వివాహము ఆతని గౌరవమును ద్విగుణీకృత మొనర్చెను. బంధుకోటియందగ్రగణ్యుడైన హరిహర రాయలు కూడ భార్యాపుత్రికలతో వచ్చెను. కృష్ణమోహన్ యథోక్తముగ వారిని గౌరవించి స్వర్ణలతను వారికి పరిచయ మొనర్చి యామెచే వారికి నమస్కరింపజేసెను. పిదప ఆమెను శాంత కప్పగించుచు, "శాంతా! ఇదిగో, నీ సోదరి స్వర్ణ!

ఈ స్వర్ణమునకు నీవు పరిమళమై మా కందరకు నానందము కలిగించుము.'' అని మందహాసము జేసెను. శాంతయు మందహాసము జేసెను. కాని, ఆ మందహాసము మరుగున ఎట్టి మనోవేదన దాగి యుండెనో వా రెవ్వరికిని దెలియదు.

శాంత యా గృహమునం దడుగు పెట్టినది మొదలు స్వర్ణలత యందే యామె దృష్టి లగ్నమై యుండెను. ఆమె సౌందర్యమును మనసార మెచ్చుకొనెను. ఆ ప్రశాంత నేత్రములందలి నిగ్గు తన దృష్టి నాకర్షించెను. కాని ... కాని ... కృష్ణమోహన్ హృదయరాజ్యముపై సర్వాధికారిణి యామె! నేనెవ్వరు? నా కేమున్నది? హతభాగ్య! భగ్నహృదయ!

అన్యోన్య విలాస సంభాషణములతో మహానందముగ వారు సుమారు రెండుగంటల కాల మచ్చట గడపిరి. పిమ్మట యథోచిత సత్కారములంది వారు గృహోన్ముఖులైరి. కృష్ణమోహన్ ప్రత్యేక ప్రార్థనపై శాంత సాయంకాల మగునంతవర కచ్చటనే యుండెను. అన్యోన్యముగ, ఆనందముగ, శాంతా స్వర్ణలతలతో కృష్ణమోహన్ ఆ సాయంకాల మంతయు గడపెను. చీకటి పడజొచ్చెను. శాంతను వారి యింట విడచివచ్చుటకు కృష్ణమోహన్ స్వయముగ నామెతో బయలుదేరెను.

చిన్నగా రాజమార్గమున బోవక వారిద్దరును పొలము గట్లపై నుండి అడ్డు త్రోవను పోసాగిరి. దూరమున మందల మరలించుచుండిన పసుల కాపరులు తప్ప జనసంచార మేమియు లేకుండెను. ఉండుండి యొక్కొక్క పక్షుల బారు ఆ నిశ్శబ్ద వాతావరణమును ఛేదించుకొని గగనమార్గమున బోవుచుండెను. చిత్రవర్ణాలంకృతమై యుండిన పశ్చిమాకాశము క్రమక్రమముగ వెలవెల బోవుచు ధూసరచ్ఛాయావృత మగుచుండెను. అంధకారము చెట్ల గుముల నుండి తొంగి తొంగి చూచుచుండెను. పొలము గట్లపై సుమారు సగము దూరము మౌనముగ గడచిపోయిన పిమ్మట, శాంత హృదయాంతరాళము నదలించుచుండిన మనస్తాపము నడచుకొనజాలక, పొంగి పొరలి వచ్చుచున్న దుఃఖము నాపుకొనలేక, వెక్కి వెక్కి

యేడువ సాగెను. కృష్ణమోహన్ విస్మితుడై, "శాంతా! ఏమి! ఏమైనది? ఏడ్చుచుంటివేల?" అని యామెను నిలువరించి ప్రశ్నించెను. ప్రత్యుత్తర మీయక నామె కన్నీరు తుడుచుకొనుచు వెక్కి-వెక్కి- యేడ్చుచుండెను.

కృష్ణ:— కారణమేమి శాంతా! నావలన నీకేమైన నపచారము కలిగినదా?

శాంతి:— (భగ్నస్వరముతో) అపచారమునకుగాని ఉపచారమునకు గాని నే నెవ్వతెను? నేను భగ్నహృదయనై మరణించినను నీ కేమి? నీ భార్య నీకు కలదు కదా!

కృష్ణ:— (ఇంచుక యోచించి) గ్రహించితిని. శాంతా, నీ మనోవేదనకు కారణము గ్రహించితిని. కాని నీ హృదయమునందు అట్టి విపరీత భావము ఎట్లుత్పన్నమైనదో నే నూహింపజాలకున్నాను.

శాంతి:— నీ హృదయమును నీవు నా కిచ్చియుండలేదా? నా ప్రేమ హృదయమును నీవు పరిగ్రహింపలేదా? ఈ సువర్ణహారము నీ ప్రేమచిహ్నము కాదా?

కృష్ణ:— నిస్సంశయముగ ఈ సువర్ణహారము నా ప్రేమ చిహ్నమే! నిస్సంశయముగ నేను నిన్ను ప్రేమించితిని. ప్రేమించుచున్నాను. కొనయూపిరి యుండునంతవఱకు నేను నిన్ను ప్రేమింతును. ఇందుకు నా యంతరాత్మయే సాక్షి!

శాంతి:— అట్లయిన, ఈ వివాహ మెట్లు సంభవమైనది?

కృష్ణ:— ఈ వివాహమునకును మన యన్యోన్యప్రేమకును సంబంధము లేదు శాంతా!

శాంతి:— అనగా?

కృష్ణ:— ఈ వివాహము భార్యాభర్తృసంబంధము! ఇందు వర్తించు ప్రేమకును, మన యన్యోన్యప్రేమకును సంబంధము లేదు. భార్యాభర్తృప్రేమ ప్రేమసోపానపంక్తియందు అడుగుమెట్టు! మన ప్రేమ పవిత్రమైన సోదరీసోదర ప్రేమ! ఇంత కాలమును నేను నిన్ను నా సహోదరివలె ప్రేమించుచుంటిని. నీవు

సహితము నన్ను నీ సహోదరుని వలెనే ప్రేమించుచుంటివని నా భావము! నిష్కల్మషమైన సోదరప్రేమ తప్ప అన్య భావము నీ యందు నా కెన్నడును లేదు.

శాంత:— మోహన్!... మోహన్!... నా ప్రేమహృదయము నీ కగోచరమయ్యెనా? ... నాకింక మరణము తప్ప మరి శరణ్యము లేదు ... నీ చేతులతో నీవే నన్నంతము చేసి వేయుము.

కృష్ణ:— శాంతా! ఏమిది? నీ హృదయ మింత దుర్బలమైనదా? మఱచిపొమ్ము. నిష్కళంకమైన నా సోదరప్రేమను స్వీకరింపుము. నీ ప్రేమ పరివర్తనముచే నన్ను ధన్యుని జేయుము.

ఈ పల్కులకు ఝంఝూమారుత్ ప్రసారముచే నుఱ్ఱూతలూగు కోమల వృక్షాగ్రమువలె శాంతహృదయము కంపింప సాగెను. కన్నులనుండి బాష్పవర్షము కురియుచునే యుండెను. నోట మాట రాక శిలాప్రతిమవలె నామె యట్టె నిలచియుండెను.

ఇంతలో సువర్ణదుర్గమునుండి శాంతను దోడ్కొని వచ్చుటకై హరిహరరాయలు పంపిన పరిచారిక దీపము పట్టుకొని వడివడిగా వచ్చుచు నచ్చట వారిని గలసెను. అంతె, శాంత "మోహన్! పరిచారిక వచ్చినది కదా! ఇంక నీకేల శ్రమ?" అని మెల్లగా బల్కెను.

"కాదు. నిన్ను ఇంటి ద్వారముకడ విడచివచ్చెదను, రమ్ము." అని పురోగమన మొనర్చి, వారి ప్రాకార ద్వారముకడ నాగి, "శాంతా! ఇంక నేను పోయెదను. నీ హృదయవేదనను పూర్తిగ తుడిచివేయుము. సర్వేశ్వరుడు నిన్ను సదా కాపాడు గాక?" అని పల్కెను.

శాంత:— మోహన్! నేను నీ కపరాధ మొనర్చితినేమో! నీహృదయమును వేధించితినేమో! నన్ను క్షమింపుము. నేనొక పిచ్చి దాననైతిని. నా పల్కులను గణింపనని వాగ్దానము చేయుము.

కృష్ణ:— ఇదిగో, నా యంతరాత్మ యీ వాగ్దానము చేయుచున్నది. నిర్విచారముగ నుండుము. తఱచు సువర్ణదుర్గమునకు వచ్చుచుందుము.

అని యామెను లోనికి బంపి, తాను గృహాభిముఖుఁడై మఱలి పోయెను. ఆరామద్వారముకడ ఆతనికై స్వర్ణలత వేయి కన్నులతో కనిపెట్టుకొని యుండెను.

స్వర్ణ:— మోహన్! ఇంత యాలస్య మైన దేమి?

కృష్ణ:— అనవసర మే! మార్గమధ్యమున వారి పరిచారిక యెదురు వచ్చెను. కాని, నేను సరాసరి యామెను వారింటివఱకు దిగబెట్టి వచ్చితిని.

స్వర్ణ:— ఆ కుటుంబమునందు మీ కంత చనవు కలదా?

కృష్ణ:— అగును. మాకు బంధుత్వము కూడ కలదు.

స్వర్ణ:— మోహన్! శాంత నిశ్చయముగ చాల చక్కనిది!

కృష్ణ— సందేహమేమి? ఆమె రూపు ఎంత చక్కనిదో, ఆమె హృదయము కూడ అంతె చక్కనిదే సుమా!

స్వర్ణ:— (చిరునగవుతో) అట్లనా?...... ఆమెను మీరు ప్రేమించుచున్నా రన్నమాట!

కృష్ణ:— (నవ్వి) స్వర్ణా! ఎట్టి సందేహము నీకు కలిగినది!— నేను ప్రేమించినది ఇప్పటికి ప్రపంచమున కేవల మొక్క తెయే! ఎవరో తెలియునా?— ఇదిగో!

అని యామెను కౌగిలించుకొని లోనికి దోడ్కొని పోయెను.

## అ ధ్యా య ము 12

స్వర్ణలతా కృష్ణమోహనుల అన్యోన్య ప్రేమ ఫలముగా అచిర కాలమునందే స్వర్ణలత గర్భమునం దొక యాడశిశువు జన్మించి సువర్ణదుర్గమునకు మెఱుగు వెట్టెను. ఆ శిశువునకు నిరంతర పరిచర్య నిమిత్తము హరిహరరాయల యింటనుండిన చపల యను దాసి వారి యంగీకారముపై నియమింపబడెను. ఈమె కాక, ఆదినుండియు నా యింట నుండిన మంజరి యను దాసి యుండనే యున్నది. గృహ కార్యకలాపము జూచుకొనుటకు మంజరియు, శిశు పరిచర్య చేయుటకు చపలయు నిర్ణయింపబడెను.

చపల హరిహరరాయుల యింట నున్నంతకాలమును. ఆమె కును శాంతకును అనుక్షణమును వాగ్వాదములే! ఆమె యనిన శాంతకు మంట! శాంత యనిన ఆమెకు మంట! ఈ మంట ఆ యింటనుండి విడిపడినను చపలకు చల్లారలేదు.

ఒకనాటి మధ్యాహ్నము ఇంటి చాకిరి యంతయు చక్క పెట్టుకొని మంజరి విశ్రాంతి నిమిత్తము చపలయొద్దకు వచ్చెను. చెంతనున్న ఊయెలయందు శిశువు హాయిగ నిద్రించుచుండెను. ఇరువురును ఇష్టాగోష్టి చేసుకొనుచు చాలసేపు కూర్చుండిరి. ఇరువురు స్త్రీలు ఇష్టాగోష్టికి లంకించుకొన్నచో ప్రపంచమంతయు సింహావలోకనము చేయబడును. చీపురుకట్ట మొదలుకొని శ్రీరామచంద్రుని వరకు విమర్శింపబడని పదార్థ ముండదు. శాంతపై చపలకుగల మంట తీర్చుకొనుట కప్పుడు మంచి యవకాశము లభించెను.

"మంజరీ! హరిహర బాబుగారి శాంతమ్మ సంగతి నీ వెఱుగుదువా?"

మంజరి:— శాంతమ్మ నాకు తెలియదా?

చపల:— అది కాదు. లోపలి గుట్టు!

మంజరి:— ఏమది?

చపల:— మన బాబుగారికిని ఆమెకును గల సంబంధము!

మంజరి:— ఏమి సంబంధము?

చపల:— మనసూ మనసూ సంబంధము.

మంజరి:— (ముఖము చిట్లించుకొని) అనగా?

చపల:— బాబుగారిని శాంతమ్మ చాలకాలమై వలలో వేసికొన్నది, తెలుసా?

మంజరి:— ఛీ! నోరు మూయి.

చపల:— నా కళ్లతో నేను చూడ లేదా? ఆమె మెడలో నున్న బంగారు గొలుసు ఎవరిచ్చి రనుకొంటివి? మన బాబుగారే! వారి గుసగుసలు, వారి కిలకిలలు, వారి పెనగులాటలు, ఎన్ని సార్లు నేను వినలేదు, చూడలేదు? హరిహర బాబు గారింటికి మన బాబుగారు వెళ్లని రోజులేదు, తెలుసా?

మంజరి:— (కోపదృష్టితో) ఓహూ! చాలించు. పెద్దకుండలకే యెసరు పెట్టుచుంటివా? నీ కేదో పోగాలము వచ్చుచున్నట్లున్నది.

చపల:— ఉన్నమాట చెప్పిన ఈ కాలమున పోగాలమే కదా? ఇంత యేల? మొన్న మొన్న — మన బాబు ఆమెను స్వయముగా వారింట దిగబెట్టుటకు పోవుచు — పొలము దారిలో — అప్పుడు నేను ఆమెకోఅకు దీపము పట్టుకొని యెదురు పడితిని — ఏవో గుసగుసలు! ఆమె యేడ్పు! బెక్కులు! కన్నీళ్ళు! బాబుగారి యోదార్పులు! అంతేయు కనిపెట్టితిని. ఇవన్నియు నెందుకో తెలుసా! తన్నుకాక స్వర్ణలతమ్మను పెళ్ళి చేసుకొన్నందుకు. తెలుసా?

మంజరి:— ఇదిగో, చపలా! జాగ్రత్త! నోటికి వచ్చినట్లు ప్రేలితివేని ఈ యింటినుండి నిన్ను గెంటించి వేసెదను. గొప్పయిండ్ల మర్యాదలను నీవు గుర్తింపలేకున్నావు.

చపల:— నీవు నూఱుకాదు లక్షచెప్పు. మన బాబుగారు పూర్తిగ శాంతమ్మ కొంగునకే ముడి. విధిలేక కాబోలు స్వర్ణలతమ్మను వివాహ మాడినారు.

మంజరి:— ఛీ! నీతో సంభాషించుటయే తప్పు! నీ ముఖము చూచిన పాపము వచ్చును. తిన్నయింటికి నిప్పు పెట్టుచున్నావు.

అని యచ్చటినుండి గిఱ్ఱున తిరిగి వెడలిపోయెను. ఈ సంభాషణమునందు విశేషభాగము ఆ ప్రక్కగదియందే ఇంచుక యస్వస్థయై మంచముపై పండుకొని యున్న స్వర్ణలత కర్ణములందు బడెను. ఆమె నిద్రించుచుండెననియే యాదాసీ లిద్దఱును భావించి యుండిరి.

చపల వాక్యములందు నిశ్చయభావము ప్రస్ఫుటమగుచుండెను. ఆమె యచ్చట నసత్యమాడవలసిన యగత్యమేమున్నది! తాను కండ్లార జూచితి ననుచున్నది. ఆనాడు శాంత నాతడు దిగబెట్టబోయినప్పుడు తిరిగి వచ్చుట చాల ఆలస్యమగుట వాస్తవమే. ఆమెతో నాతనికి మిక్కుటమైన చనవున్నది. ఆ చనవునకు కారణమదియే కాబోలును. ఆమెకు ప్రేమహృదయమును, తనకు కేవలము హృదయ విహీనమైన శరీరమునా? విధిలేక తన్నాతడు వివాహ

మాడెనా ? ... ఇట్టి మనోసంశయ వ్యూహమునం దామె చిక్కువడి కొట్టుకొనుచుండెను. అప్రయత్నముగ కన్నీరు కారజొచ్చెను. క్షణ క్షణమును బలీయమై యాక్రమించుచున్న యసూయా పిశాచ మొక ప్రక్కను, ఇంతవఱకును ఎట్టి సందేహ లేశమునకు తావీయని తన భర్త ప్రణయానురాగ ప్రదర్శన మొక ప్రక్కకును ఆమె కోమల మానసము మల్లాడించుచుండెను. అసూయా ప్రభావము అనుభవించిన వారికి గాని తెలియదు! అది యొక మహారోగము! ఆ రోగగ్రస్తులకు నేత్రాంతరోధము కలుగును. తెలుపు నలుపుగాను, నలుపు తెలుపు గాను కానబడును. ఉన్నది లేనట్లును, లేనిది యున్నట్లును గోచరించును. కేవలము అసంభవములు సంభవములుగాను, సంభవములు కేవల మసంభవములుగాను తోచును. అట్టి విపరీతావస్థయందు ఇప్పుడు స్వర్ణలత కలవరపడుచుండెను. అట్లే మంచముపై నామె పండుకొని పరిపరి విధముల యోచించుకొనుచుండెను. తన ముద్దుల బిడ్డను సహితము మరచి యుండెను.

చూచుచుండగనే సాయంకాలమైనది. తలుపు తెరచుకొని కృష్ణమోహన్ లోనికి ప్రవేశించెను. కార్యాంతరములందు ఆతనికి తెరపి లేకున్నను ఆతని మనసంతయు అస్వస్థయై యున్న తన సతీమణి మీదనే యుండెను. సాధ్యమైనంత శీఘ్రముగ పని ముగించుకొని యాతడిల్లు చేరెను. తన రాకకు తదేకధ్యానయై నిరీక్షించుచు, ఇల్లు చేరినంతనే యెట్టి యవస్థయందైనను ఎదురువచ్చెడి ప్రియురాలు నేడు చాపచుట్టగ మంచముపై పడియున్నది. అత్యాత్రముతో నాతడామె చెంతకు పోయి, "స్వర్ణా! ఎట్లున్నది? నీరసముగ నున్నదా?" అని ప్రశ్నించుచు ప్రక్క కూర్చుండెను. ఆతని జూడగనే ఆమె బొటబొట కన్నీరు కార్చుచు వెక్కి వెక్కి యేడువసాగెను.

"ఏమి స్వర్ణా! ఏమైనది? ఏడ్చుచుంటివేమి!" అని యాతడు చేరుమాలుతో కన్నీరొత్తుచు ప్రశ్నించెను.

స్వర్ణ:— నేను నిర్భాగ్యురాలను. నేను మీ స్వచ్ఛంద హృదయముపై నొక తీరని భారమునై యున్నాను. మీ సౌఖ్యమునకంతరాయము కలిగించుచున్నాను. (అని వెక్కి వెక్కి యేడ్చుచుండెను).

కృష్ణ:— (విస్మితుడై) నీ యభిప్రాయ మేమి స్వర్ణా ?

స్వర్ణ:— మీ హృదయముపై నా కణుమాత్రము నధికారము లేదు. హృదయము విహీనమైన మీ శరీరమే నాది.

కృష్ణ:— (కలవర పడుచు) నీ మనోభావమును నేను గ్రహింపజాల కున్నాను. స్వర్ణా! నా హృదయముపై నీ కధికారము లేదా? నా మనః ప్రాణ సర్వస్వముపై సర్వాధికారిణివి నీవు కావా ?

స్వర్ణ:— కాను. నేను కాను. శాంత! శాంత!

కృష్ణ:— నీ పల్కులు వింతగా నున్నవి! స్వర్ణా! నీ వేమి కల గాంచు చున్నావా ?

స్వర్ణ:— మీరు శాంతను ప్రేమించుట లేదా ? శాంతకు హృద యార్పణము చేయలేదా ?

కృష్ణ:— ఈ యపూర్వభావము నీ కెట్లు కలిగినది ? ఈ దురభిప్రాయ మును నీ మనసున కెక్కించిన దెవ్వరు ?

స్వర్ణ:— శాంత మిమ్ము కామింప లేదా ?

కృష్ణ:— ఆమె నన్ను కామించి యుండినచో, ఆమె యొక పిచ్చి పిల్ల యని నేను భావించవలెను. ఆమె యంతటి యజ్ఞాని కాదని నా యభిప్రాయము. నే నామెను ప్రేమించితిననుట నేను నా సోదరిని ప్రేమించితి ననుటయే. నా ప్రేమ హృదయ మెవ్వరికి సమర్పితమైనదో, ఒక సంవత్సరమైనది—ఇంకను నీవు గుర్తింప కుంటివా ? నా ప్రేమకు ప్రమాణమింకను నీ కేల కావలెను ?

ఈ వాక్యములు స్వర్ణలత హృదయమున గాఢముగ నాటు కొనెను. ఒకానొక క్షుద్రదాసి వికృతప్రలాపములకు విలువనిచ్చి ప్రాణాధికముగ ప్రేమించుచుండిన ప్రియభర్త ప్రమాణవాక్యములను తృణీకరించునా ? కళావిహీనమై యుండిన యామె వదన బింబము మరల మెఱుగెక్కెను. తన పెదవులను దాటిన అయోగ్య భాషణ ములకు సిగ్గుపడుచు నామె, "మోహన్ ! నా యాజ్ఞానమును క్షమింపుడు. నేను మందబుద్ధినై నిష్కారణముగ మీ మానసమును నొప్పించితిని. నా ప్రేమహృదయమే నాచే నట్టి నీచములగు సందేహా

వాక్యము లనిపించినది. మఱచిపొందు. నన్ను క్షమింపుడు''
అని పాదములంటి ప్రార్థించెను.

''ఇట్టి విషవాయువు నీకెట్లు సోకినది స్వర్ణా! మన యభేద్య ప్రేమబంధమును భేదింప యత్నించిన యా నీచవ్యక్తి యెవ్వరు?'' అని యామెను మరల మరల ప్రశ్నించెను.

''క్రొత్తదాసి చపల'' అనుమాటలు ఆమె నాల్కచివరకు వచ్చెను. కాని, యవి పెదవులు దాటలేదు. ఒకానొక నీచదాసి అవినీతి ప్రలాపములకు చెవినిచ్చితినని బయల్పడుట కామె లజ్జించెను. ''అట్టి సాహసము నెవ్వరు చేయుగలరు?'' అని యామె బదులు పల్కెను.

''అట్లైన నీవు స్వప్నము గాంచితివా?''

''అగును మోహన్! ఈ యస్వస్థస్థితియందు అప్పుడప్పుడు నాకు మతిభ్రమ కలుగుచుండును. తెలివి కల్గియే స్వప్నముల గాంచుచుందును. విచక్షణజ్ఞానము నశించుచుండును. అనరాని మాట లనినందుకు నన్ను క్షమింపుడు.''

''అట్టి స్వప్నములను నీవిక ముందెన్నడును కనవద్దు స్వర్ణా! నీకును నాకును నడుమ శాంత కెన్నటికిని స్థానము లేదని విశ్వసింపుము.''

ఈ వాక్యములచే స్వర్ణలత హృదయభారము అప్పటికి పూర్తిగ తీరెను. కాని, ప్రశాంత సమయములందు ఛాయారూపిణియై శాంత యామె మానసవీధియందు తఱచు పొడగట్టుచునే యుండెను.

## అధ్యాయము 13

బిడ్డకు రెండేండ్లు గడవక పూర్వమే స్వర్ణలతకు రెండవ కాన్పున పుత్రశిశువు జన్మించెను. అది మొదలు ఆమె యారోగ్యము దినదినమును క్షీణించ నారంభించెను. ఎన్ని సపర్యలు చేయుచున్నను. ఎట్టి యౌషధసేవనము జేసినను ఆమెకు గుణమిచ్చుటలేదు. వ్యయ ప్రయాసములకు లక్ష్యముచేయక ఆ ప్రాంతమునందలి ప్రసిద్ధ వైద్యో నెందఱనో కృష్ణమోహన్ రావించి యామెకు చికిత్స చేయించెను

శిశు పరిచర్య పూర్తిగ చపలపై విడిచిపెట్టబడెను. అత్యంతానురాగమున మంజరియు బిడ్డలను కనిపెట్టుచుండెను. వారి చింత స్వర్ణలత కణుమాత్రమును లేకుండ సదుపాయములు చేయబడెను. వైద్యుల సలహాపై ఆమెకు సంపూర్ణ విశ్రాంతి కలుగజేయబడెను. స్వకార్య కలాపములందు ఊపిరి యాడకున్నను కృష్ణమోహన్ దినమునకు రెండు మూడు సార్లు ఇంటికి వచ్చి యామెను చూచి పోవుచుండెను. ఏమి చేయుచున్నను ఆమె యారోగ్యమునందు కొంచెమేనియు సుముఖత గోచరించుట లేదు. భయసంశయావిష్టుడై కృష్ణమోహన్ కలకత్తా నగరమునుండి యొక మహావైద్యుని దెచ్చి చూపించెను. ఆతడు పరీక్షించి, ఔషధ మేమియు నవసరము లేదనియు, సముద్ర తీరమునందు ఆరువారముల పాటు విశ్రాంతి తీసికొనినచో ఆరోగ్యము తప్పక బాగుపడుననియు చెప్పెను.

ఆతని సలహా ననుసరించి ఆమె నేదైన నొక సముద్రతీర ప్రదేశమునకు ఆరువారముల పాటు మార్చుటకు నిశ్చయింపబడెను. జగన్నాథ క్షేత్రమైన పూరీ సముద్రతీరము నివాసయోగ్యముగ నుండునని అందుకు సర్వసన్నాహములును చేయబడెను. సంసార మంతయు నెత్తుకొని యచ్చటకు బోవుటకు కృష్ణమోహన్ అక్కగారు అంగీకరించలేదు. పిల్లల జంఝాటము కూడ అచ్చట నల దని యామె వారించెను. కాని మాతృహృదయము దాని కంగీకరించునా? పిల్లలు తన చెంతనే యుండవలెనని స్వర్ణలత యెంతయో ప్రాధేయపడెను. కాని వైద్యులు కూడ దాని కంగీకరించలేదు. చక్రవర్తి యాజ్ఞకైనను వ్యతిరేక ముండవచ్చును కాని, వైద్యుని సలహాకు వ్యతిరేక ముండజాలదు. చివరకు, పిల్లలను విడచి స్వర్ణలత యొక్కతెయే పోవుటకును, ఆమె పరిచర్యకై తగు పరివారము వెంట బోవుటకును నిర్ణయింపబడెను. మంజరిని తన వెంట గొనిపోయి, చపలను ఇంట విడచుటయే తన యభిమతమైనను, తన ముద్దుల బిడ్డలను అయోగ్యురాలైన చపల చేతులయందు విడచిపోవుటకు ఆమె మనసొప్పినది కాదు. బిడ్డల క్షేమము నిమిత్తము మంజరి నింట విడచి చపలనే తన వెంట దోడ్కొని పోవుటకు నిర్ణయించెను.

ఆ మూడవనాడే పూరీ ప్రయాణము. అచ్చట ఆరువారములయజ్ఞాతవాసము! ఆమెను స్వయముగ దోడ్కొనిపోయి, అచ్చట ప్రశాంతమైన యొక నివాసగృహ మేర్పఱచి, సర్వసౌకర్యములను సమకూర్చి తిరిగి వచ్చుటకు కృష్ణమోహన్ బయలుదేరెను. బండి నెక్కుచు స్వర్ణలత మంజరిని పిలచి, "మంజరీ! పిల్లల నెట్లు చూచెదవో! నేను వచ్చుపర్యంతము వారికి నీవే తల్లివి. నా దేహస్థితి నీకు తెలియును కదా! నేను తిరిగి వచ్చెదనో లేదో కూడ తెలియదు. నేను తిరిగి వచ్చుయోగమే లేనిచో, మంజరీ! నాబిడ్డల భారమంతయు నీదేసుమా! వారి నెట్లు పెంచి పెద్దలను జేసెదవో! నా భర్త ఆమాయకులు! నిష్కలుషమైన వారి హృదయము నెట్లు కనిపెట్టుకొని తిరిగెదవో! సమస్త భారమును నీపై విడిచి పోవుచున్నాను. నా యాత్మకు శాంతి కలిగింతునని వాగ్దానము జేయుము." అని కండ్ల నీరు నింపుకొనెను.

"అమ్మా! నిశ్చింతగ పోయిరమ్ము. నీ బిడ్డలను నారెండు నేత్రముల వలె కాపాడుకొందును. ఆరు వారములును ఆరు ఘడియల వలె గడపివైచి పూర్ణారోగ్యవై మరలి రమ్ము తల్లీ!" అని బదులు పల్కుచు మంజరియు కన్నీరు తుడుచుకొనెను. పిల్లలను చెంత జేరుకొని వారి చెక్కులపై ముద్దుల వర్షము కురిపించి, వారిని మంజరి కొప్పగించి భర్తతో కూడ నామె బండినెక్కెను. బండి కదలిపోయెను.

పూరీ సముద్రతీరము అత్యంత మనోహరముగా నుండును. జగన్నాథాలయ ప్రాంతమునందలి అనాగరక వాతావరణమునకును సముద్రతీరమునందలి నాగరకతా విశిష్టతకును హస్తిమశకాంతర భేదము కలదు. ఆలయ పరిసరములు దైవమునకు సన్నిధానమే యైనను దైవమునకు చాల దూరమని యనేకులు అనుభవజ్ఞులు చెప్పుదురు. దీప ప్రకాశము దూరమునకే కాని, దీపము క్రింద నుండునది నీడయే కదా! కార్యాంతరములపై కృష్ణమోహన్ ఈ నగరమునకు ఈ వఱకు రెండు మూడు సార్లు వచ్చియుండుటచే ఇచ్చటి ప్రకృతి యాతనికి కొంత పరిచితమే! సరాసరి యాతడు పరివారముతో సముద్రతీరమునకే పోయి, అచ్చట ప్రసిద్ధమైయున్న

యొక వసతిభవనమునం దొక పెద్ద గది నద్దెకు పుచ్చుకొని యచ్చట తాత్కాలికముగ విడిసి, స్నానభోజనాదికములైన పిమ్మట సావకాశముగా వేరొక నివాసగృహమును నిర్ణయించుకొనుటకై బయలుదేరెను. రెండు మూడు గంటలలోనే సర్వసౌకర్యములును కలిగి, సముద్ర పవనములు ధారాళముగ సోకునట్టి యొక ప్రశాంత భవనమును ఆరువారముల నివాసమునకు అద్దెకు నిర్ణయించుకొనెను. తక్షణమే సపరివారముగా స్వర్ణలత నచ్చట ప్రవేశపెట్టి, వస్తు సామగ్రి నంతయు యథాయోగ్యముగ నమర్చి రాత్రియంతయు నానందముగ నచ్చట గడపెను. స్వర్ణలత ప్రత్యేక ప్రార్థనపై ఆ మరునాడు సహిత మాతడామెయొద్దనే గడపెను. మూడవ దినమున అనేక విధముల నామెకు ధైర్యము గొల్పి, రెండువారముల కొకసారి తాను వచ్చుచుందునని యామెకు వాగ్దాన మొనర్చి, తాను సువర్ణ దుర్గమునకు తిరిగి ప్రయాణ మయ్యెను. పోవునప్పుడు, "జాగ్రత్త సుడీ! నేను లేను కదా యని శాంతతో..." అని చిరునగవుతో స్వర్ణలత భర్తను హెచ్చరించెను. ఆ మందహాసము మరుగున నున్న ఛాయ కృష్ణమోహన్ విశాలదృష్టి నాకర్షింపలేదు. అది కేవలము హాస్యప్రసంగముగనే యాతనికి పొడగట్టెను. "భయము లేదులే!" అని నవ్వుచు నాతడు వెడలిపోయెను.

ఆ నాటి సాయంకాలమున స్వర్ణలత సముద్రతీరమునకు బోయి యచ్చట నొక యిసుకతిన్నెపై గూర్చుండి ఆ యనంత ప్రకృతి దృశ్యమును చూచుచుండెను. వెంటవచ్చిన పరిచారకుని మరియొక గంట పిమ్మట రమ్మని పంపివైచెను. సాయంసమయ విహారమునకై గుంపులు గుంపులుగా ప్రజాసమూహములు ఆ ప్రదేశమున జేరుచుండిరి. నానాదేశాగతులు! నానాప్రకార వేషధారులు! నానా భాషలు! నానావిధ గమన వైఖరులు! పక్షుల గుములవలె యే జాతికాజాతి కలసి విహరించుచుండిరి.

ఆ ప్రజాసంఘముల నడుమనుండి యొక వ్యక్తి రాచఠీవితో నేకాకియై స్వర్ణలతయున్న దిక్కునకు వచ్చుచుండెను. ఆతనిని స్వర్ణలత చూడలేదు. కాని ఆతని దృష్టి మాత్ర మామెపై ప్రసరించెను. "ఈ సుందరి యెవ్వరు? ఏకాకినియై యిచ్చట కూర్చుండి యుండుటకు

కారణ మేమి? అని యోచించుకొనుచు మెల్లగ నామెను సమీపించెను. ఆమె ముఖమును జూచినంతనే, ఆతడు చకితుడై వడివడిగా నామెచెంత కేగి, "స్వర్ణా!" అని పలుకరించెను. సముద్రసంగీతమునందు పరధ్యానయై యుండిన స్వర్ణలత తిరిగి చూచి, స్వప్నమునుండి మేల్కాంచిన దానివలె నాతనివైపు నిదానించి, విస్మయముతో, "రమాపతి!!" అని నోట మాటరాక యట్లె చూడసాగెను. ఆతని జూచినంతనే ఆమె హృదయాంతర్గతములై విస్మృతి గోళమునం దదృశ్యమగుచుండిన పూర్వఘట్టము లన్నియు నొక్కసారిగ ఆమె యంతర్నేత్రముల యెదుట చలన చిత్రములవలె గోచరించెను. ఒకప్పుడు తన ముగ్ధహృదయమునందు అప్రయత్నముగ ఆ వ్యక్తి యందు ప్రేమాంకురము లుత్పన్నములై యుండెను. వాతావరణము మారుటచే ఆ ప్రేమాంకురములు క్రమక్రమముగ మాడిపోయెను. కాని, ప్రేమ బీజమునకు చావులేదు. కాలచక్రపు ఒత్తిడి తాత్కాలికముగ దాని నణచి యుంచగలదేకాని, చంపజాలదు. కృష్ణమోహన్ ప్రేమ తేజఃప్రసారమునందు అది యింతకాలమును నిద్రాణమై యుండెను. రమాపతిని చూచినంతనే అప్రయత్నముగ అది తిరిగి యుజ్జీవిత మయ్యెను. ఇప్పుడు స్వర్ణలత హృదయ గోళమునం దొక మహాసంఘర్షణము ప్రారంభమయ్యెను. పునర్జీవిత మగుచున్న యా పూర్వ ప్రేమాంకురము నణచివేయుటకు ఆమె తన యావచ్ఛక్తిని వినియోగించు చుండెను.

ఆమె ముఖమువైపు నిదానించి రమాపతి, "స్వర్ణా! నిన్ను గుర్తించుటయే కష్టమైనది! ఇంత శుష్కించి పోయితివేల? ఇచ్చటి కెట్లు వచ్చితివి?" అని ప్రశ్నించెను.

స్వర్ణ:— నా యారోగ్యము చెడినది. సముద్రతీరమునకు కొంత కాలము నివాసము మార్చమని వైద్యులు సలహా నిచ్చిరి. మొన్ననే నా భర్తయు నేనును ఇచ్చటకు వచ్చితిమి. నా వసతి సౌకర్యము లన్నియు నేర్పఱచి ఈ యుదయమే వారు తిరిగి సువర్ణ దుర్గమునకు మఱలిపోయిరి.

రమా:— ఇచ్చట నీ వెంతకాల ముందువు?

స్వర్ణ:— ఆరు వారములు. మధ్య మధ్య వారు వచ్చిపోవుచుందురు.

రమా:— ఒంటరిగ నుందువా?

స్వర్ణ:—కొద్ది పరవారమున్నది. ఇద్దరు పరిచారకు లున్నారు. ఇప్పుడే నన్నింటికి దోడ్కొని పోవుటకు పరిచారకుడు వచ్చును.

రమా:— ఇచ్చటకు నీ నివాస గృహ మెంత దూరము?

స్వర్ణ:— చాల సమీపమే. అదిగో, ఆ కనబడుచున్న మేడయే.

రమా:— రమ్ము. నేను నీకు తోడు వచ్చెదను.

ఆతనితోడు స్వర్ణలత హృదయమున కీడునే శంకింప జేయు చుండెను. ఆ యేకాంతవాసమునందు రమాపతి తన కంట బడుటయే దురదృష్టముగ నామె భావించుకొనెను. కాని, ఇప్పు డాతని తప్పుకొను మార్గము లేదు. ఆతనితోడు నిరాకరించుటకు తగు కారణము లేదు. ఔనన లేక, కాదన లేక, విధిలేక యామె యాతనితో గలసి గృహోన్ముఖియై నడువసాగెను.

మార్గమధ్యమున తన ప్రస్తుతపరిస్థితులన్నియు నాత డామెతో జెప్పెను. సైన్యమునందు తన యుద్యోగమును చాలించితి ననియు, తనచేత పడనుండిన యాస్తియంతయును దూరస్థమై పోయినదనియు, తన యార్థిక పరిస్థితి చాల నిరుత్సాహకరముగా నున్నదనియు, ఏమియును దోచక దేశాటనము జేయుచున్నా ననియు నాతడు వివరించెను. ఇట్లు సంభాషించుచు వారు కొద్దిదూరము సాగినంతనే పరిచారకు డెదురయ్యెను. కాని, ఇంటివఱకును స్వర్ణలత కాతడు తోడువచ్చి, మరల రేపు కలసెదనని చెప్పి వెడలిపోయెను. ఇంటిలోనికి రమ్మని యామె యాతని నాహ్వానింపలేదు.

అది మొదలు ప్రతిసాయంకాలమును సముద్రతీరమునం దాత డామెను కలసి సంభాషించుచు చీకటిపడువేళకు ఆమెను ఇంటివఱకును సాగనంపి పోవుచుండెను. కాని, ఒక్కనాడైనను ఆతని నింటిలోనికి రమ్మని యామె కోరలేదు. ఆతని సహవాసము ఎంత హృదయానందకరముగ నుండినను, దానినుండి విముక్తయగుటకు స్వర్ణలత తన మనోబలమునంతయు వినియోగించు చుండెను. ఆతని

సహవాసము, ఆతనితోడి సంభాషణము ఆత్మద్రోహముగా తిన యంతరాత్మ ఘోషించుచుండెను. ఆమె యొక్క మహాప్రవాహము నందు ఎదురీత యీదుచుండెను. సముద్రతీరమునకు పోవుటయే మానుకొనుటకు సంకల్పించుకొనెను. కాని, సముద్రపవనములే పరమౌషధముగా దినదిన ప్రవర్థిత మగుచున్న తన యారోగ్యము నకు భంగము కలిగించుకొనుట కామె యిష్టపడలేదు. ఇట్లు రెండు వారము లెట్లో గడచిపోయెను.

పదునైదవ దినమున కృష్ణమోహన్ సువర్ణదుర్గమునుండి వచ్చెను. అత్యానందముతో స్వర్ణలత యాతని కెదురేగి యభ్యు ర్థాన మొనర్చెను. ఆమెను చూడగనే ఆతని హృదయ ముప్పొంగి పోయెను. ఆమె ముఖమునందు నూతన తేజము చిందులాడు చుండెను. ఇంత స్వల్పకాలములో ఆమె యారోగ్యమునం దంత మార్పు కలుగుట ఆతని కాశ్చర్యము కలిగించెను. అన్యోన్య కుశల ప్రశ్నములతో, ప్రేమ సంభాషణములతో ఆ సతీపతు లిద్దఱును చాలవఱకు మహానందముగ గడపిరి. స్వర్ణలత యాతనితో రమా పతి యచ్చటకు వచ్చియున్నాడనియు, ప్రతిదినము నాతడు సముద్ర తీరమున తన్ను గలసి యోగక్షేమము లరసి యింటివఱకును దిగ బెట్టి పోవుచున్నా డనియు చెప్పెను. ఆ యపరిచిత స్థలమునం దొక పరిచిత వ్యక్తి సహాయము ఆమెకు లభించినందుకు కృష్ణమోహన్ సంతోషమునే వెలిబుచ్చెను.

ఇట్లు వీరు సంభాషించు చుండగనే రమాపతి యచ్చటకు వచ్చెను. కృష్ణమోహన్ గౌరవాదరములతో నాతని నాహ్వానించి, తన కృతజ్ఞత నాతనికి వెలిబుచ్చెను. ఈ రెండు వారములలోనే స్వర్ణలత యారోగ్యమునం దద్భుతమైన పరివర్తనము గోచరించిన దనియు, ఇంక నొక మాసము పాటు అచ్చటనే యామె వసించు ననియు, అచ్చట తానున్నంత కాలమును అవకాశము కలుగునపు డెల్ల ఆమె యోగక్షేమము లారయు చుండుమని రమాపతిని గోరెను. అట్టి యవకాశము లభించుట యొక్క మహాభాగ్యమని రమాపతి బదులు పల్కెను. ఈ మహాభాగ్యము తనపట్ల నొక మహా అభాగ్య

మని స్వర్ణలత హృదయము ఘోషించుచుండెను. ఆమె యంత రాత్మ రమాపతిని దూరస్థుని జేయ గోరుచుండెను. తన యంత రాత్మకు విరుద్ధముగ నొక వికృతమేఘము క్షణ క్షణమును తన హృదయాకాశమున విస్తరించుచుండుట తాను గుర్తించుచుండెను. ఆ వికృతమేఘమును తొలగించుటకు నిష్ఫలప్రయత్నము చేయు చుండెను. తన భర్త నిరంతర సన్నిధానమే ఆ మేఘశకలమును పటాపంచలు చేయగల వాయు సంచాలనమని ఆమె భావించి, ఆ మాసము దినములును భర్తను తన యొద్దనే యుండుడని ప్రార్థించెను.

"స్వర్ణా! అది నాకు మహానందమే. కాని, క్షణమేని విశ్రాంతి కవకాశ మీయని అత్యవసర కార్యభారము నా తలపై నున్నది. నేను పోనక తీరదు. నిర్విచారముగ నుండుము. రమాపతి యిచ్చట నుండునంత కాలము నీకు తోడై యుండును. నేను మరల రెండు వారముల పిమ్మట వచ్చెదను." అని నచ్చజెప్పెను. పిమ్మట రమా పతి తన ప్రస్తుతపరిస్థితు లన్నియు నాతనికి వివరించి తన వ్యవహారము లందు తనకు తోడ్పడ గోరెను.

"తప్పక నాశక్తికొలది తోడ్పడెదను. అవకాశము జూచుకొని సువర్ణదుర్గమున కొకసారి రండు" అని కృష్ణమోహన్ ఆతనికి ధైర్యము చెప్పి పంపెను. మరునాడుదయము ఆతడు తిరిగి సువర్ణ దుర్గమునకు బోయెను.

దూరదేశమున, ఏకాంతవాసమున, సుందరియు జవ్వనియు నగు తన భార్యను, కేవలము పరిచయము తప్ప అన్యబాంధవ్యము లేని యొకానొక స్ఫురద్రూపి యగు నడివయస్కుని పరామర్శకు విడిచి, నిర్విచారముగ నాతడు పోయెను. స్వర్ణలతయందు తనకు గల యచంచల విశ్వాసము తన నిష్కలుష హృదయమునం దెట్టి సంశయమునకును తావీయలేదు.

# అధ్యాయము 14

యథాప్రకారముగా ప్రతి సాయంకాలమును స్వర్ణలత సముద్రతీరమునకు బోవుచుండెను. యథాప్రకారముగా రమాపతి యామె నచ్చట కలసి సంభాషించుచు నింటియొద్ద నామెను విడచి పోవుచుండెను. అతని సహవాసము తప్పించుకొనుట కామె యనేక విధముల బ్రయత్నించుచు చుండెను. వేళ తప్పించి పోవుచుండెను. ప్రాతమార్గమును విడచి క్రొత్తదారుల బోవుచుండెను. ప్రాత తావునగాక క్రొత్తతావుల విశ్రమించుచుండెను. ఏమిచేయుచున్నను మార్గమధ్యమునందే యాతడామెకు ప్రత్యక్షము! "నీవికనుండి నా కడకు రావలదు. నాతో సంభాషింపవలదు" అని తెగించి చెప్పి వేయుమని యామె యంతరాత్మ పోరుచుండెను. కాని, ఆమె హృదయము వెనుకకు లాగుచుండెను. ఈ యంతర్యుద్ధమునం దామె కేమి చేయుటకును దోచక నలిగి పోవుచుండెను.

ఒకనాటి సాయంకాలమున ఆమె యిసుకతిన్నెపై గూర్చుండి యుండెను. రమాపతి చెంత గూర్చుండి సంభాషించుచుండెను.

రమా:— స్వర్ణా! ఈ సంధ్యారాగ సువర్ణశోభయందు ప్రకృతి యంతయు నెట్టి బంగరుపూత పూయబడి యున్నదో చూచితివా? ఇంత సుందరముగ ఈ దృశ్యము నిన్న కన్పడలేదు.

స్వర్ణ:— ప్రకృతి అత్యంత చంచల స్వభావము కలది. క్షణమున కొక వేషము ధరించుచుండును. ఈ సువర్ణశోభ యంతయు నింక నెంతకాలము? చూచుచుండగనే ఈ ప్రకాశ మంతయు నంధకారమునందు లీనమైపోవును.

రమా:— నీకు జ్ఞప్తి యున్నదా? ధారానగరమునందు ఇట్టి సంధ్యా సమయమునందే యొకనాడు మన మిద్దఱమును ఆరామమునందొక వేదికపై గూర్చుండి యెన్ని మధుర స్వప్నములను గాంచియుంటిమో నీకు జ్ఞప్తి యున్నదా?

స్వర్ణలత యేమియు బ్రత్యుత్తర మీయలేదు. ముఖము ప్రక్కకు ద్రిప్పుకొనెను. ఎన్ని అన్యోన్య విరుద్ధములైన విపరీత

భావము లాగునె హృదయమునం దావిర్భవించుచుండెనో, చెక్కుటద్దములందు క్షణమున కొక వింత వర్ణము ప్రతిఫలించుచుండెను.

రమా:— స్వర్ణా! ఎంత మధురములైనను, అవి యన్నియు కేవలము స్వప్నములే యైనవి. నా చేతులార నేనే నిన్ను పోగొట్టుకొంటిని. నా యార్థిక పరిస్థితులకు నేను భయపడి, నిన్ను నాకిచ్చి వివాహము చేయుమని నేను దేవేంద్రరాయలను కోరలేదు. కోరియుండినచో నీవు కృష్ణమోహన్ గృహిణివై యుందువా?

ఈ మాటలకు స్వర్ణలత యొక త్రొక్కిన త్రాచువలె చివాలున లేచి. "రమాపతీ! ఇట్టి అప్రస్తుత ప్రసంగమును నేను విన దలచుకొనలేదు." అని తీక్ష్ణముగ బల్కెను.

రమా:— స్వర్ణా! క్షణకాల మోపిక పట్టుము. నేను నిన్ను గోల్పోవుటకు కారణము నీకు తెలియ జేయుటకు చాలకాలమై వేచుకొనియుంటిని. మన మన్యోన్యమును ప్రేమించుకొని యుంటిమి. మన హృదయములే సాక్షులు. నిన్ను కృష్ణమోహన్ కు విడచుటచే నేను నీ ప్రేమను తిరస్కరించిన వాడ నైతిని. నిన్ను నే నెంతె ప్రేమించుచుంటినో, నీ వింకొకని భార్యవైన పిమ్మట, ఇప్పుడు, నేను గుర్తించుచున్నాను. స్వర్ణా! ఆ ప్రేమయందు అణుమాత్రమైనను ఇంకను తగ్గలేదని మాత్రము విశ్వసింపుము.

స్వర్ణ:— (తీవ్రముగ) చాలించు, రమాపతీ!

రమా:— స్వర్ణా! నా పల్కులు నీ కిప్పు డేమియు ప్రమాదకరములు కాజాలవుకదా! ఇప్పుడు నీ వింకొకని సొత్తు వను విషయము నాకు తెలియదా! గతించిన దేమో గతించినది. మన జీవన మార్గము లప్పుడే యేర్పడి పోయినవి. ఇంక మనము కలియుట కేవల మసాధ్యము! కాని చేతులార నేను నీ ప్రేమ ధనమును గోల్పోయి కృష్ణమోహన్ చేత బడవైచినందుకు చింతించుచున్నాను.

స్వర్ణ :—రమాపతీ! నిన్ను నీవు మఱచి మాటాడుచున్నావు. ఇట్టి ప్రసంగములకు నాయెదుట ప్రస్తుతము నీ కధికారము లేదని గుర్తింపుము.

అని చివాలున వెనుకకు దిరిగి గృహోన్ముఖియై నడువసాగెను. రమాపతి వెంటబడి, బలాత్కారముగ నామె చేయి బట్టుకొని, "స్వర్ణా! నన్ను క్షమింపుము. నా ప్రలాపములను మఱచిపొమ్ము. యథాప్రకారముగ ఈ పరదేశవాసమున నన్ను నీకు సహాయము జేయనిమ్ము.

స్వర్ణ:— (చేయి విడలించుకొని) నీకు బంధుత్వగౌరవ మొసంగి నేను నీ సహచర్యమును ఇంతకాలమును సహించి యుంటిని. ఇదియా దాని ఫలము? నాభర్త నీ సహాయమునకు తన కృతజ్ఞత తెలిపియుండెను. నీ ధూర్త హృదయము ఆతని కృతజ్ఞతకు తగియున్నదా?

రమా:— స్వర్ణా! నేను అపరాధిని! క్షమాభిక్ష మర్థించుచున్నాను. అంతయు మఱచిపొమ్ము. నిన్ను ఇంటియొద్ద విడచి పోయెదను. అనుజ్ఞనిమ్ము.

స్వర్ణ:— వలదు. నీ సహాయము నాకు వలదు. నీదారిని నీవు పొమ్ము.

అని ముందునకు నడచిపోయెను. రమాపతియు నామె వెంట వెంట ఇల్లు చేరువఱకును బోయి, అచ్చట నామెను విడచి, తన దారిని బోయెను.

రమాపతి సమక్షమున తన హృదయము దుర్బలమై పోవుచున్నట్లు స్వర్ణలత గ్రహించెను. ఈ దుర్బల హృదయము ఎట్టి ప్రమాదమునకు లోనగునో యని యామె శంకించెను. ఆతని వాక్యములను నైతిక దృష్టిలో ప్రయత్న పూర్వకముగ నామె గర్హించుచుండినను, అందలి యొకానొక యద్భుతశక్తిమాత్రము ఆమె హృదయ వీణా తంత్రులను కదలించుచునే యుండెను. "ఇంక రమాపతిని దూరము చేయవలయును. ఆతని ముఖము కంట పడరాదు. ఈ నగరమునందు నే నింక నుండుట ప్రమాదకరము, సువర్ణదుర్గమునకు పారలిపోయెదను." అని నిశ్చయించుకొని

వెంటనే భర్తపేర నొక జాబు వ్రాసెను. ఎట్టి పరిస్థితులందైనను, తక్షణమే వచ్చి తన్ను దోడ్కొని పోవలసిన దనియు, తానింక నచ్చట నుండ ననియు, ఇంచుక ధనాభావముచేతగాని, లేకున్న తానే బసులు దేరి యీసరి కిల్లు చేరియే యుందు ననియు, ఆ జాబునందు వ్రాసెను.

ఆ మరునాడు రమాపతి యథాప్రకారము సముద్రతీరమునకు బోయెను. కాని స్వర్ణలత నచ్చటగానక ఆమె నివాసమునకు బోయెను. అచ్చటకూడ స్వర్ణలత యాతనికి దర్శన మీయలేదు. అస్వస్థతగానున్నదని మిష పెట్టి యాతని పంపించి వైచెను.

మూడవనాడు, ఆమె జాబుననుసరించి కృష్ణమోహన్ వచ్చెను. ఆతని ముఖము కంటబడినంతనే స్వర్ణలత హృదయము నందలి భయోత్పాత మదృశ్యమయ్యెను. సంపూర్ణ వికసితమైన ముఖపద్మముపై హర్షాశుబిందువులు తళతళలాడ నామె యెదురువచ్చి యాతని గౌగిలించుకొనెను. కృష్ణమోహన్ ఆమె చెక్కిలి యొత్తుచు, "స్వర్ణా! ఇంత యాకస్మికముగ నిచ్చటనుండి వెడలిపోవలసిన యావశ్యకత యేమికలిగినది? ఈ స్వల్పకాలమునందే నీ యారోగ్య మెంత బాగుపడినదో చూడు! ఆరువారములును పూర్తి జేసినచో నింక నెంత బాగుండునో యోచింపుము. పోవుట కిప్పు డంతతొందర యేమివచ్చిపడినది?" అని ప్రశ్నించెను.

స్వర్ణ:— నా యారోగ్యము నిశ్చయముగ చాల బాగుపడినది.

కృష్ణ:— మరి నీకేమైన యసౌకర్యము కలుగుచున్నదా?

స్వర్ణ:— మీరు వేయికండ్లతో కని పెట్టుచుండ నా కేమి యసౌకర్యము కలుగగలదు.

కృష్ణ:— అట్లయిన, ఇంత యాకస్మికముగ నీవు తిరుగుమొగము పెట్టుటకు కారణ మేమి?

స్వర్ణ:— ఏమో, నాకింక నిచ్చటనుండు తలంపు లేదు.

కృష్ణ:— నా కేమియు నర్థమగుటలేదు. స్వర్ణా! దీని కేదియో విశేష కారణమే యుండును. చెప్పుము.

ఆ కారణమేదో చెప్పివేయుటకు స్వర్ణలత మానసము తత్తరపడ సాగెను. "రమాపతి" అని నాలుక చివరకు వచ్చెను. కాని,

ప్రయత్నపూర్వకముగ నామె యా శబ్దమును వెలికి రానీయలేదు! తిరిగి దానిని హృదయములోనికి నెట్టివేసెను. ఆ సంఘటనమును ప్రియభర్త కర్ణములందు వైచి యాతని ప్రశాంత హృదయమును కలవరపరచుట కామె యిష్టపడకుండెను.

"ఏమియును లేదు. నా కిచ్చట విసుగుగా నున్నది." అని యామె ప్రత్యుత్తర మిచ్చెను.

కృష్ణ:-విసుగుగా నున్నదా ?—లేదు, స్వర్ణా ! ఏదో యొక విపరీత విషయము నిన్ను కలవరపెట్టుచున్నది. నిజము చెప్పుము.

నిజము చెప్పివేయుటకు మరల నామె హృదయము హుంకించుచుండెను. రమాపతి మరల నామె నాలుక చివరకు వచ్చెను. ఇంక నొక్క క్షణములో నామె హృదయమునందలి రహస్యము బయట పడును. ఈ శేషముహూర్తమందు దుర్నివారమైన విధివిధానము అడ్డువచ్చెను. ఆమెనోట మాట వెలువడక పూర్వమే కృష్ణమోహన్ తన జేబునుండి యొక జాబు దీసి యామె చేతబెట్టెను. ఆ లేఖ తన యక్కగారు స్వర్ణలతకు వ్రాసినది. అందు, గృహవిషయములను వివరించి, పిల్లల యారోగ్య విలాసములను తెలుపుచు, అప్పుడే తమతో నా దినమంతయు గడపుటకు శాంత వచ్చిన దనియు, అందుచే లేఖ నంతటితో ముగించితి ననియు వ్రాసెను. 'శాంత' యను మాట చూచినంతనే లోకమంతయు నామె దృక్పథమునందు గిరగిర తిరుగ సాగెను. భర్తతో ప్రస్తుతము కావించుచుండిన సంభాషణమంతయు మరచిపోయెను. తాత్కాలికముగ శాంతించియున్న యొకానొక తుపాను తిరిగి యామె హృదయమునందు చెలరేగ సాగెను. తన భర్తయందు తనకుండిన యచంచల విశ్వాసము తిరిగి చలింపసాగెను.

"శాంత సువర్ణదుర్గమునకు పోవుచున్నదా ? నేను లేని సమయమున ఆమె యచ్చట గడపుచున్నదా ?" అని యొక పెద్ద నిట్టూర్పు విడచి "ఇంక నే నిచ్చట నెంతమాత్రము నుండను. తక్షణమే పోవలయును." అని నిశ్చయించుకొని భర్తతో "మోహన్ ! నాకు పిల్లలను చూడవలయునని యున్నది. అన్యాలోచనము లేక నన్ను వెంటనే తీసుకొని పొండు" అని కన్నీటితో ప్రార్థించెను.

"సరియే, స్వర్ణా! నీ యుద్దేశ్య మెట్లో యట్లే కానిమ్ము. మనము రేపే ప్రయాణమై పోవుదము." అని చెప్పి యామె నోదార్చెను.

మరునాడు ప్రయాణము. గృహోన్ముఖ మగుచున్న స్వర్ణలత భావనాగోళమునందు రమాపతి మరియొకసారి తళుక్కు మనెను. దుస్సంకల్పుడైయున్న యాతని నుండి దూరస్థనై పోవుచుంటినను భావము కొంతవఱకు తనకు మనశ్శాంతి కలిగించుచున్నను, అంతర్గతమైన యొక యాకర్షణశక్తి రమాపతిని తన హృదయ మందిరము నుండి బహిష్కృతము చేయనీయకుండెను.

కృష్ణమోహన్ రాక నెఱింగి రమాపతి ఉదయముననే యాతని జూడవచ్చెను. గౌరవపురస్సరముగా కృష్ణమోహన్ ఆతని నాహ్వానించి, ఆనాడచ్చటనే భోజనము చేయువలసినదని కోరెను. రమాపతి యంగీకరించి, ప్రయాణ సమయపర్యంతము వారితోడనే గడపెను. ఆతని సహాయమునకు కృష్ణమోహన్ మరల మరల తన కృతజ్ఞతను వెల్లడించెను. అవకాశము జూచుకొని యొక్కసారి సువర్ణ దుర్గమునకు రావలసినదని యాహ్వానించెను. ఈ యాహ్వానము స్వర్ణలత హృదయాకాశమునందు మెఱుపు మెఱసి యంధకార మావరించిన ట్లయ్యెను.

## అ ధ్యా య ము 15

పునరార్జితమైన యారోగ్య భాగ్యముతో, కన్నబిడ్డల కేళీ విలాసములతో, నిశ్చలమై మనోభిరామమై యున్న ప్రియభర్త ప్రేమానురాగ చంద్రికలలో, స్వర్ణలత మహోత్సాహమున కాలము గడపుచుండెను. తాత్కాలికముగ తన హృదయమున రేగియుండిన గాలిదుమారము పూర్తిగ శాంతించిపోయెను. ఇట్లు సుమారొక మాసము దినములు గడచెను.

పిమ్మట, ఒకనాటి సాయంసమయమున బిడ్డలతో నానందముగ నామె యారామమునందు విహరించుచుండెను. ఇంతలో సేవకుడొకడు వచ్చి, "అమ్మా! ఎవ్వరో బాబుగారికొఱకు వచ్చి ద్వారముకడ వేచియున్నారు. ఈ చీటిని వారికి చూపుమని యిచ్చి

నారు.'' అని యొక చీటి నామె చేత బెట్టెను. ఆ చీటియందు "రమాపతి'' అని పేరు వ్రాయబడి యుండెను. దానిని చూచినంత నే ఆమె ముఖము జేవురించెను. కొంతతడవు అచేతనయై శిలాప్రతిమ వలె నిలచి, పిమ్మట మెల్లగ సేవకునితో, "వారిని కచేరి గదిలోనికి దోడ్కొనిపోయి కూర్చుండబెట్టుము. బాబుగారు వచ్చు వేళయైనదని చెప్పుము.'' అనిపల్కి వడివడిగా లోనికిబోయెను.

చంద్రకాంతి విలసితమైన రాత్రి యాకస్మికముగ ఆమెకు అంధకార బంధురమైనట్లు తోచెను. క్షణక్షణమును ఆమెకు హృదయభార మధికముకాజొచ్చెను. కాలప్రభావమున హతాహతమై యదృశ్యమై పోయిన యా వింతరోగము తిరిగి యంకురితమై యామె మనశ్శాంతి నపహరింపజొచ్చెను. మంచముపై గూలబడి యామె పరిపరివిధముల యోచింపసాగెను. కొంతసేపైన పిదప, కుమార్తె లీల మెల్లగ తల్లి కడకువచ్చి, "అమ్మా! అతడెవరు? అబ్బా! వానిని చూడగనే నాకు భయము కలిగినదమ్మా! వానిని పొమ్మనిచెప్పు.'' అని పల్కెను.

"నాన్నగారువచ్చి అతనిని పంపివేసెదరులే.'' అని బిడ్డకు సమాధానమిచ్చి, "నాన్నగారు వచ్చుచున్నారేమో చూడు,'' అని పంపివేసెను. ఆ శిశుహృదయమునందలి భయోత్పాతమునకు కారణ మామె యెట్లూహించగలదు? క్షణమున కొకరీతి, వెలుగులో చీకటి, చీకటిలో వెలుగు, ఆమె యంతర్నేత్రమునకు గోచరించు చుండెను.

ఇంతలో కృష్ణమోహన్ వచ్చి, సరాసరి కచేరిగదిలోనికి బోయి యచ్చట వేచుకొనియున్న రమాపతిని అత్యంతాదరముతో పలుకరించి, సుమారొక యరగంట యాతనితో సంభాషించి, పసిబాలు నెత్తుకొని, లీల చేయిబట్టుకొని మేడమీదికి స్వర్ణలతకడకు వచ్చెను. స్వర్ణలత లేచి, తన హృదయమునకు తాళమువైచి, మందస్మితవదనయై యాతని కెదురేగెను.

కృష్ణ:— స్వర్ణా! నా యాహ్వానము ననుసరించి రమాపతి వచ్చి యున్నాడు. తన వారసత్వమునకు సంబంధించిన చిక్కులు పరిష్కరించుటకు నా సహాయము నాశించుచున్నాడు. అవి

యొక్కనాటితో తీరునవికావు కదా! ఇచ్చట నొకటి రెండు వారములపాటు ఉండుమని నేను చెప్పినాను. మన కంత సహాయము చేసినవానికి మన మీమాత్రము ప్రత్యుపకారము చేయుట విధికదా!

స్వర్ణ:- విధియే. ఈ యొకటి రెండు వారములును మన యింటనే యుండుమని చెప్పినారా?

అని యించుక హీనస్వరమున ప్రశ్నించెను.

కృష్ణ:- మరి యెచ్చట నుండును? ఉండనిమ్మా. చోరుడును, జారుడును, క్రూరుడును కాడుకదా! (అని పకపక నవ్వెను).

స్వర్ణ:- కాడు...కాని...సరియే...ఉండనిండు.

అని యింక నాతని యెదుట నుండజాలక, ఏదో మిషపై అచ్చటినుండి వెడలిపోయెను. ఆమె హృదయము నాత డేమాత్రమును గ్రహించలేదు. బాలిక లీలమాత్రము తండ్రితో "నాన్నగారూ! ఆ క్రొత్తాయనను చూచిన నాకు భయమువేయుచున్నది." అని పల్కెను.

"క్రొత్తాయన కాడమ్మా, భయ మెందుకు? మనవాడే!" అని యామెను బుజ్జగించి; బాలుని చపల కందిచ్చి తాను మరల రమాపతి యొద్దకు బోయెను.

రెండు మూడు దినములలో రమాపతి అందఱకును సుపరిచితుడై స్వేచ్ఛగ గృహమునందు సంచరింపజొచ్చెను.

ఆ మూడవనాడు ఆదివారము. సెలవు దినము. హరిహరరాయల భార్య కుముద్వతియు, కుమార్తె శాంతయు, సువర్ణదుర్గమునకు వచ్చిరి. దూరమునుండియే వారిని జూచి కృష్ణమోహన్ సకుటుంబముగ వారి కెదురేగి తోడ్కొని వచ్చి యారామ వేదికపై నాసీనుల జేసెను. అది యొక బంధువర్గ సమ్మేళనము. అతివిలాసముగ వారందరును ముచ్చటలాడుకొనుచుండిరి. దూరమునుండి రమాపతి అది యంతయు జూచుచుండెను.

"వీరెవ్వరు? ఆ జవ్వని సౌందర్యము చూడదగియే యున్నది. దాపునకు పోయి చూచెదగాక!" అని మెల్లగా వారిని సమీపించెను.

ఆతఁడు సమీపించగనే కృష్ణమోహన్ యథాయోగ్యముగా ఆతని వారికి పరిచయము మొనర్చెను. స్వల్పసమయము మాత్ర మాత డచ్చట నిలచి పిమ్మట బాలు నెత్తుకొని దూరముగా బోయెను.

కుముద్వతియు, స్వర్ణలతయు, తన యక్కగారును కలసి యేదో సంభాషణమందు లీనమైయుండగా, కృష్ణమోహన్ శాంతతో సంభాషణమున కుపక్రమించెను.

కృష్ణ:— శాంతా! అమ్మ యారోగ్య మేమియు తృప్తికరముగా లేదు.

శాంత:— ఎట్లుండును? రాత్రింబగళ్ళు ఒకటే ధ్యాసము. రాత్రి యంతియు స్వప్నదృశ్యముల భయోత్పాతములు! పగ లంతియు మనోవిచారము! దిగులు! ఆరోగ్యమింక నెట్లుండును? నిన్న రాత్రి యొక భయంకర స్వప్నమును జూచెనట! అందు ఆ హంతకుడు తనకు కనబడెనట. వాడు ప్రస్తుత మీయూరనే యున్నాడట!

కృష్ణ:— వింతయైన స్వప్నమే! ఆ హంతకు డెట్లున్నాడని యామె చెప్పుచున్నది?

శాంత:— ఏదో యొక యున్నతశ్రేణికి చెందినట్లే యున్నాడని చెప్పినది. అంతకు మించి యేమియు చెప్పజాలకున్నది. ఆ రాత్రి అన్నయ్య కూడ అట్లే చెప్పలేదా? ఏమో స్వప్నములు కూడ ఒక్కొక్కప్పుడు సత్యములగుచుండునుకదా! ఏమో, ఆ హంతకుడు ప్రస్తుతము మన గ్రామమునందే యున్నాడేమో! మోహన్! అన్నయ్య మనకు కనబడి సూమారు రైదేండ్లు గడచిపోయినవి! మనము చేసినదేమి?

కృష్ణ:— శాంతా! రహస్యపరిశోధనమునకు కాలపరిమితి నిరూపింప జాలము. ఇప్పటికి నా ప్రయత్నము లేమియు ఫలించ లేదు.

శాంత:— మోహన్! ఇంక చేయగలిగిన దేమియు లేదా? ఆ నిరపరాధి యజ్ఞాతవాసమునందే మరణపర్యంతము కుమిలిపోవలసిన దేనా?

కృష్ణ:— ఈశ్వరేచ్ఛ, కాలము, కర్మము, కలసిరావలెను. అది లేనిచో మన మెన్ని ప్రయత్నములు చేసినను నిష్ఫలములే యగును.

ఈ రహస్యసంభాషణమునందు లీనమై వారిరువురును అప్రయత్నముగ నచ్చటినుండి మెల్లగ నడచి యా తోటయందొక మూల నున్న వేదికయొద్దకు పోయిరి. అచ్చటికి సుమారిరువది గజముల దూరమందున్న యొక పెద్దబండ రాతిపై రమాపతి కూర్చుండి బాలు నాడించుచుండెను. కాని యాతడు వెనుతిరిగియుండెను. మఱియు అన్యమనస్కుడై యుండెను. శాంత యాతనిజూచి త్రుళ్ళిపడి, "మోహన్ ! ఈతడు మన సంభాషణమును వినలేదుగదా !" అని ప్రశ్నించెను.

"వినియుండడు. విన్నను ప్రమాదములేదు. ఈ విషయము నందు ఆతని కేమి శ్రద్ధయుండును ?" అని యాతడు సమాధాన మిచ్చెను. .

నిజమే. రమాపతికి ఆ విషయమునందేమి శ్రద్ధయుండును ? కాని, ఈ యువతీ యువకుల యన్యోన్యతను మాత్ర మాతడు గమనింపకపోలేదు. మరియు, వీరిరువురును ఏదో రహస్య సంభాషణము గావించుకొనుచు వేదికనుండి లేచి దూరమేగుటయు, అచ్చట చెట్లమరుగున అతి సమీపవర్తులై యుండుటయు, క్రేగంటి చూపులతో స్వర్ణలత కనిపెట్టుచుండెను. ఇదియంతయు పూర్వ నిర్ణీతమైన యొక పన్నాగమని యామె భావించుకొని చంచల మనస్కయై లోలోన కుమిలిపోవుచుండెను. అత్యంత ప్రయాసమున దుర్భరమైన తన మనోవేదనను అడచుకొనుచుండెను.

ఇంతలో చీకటిపడు వేళ యైనది. కముద్వతీ దేవి గృహోన్ముఖ యగుటకు లేచెను. బండి సిద్ధముచేయుటకు శాంత ప్రాకార ద్వారముకడకు బోయెను. ఆ ముహూర్తమునందే ఇద్దఱు యువకులు మేలి దుస్తులు ధరించుకొని యతి విలాసముగా రాచవీథిలో రాజ మార్గమున నడచి పోవుచుండిరి. ఇద్దఱును ఉన్నత శ్రేణికి చెందినవారుగా కన్పట్టుచుండిరి. అందొకడు హరిహరరాయల సహోద్యోగి కుమారుడైన హరీంద్రుడు. ఈతని శాంత గుర్తించెను. రెండవవ్యక్తి కేవల మపరిచితుడు. ఆతని జూడగనే శాంత హృదయమునం దొకానొక యనిర్వాచ్యమైన చైతన్య ముద్భవించెను. క్షణమాత్ర

మున సహస్రభావము లోక్కుమారుగ నామె హృదయమునందు తలలెత్తెను. అయిదేండ్ల వెనుక, ఆనాటి రాత్రి, అభాగ్యుడైన తన యన్న నరేంద్రుడు వర్ణించిన హంతకుడు గారి యీ వ్యక్తియందామె యంతర్నేత్రములకు గోచరించెను. నూటికి నూఱుపాళ్లు వాడే వీడని యామె యంతరంగము ఘోషించెను. "ఆ హంతకుడు ప్రస్తుత మీయూరనే యున్నాడు, నేను చూచితిని," అని తల్లి యుద్ఘోషించిన తన స్వప్నగత వృత్తాంతము తలపునకు వచ్చి తన సందేహమును బలవత్తర మొనర్చెను. తన సందేహ నివృత్తికి సాధన మేమి? రెప్పవేయక ఆమె యీ నూతన వ్యక్తివైపు చూచుచుండెను.

ఇంతలో హరీంద్రు డాతని నుద్దేశించి "గౌరీనాథ్! మన సైనిక స్కంధావారము లందలి దుమారమునకును ఇచ్చటి యీ ప్రశాంత వాతావరణమునకును ఎంత తారతమ్యమో చూడు." అని పల్కెను. ఈ పల్కులను శాంత స్పష్టముగా వినెను. "ఇంక సందేహమేమి? అన్నయ్య వర్ణించిన సైనికోద్యోగి గారియే యీ గౌరీనాథ్! వాడే వీడు!" అని రూఢి చేసుకొని యే పనిమీద ద్వారము కడకు పోయినదో ఆ పని మఱచి వడివడిగా తిరిగి వచ్చి కృష్ణమోహన్ చెంత నిలచి, యెట్లైనను ఆ వార్త యాతని చెవిని వేయుటకు తత్తరపడుచుండెను. కుముద్వతీదేవిని తిరిగి యింటికి వీడ్కొల్పు సందడిలో అందఱును లీనమై యుండిరి. ప్రక్కనుండి శాంత మెల్లగా కృష్ణమోహన్ భుజము తట్టి, "అత్యవసర విషయము. కొంచెము ప్రక్కకు రమ్ము." అని రహస్యముగ చెప్పెను. కృష్ణమోహన్ ఆమెతో గలసి కొంచెము ప్రక్కకు తొలగెను.

శాంత:— మోహన్! నీవు నమ్మక తప్పదు. ఆ హంతకుడీ గ్రామము నందే యిప్పుడున్నాడు.

కృష్ణ:— (చిరునగవుతో) అమ్మకు రాత్రి స్వప్నమైన, నీకు పగలే స్వప్నము కల్గినదా యేమి?

శాంత:— స్వప్నము కాదు. ప్రత్యక్షము! ఇప్పుడిప్పుడు, ఈ ప్రాకార ద్వారము ప్రక్కనుండి వాడు పోవుచున్నాడు. ఈ కండ్లతో

నేను వానిని చూచితిని. ఇప్పు డిప్పుడు హరీంద్రునితో గలసి వాడు పోవుచున్నాడు.

కృష్ణ:— ఏ హరీంద్రుడు ?

శాంత:— నాన్నగారి సహోద్యోగి కుమారుడు హరీంద్రుడు.

కృష్ణ:— సైనికోద్యోగిగా పోయిన హరీంద్రుడా ?

శాంత:— అగును. ఆ హంతకుడు గౌరి యని అన్నయ్య చెప్పలేదా? హరీంద్రుడుకూడ వీనిని 'గౌరీనాథ్'అని సంబోధించుచున్నాడు. నేను స్పష్టముగ వింటిని.

ఈ మాటలు విని కృష్ణమోహన్ కొంతసేపు యోచనా పూర్వకముగ నడచి, "శాంతా! ఇంకను పరిశీలింపవలసి యున్నది. సరాసరి వానియొద్దకు బోయి నేరారోపణము చేయలేముకదా!" అని మందహాసము చేసెను.

శాంత:— ఇంతకన్న మన కవకాశ మేమి కల్గును? కుందేలు వంట యింటికి వచ్చినది! పట్టెదవో, విడచెదవో, నీదేభారము! నేనేమి చేయగలను!

కృష్ణ:— శాంతా! పట్టుటకు తగిన పరికరములు సమకూర్చుకొన వలెను కదా! ఈ యవకాశమును నేను పోవిడువనని మాత్రము వాగ్దానము చేయుచున్నాను.

ఇట్లు సంభాషించుకొనుచు వారిరువురును సుమారు నూఱు గజముల దూరము సాగిపోయిరి. అచ్చట నొక మలుపునందు రమాపతి నిలచియుండెను. ఆతని జూచి శాంత కలవరపడెను. కృష్ణమోహన్ ఆతని బలుకరించి, త్వరలోనే వచ్చి కలసెదనని యాతనితో జెప్పి వెనుకకు మఱలెను.

శాంతా కుముద్వతులు గృహోన్ముఖులై వెడలిపోయిరి. అందరికంటెను ముందు స్వర్ణలత ఇంటి వసారాపైకి వచ్చి గవాక్షము చెంత నిలచియుండెను. ప్రత్యక్షముగ తాను చూచియుండిన శాంతా కృష్ణమోహనుల రహస్యవర్తనము ఆమె హృదయగోళము నదలించుచుండెను. ఇంతలో రమాపతి మెల్లగా నచ్చటకు వచ్చి "స్వర్ణా! ఆ శాంత యెవరు? వారిరువురకును అపరిమితమైన

పరిచయమున్నట్లు కనబడుచున్నది! రెండుసార్లు వారు రహస్య సంభాషణములు గావించుకొనుచుండ నేను చూచితిని! నీవు చూడ లేదా?'' అని ప్రశ్నించెను.

ఈ మాటలు విననియట్లు నటించుచు స్వర్ణలత యించుక తీక్ష్ణముగా, "ఏమనుచున్నారు!'' అని ప్రశ్నించెను.

"ఏమియును లేదు. ఆ శాంతా కృష్ణమోహనుల పరిచయము గూర్చి ప్రశ్నించితిని. క్షమించుము. నీ హృదయమును వేధించితి నేమో!'' అని యచ్చటనుండి మెల్లగ వెడలిపోయెను.

## అ ధ్యా య ము 16

కర్మబంధములను సడలించుకొని స్వేచ్ఛావిహారము జేయగల ప్రాణి యీ యనంత సృష్టియం దొక్కటియు లేదు. సూర్యచంద్ర గ్రహ తారాగతుల నరికట్టగల శక్తి యుండిన నుందునేమో కాని. ఘటనాచక్రము నరికట్టగల శక్తి బ్రహ్మాండమునందు లేదు. 'బుద్ధిః కర్మానుసారిణీ' అను వాక్యము ముమ్మాటికి సత్యము! కర్మ ననుస రించి బుద్ధి చరించును. బుద్ధి ప్రసారము ననుసరించి ఘటనాచక్రము పరిభ్రమించును. ఈ మహా సత్యమునకు స్వర్ణలత జీవన లీలయే తార్కాణము.

శాంతా కృష్ణమోహనుల హత్యారహస్య పరిశోధన ప్రయత్నమంతయు కర్మనిహతమైన స్వర్ణలత కల్పనాదృష్టికి ఒకా నొక రహస్య ప్రేమనాటకమునందలి నాయికా నాయక పాత్ర ధారణమువలె గన్పట్టుచుండెను. సహోదరుని జీవనరక్షకై శాంత కృష్ణమోహన్ సహాయమపేక్షించి పొందుచున్న హృదయ క్లేశ మంతయు ఆమె దృష్టికి విరహవేదనవలె దోచుచుండెను! నిష్కల్మష హృదయుడైన కృష్ణమోహన్ పరోపకార ప్రయత్నమంతయు ఆమె దృష్టిని శాంతామోహతరంగిణిపై నావయాత్రవలె గోచరించు చుండెను! ఇం దాశ్చర్య మేమియును లేదు. కర్మపాశ నిబద్ధయై ఘటనాచక్రములపై స్వర్ణలత భ్రాన్త్యంధకారమునం దొకానొక నిర్ణీత ప్రదేశమునకు ఈడ్చుకొని పోబడుచున్నది!

ఆనాడు మొదలు రాత్రింబవళ్లు ఆ నూతనవ్యక్తి గౌరీనాథ్ శాంతి దృక్పథమునందు గాఢముగ హత్తుకొని యుండెను. అనేక విధముల, అనేక రహస్యోపాయముల, గౌరీనాథ్ పూర్వోదంతమును తెలుసుకొనుటకు ప్రయత్నించుచుండెను. అప్పుడప్పుడు తానే పురస్కరించుకొని హరీంద్రుని యింటికి బోయి, అచ్చట అతిగ్నమై యుండిన గౌరీనాథుని పూర్వజీవిత విశేషములను ఒక్కొక్కటిగ సేకరించుచుండెను. సేకరించిన ప్రతి విశేషమును ఎప్పటికప్పుడు ఏదో యొక విధముగ రహస్యముగ కృష్ణమోహన్ చెవిని వేయుచుండెను. ఈ ప్రయత్నమునందు ఏదో మిష పెట్టి యామె తఱచుగ సువర్ణదుర్గమునకు బోవుచుండెను. కృష్ణమోహన్‌తో రహస్య సంభాషణములు చేయుచుండెను. సువర్ణదుర్గమునందు తఱచు జరుగుచుండిన యీ రహస్య సమ్మేళనములను స్వర్ణలత కనిపెట్టుచుండెను. కాని, అందలి యంతరార్థము మాత్రము ఆమెకు దెలియక దుర్భరమైన మనోవేదనకు లోనగుచుండెను. ఆమె హృదయ గహ్వరమునందు భయంకరమైన యసూయా మహాసర్పము వేయి పడగలెత్తి బుసకొట్టుచుండెను. ఆ భీషణ సర్పమునకు అవకాశము దొరకినపుడెల్ల రమాపతి నాగస్వర మూదుచుండెను. ఒకటికి పది చేర్చి వీలు కలిగినపుడెల్ల ఆతడామె చెవిని వేయుచుండెను. పాపము, అమాయికుడైన కృష్ణమోహన్‌కు తన పరోక్షమున రగులుచుండిన అగ్నిహోత్రపు వేడిమి లవమాత్రమును సోకలేదు. తన ప్రియసఖి మనఃకాసారమునందలి మధురానురాగము క్షణక్షణమును ఎట్లు కాలకూట విషముగ మారిపోవుచున్నదో యాతని కణుమాత్రమును తెలియదు.

ఒకనాటి యుదయమున కల్యాణనగరమునందలి తన కచేరిగది యందు ఒంటిగా కూర్చుండి యేవో కాగితములు పరిశీలించుచుండెను. ఇంతలో గుమస్తా విశ్వాసరాయలు వచ్చి "ఎవ్వరో గౌరీనాథుడట, తమ దర్శనమునకై వచ్చియున్నాడు" అని నివేదించెను. ఆ పేరు విని కృష్ణమోహన్ ఇంచుక విస్మితుడై యోచించి, "లోనికి బంపుము" అని పల్కెను. ఉత్తర క్షణమే గౌరీనాథ్ లోన ప్రవే

శించెను. ఆతని నించుక నిదానించి, ఆసీనుజేసి, ''ఆర్యా! తాము వచ్చినపని సెలవిండు'' అని కోరెను.

గారీ:— నేను ఒకవిషయమున తమ సలహాకోరి వచ్చితిని.

కృష్ణ — సంతోషము. కాని, క్షమింపుడు. నా సలహా కోరువారి చరిత్రాదికములు ముందుగా నేను తెలుసుకొనవలయునుగదా!

గారీ:— సందేహామువలదు. నాకు ధనమునకు కొఱతలేదు.

కృష్ణ:— (నవ్వి) నా యభిప్రాయ మది కాదు. నా సలహా కోరువారు స్థితిపరులో కారో నే నెన్నడును గమనించువాడను కాను. వారి గుణశీలములే నాకు కావలయును. తాము కేవలము నా కపరిచితులగుటచే ఆవిషయము నాకు దెలియనిది కదా!

గారీ:— గ్రహించితిని. నా గుణశీలములకు ప్రమాణ మెట్లీయగలనో తోచకున్నది. నేనొక సైనికోద్యోగిని. ఇంతవఱకు ఎవ్వరిచేత మాటపడలేదు. ఈ విషయము మీకు పరిచితుడైన నా సహోద్యోగి హరీంద్రునకు బాగుగా తెలియును. ఆతని సలహామీదనే నేను తమయొద్దకు వచ్చితిని.

కృష్ణ:— సంతోషము. ఏవిషయమున నా సలహా కావలయునో చెప్పుడు.

ఈ ప్రశ్నోత్తరములయందు ఇరువురును ఒకరినిమించి యొకరు అతి మర్యాదగనే ప్రవర్తించిరి. అపై గారీనాథుడు తన ప్రస్తుతపరిస్థితి యాతనికి విపులముగ చెప్పెను. కృష్ణమోహన్ తనకుదోచిన సలహా నిచ్చెను. కాని, యది కేవలము తాత్కాలిక మనియు, తదనంతర పరిస్థితులనుబట్టి మార్చవలసినచో మార్చుకొనవచ్చుననియు జెప్పెను.

పిమ్మట, ఇష్టాగోష్టిలోబడి, కృష్ణమోహన్, ''ఆర్యా! సుమారు ఏ డెనిమిదేండ్ల క్రితము మీ రీ కల్యాణపురమునకు వచ్చి యుంటిరా?'' అని ప్రశ్నించెను.

గారీ:— (ఇంచుక నేపూరకుండి) అగును. లోకమున కా విషయము తెలియకపోవుటయే నా కోరిక. కాని, తమతో జెప్పుటకు నేను సంశయింపవలసిన పనిలేదు. ఈ పురమునందుండలేదు. కాని, యీ ప్రాంతమునందుంటిని. క్రిందుమీదు తెలుగని యావన

ప్రాదుర్భావముచే...కొంత విలాసజీవనము గడపితిని...అది యొక పెద్ద గాథ! తలచుకొనిన నాకిప్పు డేవగింపు కలుగు చున్నది!

ఈ మాటలకు తన హృదయమునందు కొంత నాటిన సందేహ బీజములు ఒక్కసారిగ మొలకలెత్తెను. ఆతడే యా హంతకుడని యాతనికి ప్రస్ఫుటమగుచుండెను.

కృష్ణ:- అగును. ఆ విలాస జీవనమున కథానాయకి 'అమీనా' కాదా?

గౌరి.- (విస్మితుడై) ఎవరు?—అమీనా! ఆ పేరే యింతవఱకు నేను వినియుండ లేదు.

కృష్ణ:- సుమారు అదే సమయమున ఈ ప్రాంతమునందొక హత్య జరిగియుండుట మీకు తెలియదా? అమీనా తండ్రి—

గౌరి:- ఓహో, ఈ హత్యావిషయమే కాబోలు మొన్న హరీంద్రుడు నాతో చెప్పుచుండెను. ఆమె తండ్రి—

కృష్ణ:- హత్యగావింపబడెను. ఆ హంతకుడు—

గౌరి:- న్యాయాధిపతి హరిహరరాయల కుమారుడు నరేంద్రుడట! ఆతడిప్పు డదృశ్యుడై పోయినాడట! అది మొదలు ఆ స్త్రీ కూడ అదృశ్యమై పోయెనట!

కృష్ణ:- అగును. ఆమె మీకు తెలియునా?

గౌరి:- తెలియదు. హరీంద్రుడీ కథ చెప్పువఱకు ఆ పేరే నాకు తెలియదు.

కృష్ణ:- ఆమె యనుగ్రహమునకు అనేకులు ప్రాకులాడుచుండిరట! కాని, గౌరి యను నాత డామెకు ప్రియుడై యుండెనని వింటిమి. ఆ గౌరియే మీరేమో యని—

గౌరి:- ఏమో, నేనేమైయుండిన అప్పుడు గర్వించి యుండెడివాడ నేమో?

కృష్ణ:- అట్లయిన, మీ విలాసనాటకమునందలి కథానాయకి వేఱొకతె యన్నమాట!

గౌరీ:— ఆమె యొక సంసారిణి! భర్తతో నామెకు సంభవించిన కలహము నాధారము చేసుకొని నేను...పోనిండు ఆ విషయ మిప్పుడేల? పిమ్మట ఆ భార్యాభర్తలకు సంధి జరిగినది. నా కుద్యాసము కలిగినది. ఆ నాటకము తలపునకు వచ్చినపు డెల్ల నాకు లజ్జ పొడముచుండును. ఇంక నాకు సెలవిండు. నమస్కారము.

అని లేచి వెడలిపోయెను. ఆతని తోడి సంభాషణానంతరము కృష్ణమోహన్ సందేహ మధికమయ్యెను. ఆతని ధోరణి సత్యాసత్య మిశ్రమపాకమువలె నాతనికి పొడగట్టెను. వాడే వీడగునా, కాదా యను సందేహమునం దాతని బుద్ధి చలింపసాగెను. దృశ్యాదృశ్యముగ వాడే వీడని యాతని మనసునకు తట్టుచుండెను. దీర్ఘాలోచనాపరుడై సుమా రొక యరగంట యూతని ఆఫీసు కుర్చీపై చేరబడి యుండెను. పిమ్మట గుమస్తా విశ్వాసరాయలను పిలచి తన మనోభావముల నాతనికి వెల్లడించి, కనిపెట్టుచుండుమని చెప్పి, భావి కార్యక్రమము నాలోచించుచు గృహోన్ముఖుడై పోయెను.

ఆ సాయంసమయమున తండ్రి యింటలేని సమయము జూచుకొని, శాంత హాస్యరహస్య సంబంధమున అన్యానసరముగ కృష్ణమోహన్‌తో కలియగోరి సువర్ణగృహమునకు బోయెను. ద్వారము వద్ద నొక సేవకుని జూచి, "బాబుగా రేమి చేయుచున్నారు?" అని ప్రశ్నించెను.

"బాబుగారింక నింటికి రాలేదు. ఈ పాటికి రావలసినది. ఎందు కాలస్యమైనదో! లోనికి దయచేయుడు" అని పల్కెను.

శాంత హీనస్వరముతో "సరిలే, మరల వచ్చెదను." అని లోన ప్రవేశింపకయే మరలిపోయెను. ఆమె వచ్చుటయు, మరలి పోవుటయు, మేడపై గవాక్షముకడ భర్తరాకకై నిరీక్షించుచుండిన స్వర్ణలత కనిపెట్టుచుండెను. ఆ సమయమున నే ఆరామవేదిక చెంత చెట్లమఱుగుననుండి యిది యంతయు కనిపెట్టుచుండిన రమాపతి దృగ్జాలములు మీది గవాక్షమువైపు మరలి స్వర్ణలత దృష్టి నాకర్షించెను. తక్షణమే స్వర్ణలత ముఖమునంచుకొని పెద్ద నిట్టూర్పు విడచెను.

శాంత మెల్లగ గృహోన్ముఖయై పోవుచు మార్గమధ్యమున కృష్ణమోహనుని గలసెను.

శాంత:— మోహన్ ! నీకొఱకు వచ్చియుంటిని. హతాశనై తిరిగి పోవుచుంటిని. భాగ్యవశమున నిన్ను చూడగల్గితిని. ఒక పెద్ద వార్త తెచ్చియున్నాను.

కృష్ణ:— ఏమది ? గౌరీనాథ్ సంబంధమేనా ?

శాంత:— కాదు, అన్నయ్య వార్త !

కృష్ణ:— నరేంద్రుని సమాచారమా ! ఓహో, ఎంతకాలమునకు ! ఏమది ?

శాంత:— ఇదిగో, ఈ పత్రము చూడుము.

అని పయ్యెద మఱుగునుండి యొక పత్రమును దీసి యాతని చేతి కిచ్చెను. అం దిట్లుండెను. ఎచ్చటినుండియో లేదు. సంతకము లేదు.

"రెండు మూడు రోజులలో వచ్చుచున్నాను. అదే స్థలమున కలియవలెను. అదే సమయమున నాకొఱకు చూచుచుండుము. నే నెవరినో నీకు తెలియును."

కృష్ణ:— శాంతా ! ఈ పత్రము నీ కెట్లు చేరినది ?

శాంత:— అక్కయ్యనుండి నా ప్రత్యేక విలాసమునకు వచ్చిన యొక జాబునందీ పత్రము కూర్పబడి యున్నది.

కృష్ణ:— సరియే, మీ యక్కద్వారా ఈ జాబును నీ కందజేసినాడు. మంచిది. మంచిసమయమునకే అతడు వచ్చుట తటస్థించు చున్నది. గౌరీనాథుని గూర్చిన సందేహమును నరేంద్రుడు స్వయముగ తీర్చగలడు. ఆతని రాక కనిపెట్టుచుండుము. వచ్చిన తక్షణము నాకు దెలియజేయుము.

శాంత:— తప్పక ! మోహన్ ! భగవంతుడే స్వయముగ వాని నిచ్చటకు గొనివచ్చుచున్నాడని తలంతును.

కృష్ణ:— దీని పరిణామ మెట్లుండునో చూతము. ఈశ్వరేచ్ఛ ! ఇంక నేను పోయెదను.

అని యామెను వీడ్కొల్పి, తాను వడివడిగా నిల్లుచేరెను. మార్గమధ్యమున జరిగిన యీ సమ్మేళనమును, సంభాషణమును గవాక్ష ద్వారమునుండి స్వర్ణలత తదేక దృష్టితో జూచుచుండెను. చెట్లచాటునుండి రమాపతియు నేకాగ్ర దృష్టితో కనిపెట్టుచుండెను.

భోజన సమయమున యజమానురాలైన తన యక్కగారు కృష్ణమోహనుని జూచి, "ఇంత యాలస్యమైన దేమి?" అని ప్రశ్నించెను.

కృష్ణ:— అత్యావసర కార్యములు వచ్చిపడినవి. ఇంచుక యాలస్యమైనది.

అక్క:— శాంత యేల వచ్చినది ?

కృష్ణ:— ఏదో స్వంత గోల !

అక్క:— ఏమది ?

కృష్ణ:— (నవ్వుచు) వచ్చినవారి రహస్యము లన్నియు వెల్లబెట్టెడి న్యాయవాది యెందుకైన పనికివచ్చునా ?

అక్క:— అది కాదు. కొన్నాళ్లయి శాంత తఱచుగా వచ్చి నీతో సంభాషించుచుండుట నేను చూచుచున్నాను. మరల— ఆ వెనుకటి కథ యేమైన సాగుచున్నదా యేమి?

'వెనుకటి కథ' యనుటయందు ఆమె యభిప్రాయమేమో కృష్ణమోహన్‌కు మాత్రము తెలియును. కాని, పాపము, స్వర్ణలత కందలి యంతరార్థ మేమి తెలియును! శాంతాకృష్ణమోహనుల వెనుకటి యన్యోన్య ప్రణయసంపర్కమే యని యామె భావించెను.

కృష్ణ:- ఏదో, ఇప్పు డది యేల ? వృత్తిరహస్యములు బహిరంగముగ చెప్పుమందువా ? ఏ మందువు రమాపతీ !

అని యాతనివైపు చూచి నవ్వెను. ఆతడు సహిత మొక వికటహాసము జేసి స్వర్ణలత ముఖమువైపు జూచెను. ఆమె హృదయమునందు అగ్నిజ్వాలలు రగులుచుండెను. ఒక్క మాటయైనను ఆమెనోట వెలువడుట లేదు. ఏమిచేయుచుండెనో యామెకు చైతన్యము లేదు.

ఆ సాయంకాలము, ఆమె తన హృదయవేదనను భరింపజాలక, ఏకాకియైయున్న సమయము జూచి, భర్తను సమీపించి,

"మోహన్! ఆ శాంతకు మీతో నేమిపని యున్నది?" అని ఖండితముగ బ్రశ్నించెను.

కృష్ణ:- అది యొక రహస్య విషయము స్వర్ణా!

స్వర్ణ:- ఆ రహస్యము నాకు తెలియరాదా?

కృష్ణమోహన్ కొంతవడి నిరుత్తరుడై యూరకుండెను. ఆ రహస్య మామెకు తెలుపుట యుక్తమో కాదో యోచించెను. అత్యంత నిశితావస్థకు వచ్చుచున్న యా రహస్య పరిశోధనమును ఆపట్టున భార్య కర్ణములనైనను వైచుట ప్రమాదకరమని యాతని బుద్ధికి దోచెను.

"స్వర్ణా! ఆ నిగూఢ రహస్యము నీ విప్పుడు తెలుసుకొనవలసినది కాదు. కాలక్రమమున నీకే దెలియును. ఇప్పుడు తెలిసినచో నీ వానందింపజాలవు."

అని యాతడు సమాధానము జెప్పెను. కాని, ఆ సమాధానము ఆమె హృదయమున కెక్కలేదు. ఆమె హృదయమునందు విక్రమించుచున్న యసూయా పిశాచపు జాడ నాతడు గుర్తించలేదు. ఒకప్పు డామెను కలవరపరచి యుండిన యనుమానము ఎన్నడో నిర్మూలమైనదని యాతడు విశ్వసించి యుండెను.

## అధ్యాయము 17

ఆ రహస్యలేఖ తనకు జేరిన నాటి రాత్రినుండియు వరుసగ మూడు రాత్రులు శాంత యేకైక ధ్యానయై గవాక్షము నంటిపెట్టుకొనియే యుండెను. ఆమె దృష్టి నంతయు నెదుటి మామిడి తోపులోనికే కేంద్రీకరింపబడి యుండెను. అది మూడవరాత్రి. చంద్రాస్తమయమున కింకను బారెడుమేర యుండెను. తోటలో నించుక యలికిడి యయ్యెను. చెట్ల మరుగునుండి యొక ఛాయావ్యక్తి యామెకు దృగ్గోచరమయ్యెను. ఆమెగుండె దడదడ కొట్టుకొనసాగెను. ఆనాడు తండ్రి హరిహరరాయలు ఇంటియొద్దనే యుండెను.

చావడిలో గూర్చుండి పొగమబ్బులు విడచుచు నేదో గ్రంథమును నేదేక దీక్షతో చదువుకొనుచుండెను. ఆతని దృష్టి యేమాత్రము చలించినను కార్యభంగము నిశ్చయము. పైపై ప్రాణాంతికమైన పరిస్థితి యేర్పడును. అయినను, అత్యంత సాహసము వహించి శాంత మెల్లగ నిశ్శబ్దముగ చావడిలో నుండి బయటకు నడచి ప్రాణము లరచేత బట్టుకొని ప్రాకారద్వారము గడచి తోటలోనికి బోయి యా ఛాయాన్యక్తి యెదుట నిలిచెను.

"శాంతా!" అని నరేంద్రుడు పలుకరించెను.

"అన్నయ్యా! వచ్చితివా! నాన్నగారింట నున్నారు. రెండు నిముషములలో నేను మరలిపోవలెను. నీవువచ్చిన సమాచారము కృష్ణమోహన్‌కు చెప్పెదను. రేపు సరిగా ఈ సమయముననే మరల ఇచ్చటకు రమ్ము. కృష్ణమోహన్ నిన్ను కలియును. అధికము మాటాడుట కవకాశము లేదు. పోయెదను. తప్పక రమ్ము," అని చెప్పి వడివడిగా మరలి వచ్చెను. ఆమె గుమ్మమెక్కుచుండగా, "శాంతా!" అని తండ్రి గర్జించెను.

"వచ్చుచున్నాను" అని యామె లోనికి వచ్చెను.

"చూడు, అమ్మ కౌషధమిచ్చువేళ యైనది" అని యాతడు గడియారము జూపెను.

"ఇచ్చెదను" అని యామె లోనికిబోయి, తల్లితో నరేంద్రుని తాను చూచివచ్చిన వృత్తాంతము జెప్పెను. ఆ రాత్రి యంతయు మాతాపుత్రిక లిరువురకును నిద్రలేదు. ఎప్పుడు తెల్లవారును, ఎప్పు డీవృత్తాంతము కృష్ణమోహన్ చెవిని వేయుదును, అని శాంత క్షణములు లెక్కపెట్టుచుండెను.

మరుసటి ఉదయమున హరిహరరాయలు యిల్లువిడచి పోవగనే యామె కృష్ణమోహన్ కచేరియింటికి వడివడిగా బోయెను. అచ్చట గుమస్తా విశ్వాసరాయ లెదురువచ్చి. "అమ్మా! బాబుగారు కార్యాంతరమున పోయియున్నారు. వచ్చుసరికి సాయంకాల మగును. నావలన కావదగిన పని యేమైన కలదా?" అని యడిగెను.

"ఆతనితో స్వయముగ కొంత మాటాడవలసివచ్చితిని. పోనిమ్ము మరల వచ్చెదను" అని భగ్నోత్సాహియై యామె పోబోవుచుండగా కృష్ణమోహన్ గుఱ్ఱపుబండి యెదురయ్యెను. అందు స్వర్ణలతా పుత్రికాసహితముగ నెచ్చటికో పోవుచుండెను. భర్త కచేరి ముంగిట శాంతను జూచి యామె ముఖము చిట్లించుకొని, కృత్రిమమైన మందహాసముతో నామెను పలుకరించి పోయెను. ఆ కృత్రిమ మందహాసము చాటున నేమున్నదో, పాపము, శాంతకు తెలియదు. తన ప్రవర్తనము స్వర్ణలత కసూయాహేతు వగుచున్నదని యామె యెన్నడును భావించి యుండలేదు. కృష్ణమోహన్ హృదయము నామె తెలుసుకొని, స్వర్ణలతకై తన ప్రేమను బలిదానము చేసికొని చాలకాలమైనది!

ఆ సాయంకాలము కృష్ణమోహన్ సమయము గనిపెట్టి, శాంత యాతని గలసికొని నరేంద్రుని రాక ఆతని కెఱిగించెను. ఆ రాత్రియే సుమారెనిమిదిగంటలకు నరేంద్రు నాతడు కలియవలెను. ఆ రాత్రియే గౌరీనాథుని తన కచేరి గృహమునకు రప్పించి, యచ్చట రహస్యముగ నరేంద్రుని కాతని జూపి, తన సందేహానివృత్తి జేసికొనవలెను. ఆ స్వల్ప సమయమునం దాతడు చేయవలసిన దెంత గొప్పదో యెంతో యున్నది.

"నరేంద్రుని రాక గనిపెట్టి, యాతడు వచ్చిన వెంటనే సరాసరి నా కచేరి యింటికి పంపుము. వచ్చునప్పుడు ఏమియు జంకవలదని చెప్పుము," అని శాంతతో జెప్పి యామెను పంపివైచెను. పిమ్మట, తనపై రానున్న వ్యాజ్యమునకు సంబంధించిన యొక ప్రధాన విషయము నాతనితో జెప్పవలసి యున్నది కావున, రాత్రి తొమ్మిది గంటలకు తన కచేరి యొద్దకు రావలసినదని గౌరీనాథున కొక చీటివ్రాసి హరీంద్రుని యింటికి బంపెను.

ఆ రాత్రియే సకుటుంబముగ నాతడు చేరువ గ్రామమందున్న యొక సంపన్న మిత్రుని యింటికి విందున కాహ్వానింపబడి యుండెను. ఆ విందునకు తాను రాజాలనని చెప్పి తన కుటుంబమును మాత్రము పంపుటకు వడివడిగా నింటికి బోయెను. అచ్చట నందఱును విందునకు ప్రయాణ సన్నద్ధులై యాతనికొఱకు నిరీక్షించుచుండిరి.

"మోహన్! విందుమాట మరచితిరా యేమి?" అని స్వర్ణలత హెచ్చరించెను.

"స్వర్ణా! ఆకస్మికముగ నొక పెద్ద పని వచ్చిపడినది. నేను రాజాలను. మీరందఱును వెళ్ళుడు. నన్ను క్షమించుడని వారితో చెప్పుడు." అని యాతడు పల్కెను.

స్వర్ణలత నిస్తబ్ధ యయ్యెను. ఆమె ముఖము వెలవెల బోయెను. ఆ యుదయమే భర్త కచేరి యింటిముంగిట తాను శాంతను జూచుటయు, ముందు విందునకు బోవుద మని నిశ్చయించుకొని యాకస్మికముగ నిప్పుడు తాను రాజాల ననుటయు, ఆమె మనోవీధి యందు ముడిపడి పరిపరి విధములైన యూహావాయువులను రేకెత్తెను. ఆమె యంతర్నేత్రమునకు సహస్రముఖమై శాంతయే గోచరించు చుండెను. వివర్ణమైన యామె ముఖమును జూచి కృష్ణమోహన్ "స్వర్ణా! అది యొక సామాన్య విషయమై యుండిన మన గుమస్తా కప్పజెప్పి వచ్చెడివాడను. అది యట్టిది కాదు. నేను స్వయముగ చేయవలసిన ఒక అత్యవసర కార్యము."

స్వర్ణ:— పోనిండు. అది చూచుకొని కొంచె మాలస్యముగనైన రాలేరా?

కృష్ణ:— సాధ్యము కాదు స్వర్ణా! ఇంతకును నాకా విందు ప్రాప్తము లేదు. మీరందఱును వెళ్ళిరండు.

అని వారిని వీడ్కొల్పి తాను తిరిగి కల్యాణనగరము నందలి తన కచేరి గృహము జేరెను.

ఎనిమిది గంటలైనది. ఒక్కడే తన గదియందు కూర్చుండి యేదో పత్రమును చదువుకొనుచు నరేంద్రుని కొఱకు నిరీక్షించు చుండెను. మఱి పదునైదు నిమిషములకు బయటి తలుపు తట్టబడినది. కృష్ణమోహన్ ఆత్రముతో బోయి తలుపు దెరచెను. అదే విగ్రహము! అదే వేషము! అవే కోరమీసములు! ముఖమును సగము కప్పివేయుచున్న తలకట్టు! భయవిహ్వలములైయున్న దృగ్జాలములు! ఆతని లోనికి రమ్మని, తలుపు బిగించి, తన గదిలోనికి

దోడ్కొనిపోయి కూర్చుండబెట్టి, "నరేంద్రా! నీకు పరిచితు లెవరైన నీ కంట బడిరా?" అని ప్రశ్నించెను.

నరేం:— నేను ముఖమెత్తి జూచిన కదా! వంచిన ముఖము తిరిగి యిప్పుడే యెత్తితిని!

కృష్ణ:— నీ జీవన పరిస్థితు లిప్పు డెట్లున్నవి?

నరేం:— ఎట్లుండవలెనో యట్లే! అజ్ఞాతవాసము చేయుచున్న వాని జీవన మెట్లుండును?

కృష్ణ:— ఆ ముష్టితలగుడ్డ తీసివేయుము.

నరేం:— (మెల్లగ తీసివేయుచు) ఎవరైన వచ్చెదరేమో!

కృష్ణ:— భయము లేదు. ద్వారములు బంధింపబడియున్నవి. నరేంద్రా! నీవు రాకరాక చాల మంచి సమయమునకే వచ్చితివి. ఆ హంతకుడు 'గౌరి' యని నీవు చెప్పియుంటివి. ఆ పేరు గలవాడే, నీవు చేసిన స్వరూపాది వర్ణనముతో సరిపోవుచున్న యొక వ్యక్తి యిప్పు డీ గ్రామమునం దున్నాడు. హరీంద్రు నితోపాటు సైనికోద్యోగిగా నున్నాడట! ప్రస్తుత మాతని యింటనే యున్నాడు. ఈ ప్రాంతమునందే యేడెనిమిదేండ్ల క్రిందట నేదో స్త్రీసహవాసము చేసి యుండెనట! వాడే వీడని నాకు సందేహము కలుగుచున్నది! ఆ సందేహ నివృత్తి నీ వల్లనే కాగలదు. నీవు వానిని పోల్చగలవు కదా?

నరేం:— పోల్చ లేకేమి? వాడు నాకళ్ళలో నిల్లు కట్టుకొనియున్నాడు.

కృష్ణ:— ఈ యేడెనిమిదేండ్లలో వాడేమైన మారియుండిన?

నరేం:— ఏడెనిమిదేండ్లు కాదు, ఏడెనిమిది యుగములైనను నేను వానిని పోల్చగలను.

కృష్ణ:— మంచిది. ఇప్పుడు వా రిచ్చటకు వచ్చును. ఇదిగో, ఈ గదిలో నిన్నుంచెదను. ఆ కవాటమునందున్న ఆ చిన్న రంధ్రము ద్వారా వాని ముఖమును నీవు బాగుగ పరిశీలింపుము. గదిలో ఏమాత్రమును శబ్దము చేయరాదు సుమా! ఆపాదశిరఃపర్యంతము వానిని నీవు బాగుగ పరిశీలింపుము.

నరేం:– అట్లే చేయుదును. ఇంక నెంత సేపటికి వాడు వచ్చునో ?

కృష్ణ:– వచ్చువేళ యైనది.

అనుచుండగనే వీధిద్వారమునుండి పిలుపు వినబడెను.

"అదిగో, వచ్చినాడు. నీవీ గదిలోనికి బొమ్ము. జాగ్రత్త ! ఏమియు శబ్దము చేయరాదు." అని నరేంద్రుని గదిలోనికి బంపి, తలుపు తాళమువైచి, పోయి వీధిగుమ్మము తెఱచి గౌరీనాథుని లోనికి దోడ్కొనివచ్చి, గది కభిముఖముగానున్న కుర్చీపై నాసీను జేసెను.

గౌరీ:– ఆలస్యమైన దేమో, క్షమింపుడు. నా నిమిత్తమే యింత రాత్రి వఱకు తామిచ్చట నుండవలసి వచ్చిన దేమో !

కృష్ణ:– అయిన నేమి ! కార్యముపట్ల సమయాసమయ విచారము గమనించువాడను కాను. మీపై రానున్న వ్యాజ్యమును గూర్చి కొంత సమాచారము తెలిసినది. వెంటనే దానిని మీకు తెలియజేయ గోరితిని.

గౌరీ:– ఏమైన ఆశాజనకముగ నున్నదా ?

కృష్ణ:– అంత తృప్తికరముగ లేదు. వారు మిమ్ము రచ్చకీడ్చుటకు కృతనిశ్చయులై యున్నారు.

గౌరీ:– న్యాయము నా పక్షమున లేదా ?

కృష్ణ:– అయ్యా ! న్యాయమునకును చట్టమునకును ఒక్కొక్కప్పుడు అన్యోన్య వైరుధ్యము కల్గును.

గౌరీ:– నాకేమైన ప్రమాదము కల్గునా ?

కృష్ణ:– ప్రమాదకరమైన పరిస్థితియే. కాని, మీ క్షేమమునకై నేను కొంత యత్నించుచున్నాను. ఒకటి రెండు రోజులలో మీకు మరల కబురంపెదను.

పిమ్మట నిరువురును లేచి నిలచిరి. ఏదో ప్రసంగముతో గది కభిముఖముగా నాతని నైదారు నిముషములు నిలబెట్టి, యాపై నాతని ద్వారమువరకు వీడ్కొల్పి, తలుపు బిగించి, లోనికి వచ్చి, నరేంద్రుని గదితలుపు తీసెను.

కృష్ణ:– నరేంద్రా ! వాడేనా వీడు ?

నరేం:- కాదు. వానికిని వీనికిని పోలికయే లేదు. వెలుగునకును చీకటికిని ఎంత భేదమో వీనికిని వానికిని అంతె భేదము కలదు.

కృష్ణ:- నీవు పొరపడుట లేదు కదా?

నరేం:- ఎంతమాత్రమును పొరపడలేదు. వీడు వాడుకాదు.

దీనితో కృష్ణమోహన్ సందేహము నివృత్తియయ్యెను. ఒక పెద్దభారము తీరినది. గౌరీనాధుని జూచినప్పటినుండియు నాతనియెడల నొక సద్భావనమే యాతని హృదయమునందు కల్గెను. ఈ సద్భావనమునకు భంగము కలుగలేదుకదా యని యాతడు సంతోషించెను.

అప్పటికి సుమారు పదిగంటలైనది. నరేంద్రునితో గలసి వారి యింటివైపు బోయెను. ప్రాకారద్వారము చెంత శాంత నిలచి వారి రాకకై యెదురు చూచుచుండెను.

కృష్ణ:- శాంతా! నాన్నగారింకను రాలేదా?

శాంత:- లేదు. వారు పురమందిరమునుండి యట్లే యెవ్వరియింటికో విందునకు బోయిరట! వర్తమానము వచ్చినది. ఎంత యదృష్టమో చూడు!

కృష్ణ:- అదృష్టమే!

శాంత:- అన్నయ్య గారిని పోల్చినాడా?

కృష్ణ:- చూచినాడు. ఎంతమాత్రమును వీడు వాడుకాడని చెప్పుచున్నాడు.

శాంత:- వాడు కాడా?

నరేం:- కాడు శాంతా! వాని రూపు, వాని వైఖరి, నాకు తెలియదా?

కృష్ణ:- పోనిమ్ము, ఆ విషయము తేలిపోయినది. మంచిదేకదా! ఈ సందేహము వలన, చేయుచున్న పరిశోధన యాగిపోయినది. ఇంక, ఆ యెలుకకై ఇతరత్ర వెతుక వచ్చును. పద, నరేంద్రుని అమ్మ కప్పగింతము.

అని ముగ్గురును లోన బ్రవేశించిరి. కుమారుని చూడగనే తల్లికడుపు తఱుగుకొని పోయెను. బొట బొట కన్నీరు కార్చుచు నామె యెదురువచ్చి నరేంద్రుని కౌగిలించుకొని యేడువ సాగెను.

"అమ్మా! విలంబమున కవకాశము లేదు. మీ సమావేశము త్వరలోనే ముగియవలెను. నేను తోట గుమ్మముకడ నిలచి హరిహరరాయల రాక కనిపెట్టుచుండెదను. త్వరలో ముగించుడు." అని చెప్పి కృష్ణమోహన్ బయటకు పోయెను. ఇంచుకసేపు అన్నతో సంభాషించి, శాంతకూడ బయటకు వచ్చి యాతని గలసెను. ఇరువురును తోట గుమ్మమునద్ద నిలచి సంభాషించుచుండిరి.

విందునకు బోయియుండిన స్వర్ణలత మనస్సర్వస్వము కృష్ణమోహన్ పైనే యుండెను. ఎట్లో యా విందు నిర్బంధము నుండి వెలువడి యామె తిరిగి గుఱ్ఱపుబండిపై గృహోన్ముఖి యయ్యెను. సుమారొక యరమైలు బండి నడచినదో లేదో రమాపతి యెదురై బండి నాపి యామెను పలుకరించెను.

స్వర్ణ:— రమాపతీ! ఇంత రాత్రివేళ ఇచ్చట నుంటివేమి?

రమా:— మీకు విందులు. కాని, నాకేమున్నవి? ఏమియు తోచక వెన్నెలలో నిటు విహరింప వచ్చితిని.

స్వర్ణ:— ఇంకను మోహన్ ఇంటికి రాలేదా?

రమా:— లేదు. ఇంటికన్న గుడియే యతనికి పదిలముగా నున్నది. గుడిలోని దేవత విడిచిన కదా ఇంటికి వచ్చుట! (అని పకపక నవ్వి) ఇప్పుడిప్పుడే నేను వారిద్దరను హరిహరరాయల యారామద్వారముచెంత నొకరి నొకరు ముడివైచుకొని సంభాషించుకొనుచుండగా చూచితిని.

ఈ మాటలు చెవిని బడినంతనే యామె యాపాదమస్తకమును వణకసాగెను. రెండు చెవులయందును రెండు మహాసముద్రములు ఘూర్ణిల్లసాగెను. యావత్ ప్రపంచమును కండ్లయెదుట కుమ్మరియావమువలె తిరుగసాగెను. అగ్నిజ్వాల లన్నివైపులనుండియు తన్ను చుట్టుముట్టుచున్నట్లయ్యెను.

"అమాయికనైన నన్ను నమ్మించి మోసపుచ్చితివి! నా సహజ ప్రేమవాహిని నరికట్టితివి! అసత్య ప్రేమదుమారముచే నా కన్నులు కప్పివైచితివి! నా జీవితము నధోగతిపాలు జేసితివి! నీచాత్మా! మాయావీ! నీకు తగిన శిక్షావిధానము భగవంతునిచేత

లేదా ?'' అను గంభీర శబ్దములు తన యంతరంగమునందు ప్రతి ధ్వనించుచుండెను. ధారాపాతముగ కన్నీరు పాఱజొచ్చెను.

గద్గదికతో నామె, "రమాపతీ! ఇంకను విహరించెదవా. లేక, ఇంటికి వచ్చెదవా? వచ్చినచో బండి నెక్కుము'' అని చెప్పెను.

"చాల రాత్రి యైనది. ఇంటికి వచ్చెదను.'' అని యాతడు బండినెక్కి మొత్తముపై గూర్చుండెను. బండి వడివడిగా సాగి పోవు చుండెను. హరిహరరాయల యారామద్వారము ప్రక్కనుండి బండి పోవుచుండగా స్వర్ణలత వంగి యారామమువైపు దృష్టి సారించెను. నిర్మలమైయున్న యా చంద్రకాంతియందు శాంతాకృష్ణ మోహనులు ఒక వేదికపై గూర్చుండి సంభాషించుకొను చుండుట యామెకు విస్పష్టముగ గోచరించెను. ఇంక ప్రత్యక్షమునకు ప్రమాణ మేల? అత్యంత కోమలమైన యామె హృదయము క్షణములో పాషాణ మయ్యెను. కన్నులనుండి బాష్ప బిందువులకు మారు నిప్పు కణములు రాల జొచ్చెను.

"ఈ మాయా రాక్షసునిచే నీవు వంచింపబడితివి! ఈ యధమా ధమునిచే నీ ప్రేమధన మపహరింపబడినది! నీ నిష్కల్మష ప్రేమ హృదయమునం దీ నీచానికిచ్చునకు స్థానము కలదా? తొలగిం పుము. పదాహతి మొనర్చి బయటకు పారద్రోలుము. దుఃఖభాజన మైన ఈ మార్గమును విడచి సుఖింపుము.'' అని తన యంతరాత్మ ఘోషించుచుండెను. బండి యింటిముంగిట నాగెను. బిలమునుండి వెల్వడి, పొదలోన ప్రవేశించు నాగసర్పమువలె నామె బండిలోనుండి యీవలకు వచ్చి గృహము జొచ్చెను.

## అధ్యాయము 18

సుమా రర్ధరాత్రి యైనది. ఇంకను హరిహరరాయలు ఇల్లు చేర లేదు. శాంతామోహనులట్లే ఆ యారామమునం దాతని రాకను కనిపెట్టుటకై విహరించుచుండిరి. తల్లియొద్ద సెలవుగైకొని నరేంద్రు డీవలకు వచ్చి చెల్లెలిని కౌగిలించుకొని, కృష్ణమోహన్ కు కృతజ్ఞతాభి వందన మొనర్చి, ద్వారము దాటి చెట్లగుములలో నదృశ్యుడయ్యెను.

అప్పటికే చాల విలంబమైనందున కృష్ణమోహన్ తిరిగి యింటిలోనికి బోనొల్లక శాంతను లోనికి వెళ్లుమని చెప్పి తాను గృహోన్ముఖుడై పోయెను.

ఆత డిల్లు చేరుసరికి స్వర్ణలత తనగదియందు మేజాప్రక్క కూర్చుండి తదేకధ్యానయై యేదో వ్రాయుచుండెను. గదిలోనికి బోయి యాత డామెను బలుకరించి, "స్వర్ణా! ఇంకను నిద్ర పోలేదా?" అని యడిగెను.

స్వర్ణ:— (ముఖమెత్తకుండనే) లేదు. ఇంకను నిద్ర వచ్చుటలేదు.
కృష్ణ:—నేను చాల యలసివచ్చితిని. నిద్ర ముంచుకొని వచ్చుచున్నది.
స్వర్ణ:— మీరు పోయి నిద్రింపుడు.

ఆమెవైఖరి యాతని కించుక వింతగోల్పెను.

"స్వర్ణా! నీవు నాపై నాగ్రహించిన ట్లున్నది! నే నేమి చేయుదును! తప్పని కార్యభారము ఆకస్మికముగ తలపై బడినది. నీతోగలసి విందునకు రాజాలకపోతిని. కన్నులు మూతబడుచున్నవి. రేపుదయము మాటాడుకొందము. అర్ధరాత్రి దాటిపోయినది. నీవు కూడ వచ్చి పండుకొనుము" అని ముంగురులు నిమురుచు బల్కెను.

ఆమె ప్రత్యుత్తర మీయలేదు. దించియున్న ముఖము మీది కెత్తలేదు. ఉదయమున సమాధానపరచెదనని యనుకొనుచు నాతడు తన గదిలోనికి బోయి విశ్రమించెను.

మరియొక గంట గడచిన పిమ్మట స్వర్ణలత లేచి, పెద్దదాసి మంజరి నిద్రించి యున్న గదికి బోయి యామెను మెల్లగ లేపెను. కన్నులు నులుపుకొనుచు మంజరి లేచి యామెను జూచి,

"ఏమమ్మా! ఇంతరాత్రివేళ నిటు వచ్చితిరి?" అని యడిగెను.

స్వర్ణ:— మంజరీ! నాకు నిద్ర పట్టుటలేదు. ఏవేవో వింత వింత భావములు నా హృదయమును కలవరపరచుచున్నవి. నాకొక భీతావహముకల్గి నీ యొద్దకు వచ్చితిని. నీవు నాకొక వాగ్దానము చేయవలెను. ఏ కారణము చేతనైన నాకేమైన సంభవించిన, నాపిల్లలకు తల్లిలేని కొఱత తీర్చెదనని వాగ్దానము జేయుము.

అని యామెచేయి బట్టుకొనెను. ఈ విపరీత వాగ్ధోరణియందలి యర్థము మంజరి కేమియు తెలియలేదు. కొంతసేపు ఆమె ముఖము వైపు తేరిచూచి,

"అమ్మా! అంత యవసర మిప్పు డేమి వచ్చినది? ఏమైన స్వప్నమైనదా తల్లీ?" అని ప్రశ్నించెను.

స్వర్ణ:— అగును. స్వప్నమే యనుకొనుము. నీ వాగ్దానము నా కిప్పుడు కావలెను.

మంజరి:— నీ పిల్లలను విడచి నే నెచ్చటికిని పోవనమ్మా! ఈ వాగ్దానమునకు దైవమే సాక్షి! నిర్విచారముగ నుండుము.

స్వర్ణ:— సంతోషము! ఇంక నిద్రింపుము.

అని నిశ్శబ్దముగ గదిలోనుండి వెడలిపోయెను. ఇది స్వప్నమా, నిజమా యని వితర్కించుకొనుచు మంజరి కొంతసే పట్లే కూర్చుండి, పిమ్మట నిద్రాగత యయ్యెను.

గృహాంతరణమంతయు నిశ్శబ్దమై యుండెను. ఉండుండి తోటలోని చెట్లకొమ్మలు మాత్ర మొక్కొక్క నిట్టూర్పు విడచుచుండెను. ఆకాశమునుండి నక్షత్రములు భూమిని జూచి వికటహాసము చేయుచున్నట్లుండెను. సువర్ణదుర్గముపై నొక చిన్న మబ్బుతునుక మాత్రము పొడగట్టి క్షణక్షణమును విస్తరించుచుండెను.

కొంతసేపటికి కృష్ణమోహన్‌కు మెలకువ వచ్చెను. భార్య చెంత లేదు. గడియారము చూచెను. మూడుగంటలు దాటెను. ఇంకను స్వర్ణ శయనాగారమునకు రాకుండుటకు కారణమేమని విహ్వలచిత్తుడై యాతడు లేచి యామె గదియొద్దకు బోయెను. గది తలుపులు తెఱచి యుండెను. లోపల చీకటిగా నుండెను. "స్వర్ణా!" అని పిలచెను. నిశ్శబ్దము! మరల మరల పిలచెను. ప్రత్యుత్తరము లేదు. దీపము వెలిగించి చూచెను. గదియందు స్వర్ణ లేదు. దీపము చేతబట్టి మీది గదులన్నియు చూచెను. ఎచ్చటను ఆమె జాడ లేదు. ఈ సందడికి తన యక్క మేల్కాని, "ఎవరు వారు?" అని తన గదిలో నుండి గర్జించెను.

"నే నక్కా! స్వర్ణ—నీ గదిలో పండుకొనినదా?" అని యాతడు ప్రశ్నించెను. ఆమె తలుపు తెఱచుకొని యీవలకు వచ్చి, "స్వర్ణ! నా గదికి రాలేదే! ఏమి?" అని యడిగెను.

కృష్ణ:- ఆమె యెచ్చటను కానవచ్చుటలేదు. నా గదిలోనికి రాలేదు.

అక్క:- అన్ని గదులును చూచితివా?

కృష్ణ:- చూచితిని. ఎచ్చటను లేదు.

అక్క:- ఏమైనది! పిల్లల గదిలో చూచితివా?

కృష్ణ:— చూచితిని.

అక్క:— మంజరి యించుక అస్వస్థయై యున్నది. ఆమె గదికిపోయిన దేమో చూతము రమ్ము.

అని యిరువురును మంజరి గదికిబోయి తలుపు తట్టిరి. ఆమె తలుపు తెఱచెను. గది యంతయు చీకటిగా నుండెను.

కృష్ణ:— మంజరీ! స్వర్ణ యిచ్చటకు వచ్చినదా?

మంజ:— (భయాశ్చర్యములతో) అమ్మగారా! వచ్చియుంటిరి బాబూ! చాల సేపైనది. వచ్చి నన్ను లేపినారు.

కృష్ణ:— లేపినదా? ఏల? ఏమి కావలసి వచ్చినది?

ఈ ప్రశ్న కామెనోట సమాధానము వెల్వడలేదు. ఒకానొక యభూత చైతన్య మామె నావహించెను! భూగర్భము పగిలి పాతాళ గహ్వరమునం దామె కూలబడుచున్నట్లయ్యెను! పరిపరి విధములైన యూహాతరంగములు పరంపరాగతములై యామె హృదయ సాగర మందు ఘూర్ణిల్ల సాగెను. భూతగ్రస్తురాలివలె నిర్విణ్ణయై ఱెప్ప వేయక ఆతని ముఖమువైపు జూచుచుండెను.

కృష్ణ:— మంజరీ! అట్లు చూచెదవేమి?

మంజ:— (గద్గదస్వరముతో) బాబూ! బాబూ! సర్వనాశనమైనది! సర్వనాశన మైనది! అంతయు నా కిప్పుడు తెలియుచున్నది.

అని బొట బొట కన్నీరు గార్చుచు నిలువబడెను. సహజమైన మానసిక ధైర్యమును చిక్కబట్టుకొని కృష్ణమోహన్ "మంజరీ! ఏమి సంభవించినది?" అని ప్రశ్నించెను.

మంజ:— బాబూ! నేను పరమ నిర్భాగ్యురాలను! మూఢురాలను!
ఆమె మాటల యందలి భావమును నేను గుర్తింపజాలకుంటిని.

కృష్ణ:— ఏమన్నది?

మంజరి:— వెల్లబారిన ముఖముతో, ఎఱ్ఱబారిన కండ్లతో, ఆమె నాయెదుట నిలచి, 'మంజరీ! నాకేమైన సంభవించినచో, నా పిల్లలకు తల్లిలేని కొఱత దీర్చెదనని వాగ్దానము చేయుము. ఎన్నటికిని పిల్లలను విడచిపోవనని వాగ్దానము చేయుము,' అని నా చేయి బట్టుకొనెను. ఆ మాటల యర్థము నాకిప్పుడు తెలిసినది! బాబూ! మనము దురదృష్ట వంతులము! ఆమె మనలను విడచిపోయినది. ఇంక నామెను మనము చూడ జాలము. (అని భోరున నేడ్వసాగెను.)

కృష్ణమోహన్ పొంగి పొరలి వచ్చుచున్న మహాదుఃఖము నాపుకొనుచు, గద్గదికతో, "కారణమేమైన చెప్పినదా?" అని బాష్పాకులనేత్రుడై ప్రశ్నించెను.

మంజ:— లేదు. కాని, నాకు తెలియును. ఈమెయే, ఈమెయే, యీమె యంత్య నిశ్చయమునకు కారణము.

అని యక్కగారిని జూపెను.

"నే నేమి చేసితిని?" అని యీమె కండ్లెఱ్ఱజేసెను.

మంజరి:— ఆ మేకపిల్లపై మీరు పులివలె పడని దినము కలదా? ఆమె హృదయమునందు మీరు చిచ్చునెట్టితిరి. ఈ పర్యవసానమునకు కారకులు మీరు!

ఈ నిందావాక్యముల కామె యేమి చెప్పుటకును దోచక నివ్వెరపోయి చూచుచుండెను.

"అక్కా! భగవంతుడు నిన్ను క్షమించుగాక!" అని కృష్ణమోహన్ నడివడిగా స్వర్ణలత గదిలోనికి బోయెను. గది యంతయు నెప్పటి వలెనే యుండెను. ఆమె యాత్మహత్య చేసికొని యుండునను భావమే యాతని హృదయమున జనింపలేదు. దీపము చేతబట్టి గది యంతయు చూచుచుండెను. దీపపు కాంతియందు ఆమె మేజాపై

నొక పత్రము కానవచ్చెను. కంపించుచున్న చేతులతో నాత డా పత్రమును విప్పి చూచెను. అది స్పష్టముగ నామె చేవ్రాలు. అం దిట్లు వ్రాయబడి యుండెను.

మోహన్,

ముందు ముందు ఎప్పుడైన నా పిల్లలు, 'మా తల్లి యెచ్చట నున్నది?' అని మిమ్ము డిగినచో, వారి తండ్రిచే నామె గృహమునుండి వెడలింపబడినదని చెప్పుడు. ఎట్లు మీరు నన్ను వెడలించితిరో ఆ విషయము కూడ మీ రిచ్చగించినచో, వారితో చెప్పుడు. 'ఆమెకు ద్రోహము చేసితిని! ఆమెను వంచించితిని! ఆమె ప్రేమ హృదయము నందు చిచ్చు వెట్టితిని, మిమ్ము మాతృవిహీనులను జేసితిని.' అని వారితో చెప్పుడు. సెలవు.

ఇట్లు
స్వర్ణ

ఈ లేఖ నాతడు మూడుసార్లు చదివెను. అందలి యంశము లాతని కేమియు నర్థము కాలేదు. తా నామెను గృహమునుండి వెడలించెనా? తా నామెకు ద్రోహము చేసెనా? ఆమెను వంచించెనా? ఆమె ప్రేమ హృదయమునందు తాను చిచ్చు వెట్టెనా? అంతయు నాతని కయోమయమై యుండెను. ఈ లేఖాంశములను బట్టి తన యక్కగారిపై మంజరి చేసిన నిందారోపణము నిష్కారణ మని ఋజువగుచున్నది. తానే దానికి కారణమని నిరూపింపబడు చున్నది. అది ఎట్లో ఆతని నిష్కళంక హృదయమునకు తోచ కుండెను. ఆ లేఖను మరల మరల చదివెను. ఆతని యోచనాశక్తి స్తంభించిపోయెను.

ఆ లేఖను చేతబట్టి, అప్రయత్నముగ కన్నులనుండి స్రవించు చున్న బాష్పములనైన నొత్తుకొనక, పిచ్చియెత్తినవానివలె తిరుగ సాగెను. ఆత డొక విచిత్ర స్వప్నమునందు లీనమై యుండెను. గృహమంతయు నల్లకల్లోలముగా నుండెను. పరిజనమంతయు కలవర పడుచుండిరి. ఇంతలో, "రమాపతి యేడీ? రమాపతి కానవచ్చుట లేదు! ఆతని గది శూన్యమై యున్నది!!" అను కేకలు వినవచ్చెను.

కృష్ణమోహన్‌కు స్వప్నభంగ మయ్యెను. ఆతని కన్నుల యెదుట నొక యవనికపై స్వర్ణలతా సహితముగ రమాపతి భవిష్యదంధకార మునం దదృశ్యుడై పోవుచున్న భావచిత్రము విస్పష్టముగ గోచరించెను.

"కృష్ణమోహన్ ! కన్నీరుచూచి నీ హృదయము కరగి పోయినది! అధఃపతితులకు నీ విశాలహృదయమునందు స్థానమిచ్చితివి! ప్రేమసౌధమునందలి తుదిమెట్టు మెట్టితివి ! ఈ మాయాప్రపంచపు రీతి గుర్తింపజాలకుంటివి ! అనుభవింపుము. అనుభవింపుము." అని తన హృదయాంతరాళమునుండి యొకానొక యార్త నాదము విస్పష్టముగ నాతనికి వినవచ్చుచుండెను.

కొంతసేపు అట్టి శూన్యదృష్టితో నాతడు నిలచి, పిమ్మట మెల్లగ తన గదిలోనికిబోయి తలుపు బిగించుకొనెను. తూర్పు తెల్ల వారుచుండెను. కాని సువర్ణదుర్గము నావరించిన యంధకారచ్ఛాయ మరింత గాఢము కాజొచ్చెను.

## అధ్యాయము 19

ఆ నాడు మొదలు పెక్కు రాత్రులవఱకు కృష్ణమోహన్‌కు కంటికి కూర్కు లేదు. ఆహారపానములందు శ్రద్ధ లేదు. కార్యకలాపములందు చలనము లేదు. "ప్రపంచమున ప్రేమకు స్థానము లేదా ? మాధుర్యమునకు తావు లేదా? లోకమంతయు మాయామయ మేనా ?" అను సమస్యలతో నాతని నిష్కల్మష మానసము నిబిడీకృతమై ఘూర్ణిల్లుచుండెను. ఆతని మహోదార హృదయమునందు స్వర్ణలతపట్ల ఆగ్రహోద్రేకము, అసహ్యత, ద్వేషభావమునకు మాఱు, అధఃపతితయైనందుకు, మాయాజాలనిబద్ధ యైనందుకు, జాలియు దుఃఖమును ఉప్పొంగుచుండెను. తొల్లి యామె దీనావస్థ నవలోకించి యే యుదార హృదయముతో నాత డామెను భార్యగా పరిగ్రహించెనో, ఆ యుదారహృదయముతోడనే యిప్పు డామె యధోగతి కాతడు జాలిపడుచుండెను. తన ప్రేమహృదయముపై పదాఘాతముచేసి యిప్పు డామె పోయినది. ఇంక నాతని హృదయముపై నామె కెట్టి యధికారమును లేదు. ఆ నారీభూతమును

పూర్తిగ విస్మరించి పునర్వివాహము చేసికొనినచో ఆతని కెట్టి యాక్షేపణయు నుండదు. కాని ఆత డందు కంగీకరించలేదు. ఆమె కొకసారి యర్పించివైచిన తన హృదయమును ఆమె జీవించి యుండు నంతవఱకు అన్యస్త్రీ కర్పింప నొల్లకుండెను.

సువర్ణదుర్గమును పరిత్యజించి పోయిన పిమ్మట కొంతకాలము వఱకు స్వర్ణలత వృత్తాంత మేమియు దెలియలేదు. క్రమక్రమముగ నేవేవో యస్పష్టవార్తలు వచ్చుచుండెను. కొంతకాలము రమాపతితో నానాదేశములందును స్వైరవిహారము చేసె ననియు, కాలక్రమమున నొక బిడ్డనుకూడ కాంచె ననియు, పిదప నిష్కారణముగ నా మాయావిచే పరిత్యజింపబడి, నిస్సహాయయై, బిడ్డ మరణింపగా ఏకాకియై, నిరుపేదయై యెచ్చటనో భూతలనరకము ననుభవించుచున్నదనియు ఏవేవో వార్తలు వచ్చుచుండెను. ఆ దుఃఖవార్తలను విని యాత డెంత దుఃఖించెనో దైవమునకే తెలియును. కాని ఆమెను తిరిగి తన గృహమునకు దోడ్కొనివచ్చు నుద్దేశము మాత్ర మాతనికి లవలేశమైన లేదు.

ఇట్లు కొంతకాలము గడిచిపోయెను. యథాప్రకారముగ కృష్ణమోహన్ దైనందిన వ్యవహారములు సాగిపోవుచుండెను. ఒకనాడు ప్రాతఃకాలమున గుమాస్తా విశ్వాసరాయలు వివర్ణవదనుడై కన్నీటితో ఆనాటి వార్తాపత్రికను కృష్ణమోహన్ కందిచ్చుచు,

"కీర్తిశేషులైన జమీందార్ సంజీవరాయల యేకైక సంతానమైన స్వర్ణలతాదేవి మొన్న ఆదివారమునాడు శ్రీనగర సమీపమునందు సంభవించిన రైలుప్రమాదమునందు గాయపడి మరణించెను."

అని యా పత్రికయం దొక చివరనున్న వార్తను ఆతనికి జూపెను. ఆవార్త కంటబడగనే పత్రికను చేతినుండి జారవిడచి యాతడు కుర్చీపై చేరబడెను. ధారాపాతముగ కన్నులనుండి బాష్పవర్షము కురియసాగెను. శూన్యదృష్టితో సుమా రొక గంటవఱ కత డట్లే కూర్చుండి యుండెను. కార్యార్థులై తన్ను జూడవచ్చిన వా రనేకులు వీధిచావడియందు వేచుకొని యుండిరి. గుమస్తా విశ్వాసరాయలు వారిని లోనికి విడువలేదు. "ఆనంద

కండమైన సంసారమును పరిత్యజించినది. పవిత్రములైన యనురాగ బంధములను త్రెంచుకొనినది. తాత్కాలికోద్రేకమున వివేక శూన్యమై మాయాజాలమునందు చిక్కువడినది. సర్వనాశనమైనది. ఆ యమాయిక బాలిక నిర్మలాత్మకు శాంతి చేకూరుగాక!" అని సర్వేశ్వరుని ప్రార్థించి, అంతటితో ఆ విషాదగాథకు స్వస్తిచెప్పి, తిరిగి కృష్ణమోహన్ ఈ చేతనా ప్రపంచమున ప్రవేశించెను. యథా ప్రకారము కార్యకలాపమునందు నిమగ్నుడయ్యెను. ఆ మరునాడు దేవేంద్రరాయల యొద్దనుండి యొక జాబు వచ్చెను. పత్రికా ప్రచురితమైన స్వర్ణలతామరణవార్తనే తెలుపుచు, ఆత డా లేఖతో, మరణ సమయమున స్వర్ణలత స్వహస్తములతో తనకు వ్రాసి పంపిన యొక పత్రమును గూడ పంపెను. ఆ పత్రమునం దిట్లు వ్రాయబడి యుండెను—

"మహాపరాధము చేసినతిని. దైవము నాకు తగిన శిక్షయే విధించెను. నా యపరాధమును క్షమింపు డని కొనయూపిరితో నా ప్రియభర్తను నా బిడ్డలను ప్రార్థించుచుంటినని చెప్పుడు."

ఇట్లు

స్వర్ణ.

ఈ పత్రమును జూచుకొని కృష్ణమోహన్ ఆ దినమంతయు కచేరి గృహమునకే పోవక మౌనము వహించి తన గదియందే యుండెను. ఏ మాలోచించుచుండెనో భగవంతునకే యెఱుక.

సూర్యాస్తమయము వఱకు నిర్మలముగా తేజోవంతముగా నుండిన యాకాశమంతయు అస్తమయానంతరము గాఢ మేఘాచ్ఛన్న మయ్యెను. ఉఱుములతో మెరపులతో గొప్ప వర్షము ప్రారంభమై నిరంతరాయముగ కురియసాగెను. రాత్రి సుమారు పదిగంటలు కావచ్చెను. కృష్ణమోహన్ తన గదియందు ఏకాకియై దీపము నెదుట గూర్చుండి యేదో పత్రమును చదువుకొనుచుండెను. ఆతని చెంతనే కొంతసేపు కూర్చుండి యిష్టాగోష్ఠియం దుండిన యాతని యక్కగారు తన శయనాగారమునకు బోయెను. వర్షము కొంచెము శాంతించిన ట్లుండెను. గవాక్షము తెరచి కృష్ణమోహన్ ఒక్కసారి

బయటకు జూచెను. గవాక్షము తెఱువబడగనే ఆ యంధకారము నుండి "మోహన్! నన్ను లోనికి రానిమ్ము. చలిబాధచే చచ్చి పోవుచున్నాను." అను దీనాలాపములు చెవినిబడెను. ఆ యర్ధ రాత్రివేళ ఆ జడివానలో నీదులాడుచు ఆశ్రయ భిక్ష మర్థించుచున్న యీ దీనవ్యక్తి యెవరు? అప్రయత్నముగ కృష్ణమోహన్ శరీర మా పాద మస్తకమును పులకాంకరితమయ్యెను. కాని ఆ కంఠ స్వరము మాత్ర మాతనికి పరిచితమైనట్లే యుండెను.

"ఎవరు నీవు?" అని యాతఁడు ప్రశ్నించెను.

"నేను నరేంద్రుడను" అని యావ్యక్తి బదులు పల్కెను.

అంత కృష్ణమోహన్ మహాశ్చర్య చకితుడై గభాలున తలుపు తెఱచి, వానిని లోనికిజేర్చి, తిరిగి తలుపుబిగించి, "నరేంద్రా! ఎంతప్రమాదకరము! ఘంతసేపై వచ్చితివి?" అని ప్రశ్నించెను. చలిచే గజగజ వణకుచు, "చెప్పెదను. చలి! చలి! ఏదైన ఒక పొడి వాతి నాకిమ్ము" అనుచు నేల గూర్చుండెను. పిమ్మట కృష్ణమోహన్ వాని తడిగుడ్డలను విప్పించి, పొడివస్త్రములను కట్టించి, కొంతసేద దీర్చెను. అటుపై వారిర్వురు నిట్లు సంభాషించుకొనిరి.

కృష్ణ:– నరేంద్రా! ఎచ్చటినుండి వచ్చుచున్నావు? ఎంతసేపై వచ్చితివి?

నరేం:–చాలసేపై వచ్చి యీ కిటికీప్రక్క వర్షములో నిలచియుంటిని. నీచెంతి మీ యక్కగా రుండుట కనిపెట్టి నిన్ను పిలువలేదు. సరాసరి కలకత్తానుండి వచ్చుచున్నాను. రక్షకభటులు నన్ను వెంటాడుచున్నారు. ఆ గౌరి రక్షకభటులను నాపై ఉసి గొల్పినాడు.

కృష్ణ:– ఎట్లు?

నరేం:– పదిదినముల క్రిందట నేనును గౌరియు హఠాత్తుగ నెదురు పడితిమి. నన్ను చూచినంతనే గౌరి చకితుడై వివర్ణుడగుట నేను గుర్తించితిని.

కృష్ణ:– నిన్నాతడెట్లు గుర్తించెను?

నరేం:- అప్పుడు నేను మారువేషము ధరించియుండలేదు. తరువాత మరియొకసారి మేము తారసిల్లితిమి. అప్పుడు వానితో మరియొక దుర్మార్గుడుకూడ నుండెను. ఈసారి తీక్షణముగా గౌరి నావైపుజూచి, "నీ వెవ్వడవో నాకు దెలియును. బ్రతుకు తెరువు వాశించెదవేని, నా కంటబడకుము" అని కంట్లెత్తి జేసి తనదారిని పోయెను. తిరిగి, మొన్న చీకటిపడు వేళ మేము మరల తారసిల్లితిమి. అంత, వా డొక రక్షకభటుని పిలచి నావైపు జూపుచు నేమేమో చెప్పెను. తక్షణమే, అపాయమును శంకించి, నేను తప్పుకొని జనసమ్మర్దమునందు కలసిపోయి నివాసమును చేరుకొని, మారువేషము ధరించుకొని కలకత్తా విడచి సరాసరి కాలినడక నిటువచ్చితిని. చేత నొక్క కానైనను లేదు. ఇంక నేను కలకత్తాలోనుండక వేరొక చోటికి పోవలెను.

కృష్ణ:- సరియే. ఆ గౌరి కలకత్తాయందు నివసించుచున్న గృహమును నీవు కనిపెట్టజాలక పోతివా?

నరేం:- ప్రయత్నించితిని. కాని, అసాధ్యమైనది.

కృష్ణ:- కలకత్తాయందు వా డే పేరుతో వ్యవహరించు చున్నాడో యేమైన తెలుసుకొనలేదా?

నరేం:- ఎట్లు తెలుసుకొనగలను?

కృష్ణ:- ఇంమక ప్రయత్నించినచో తెలుసుకొని యుందువు. వానితో కలసి తిరుగుచున్న వ్యక్తి —

నరేం:- ఆ వ్యక్తియా? వీనిని మించిన విషకీటకము వాడు. వారిద్దరకును అత్యంత సన్నిహితమైన మైత్రి కలదు.

కృష్ణ:- వాని పేరు తెలియునా?

నరేం:- వాని పేరు రమాపతి.

కృష్ణ:- (త్రుళ్ళిపడి) రమాపతియా?

నరేం:- అగును.

కృష్ణ:- నీకు బాగుగా తెలియునా?

నరేం:- ఏమియు సందేహము లేదు. రమాపతిని నే నెఱుగనా?

కృష్ణమోహన్ మనస్సారసమందు సహస్రభావతరంగములు లేచి పడజొచ్చెను. ఒక్కింతసేపు నిశ్శబ్దముగ నాతడు కన్నులు మూసికొనెను. ఇంతలో గది తలుపు తీవ్రముగా తట్టబడెను. నరేంద్రునకు మీదిప్రాణములు మీదికే పోజొచ్చెను. శరీరము ముచ్చెమటలు పోసెను. కృష్ణమోహన్ ఆతని భుజముపై దట్టి, "భయపడవలదు. ఇచ్చట నీ కెట్టి భయమునులేదు. మా అక్క తలుపుదట్టుచున్నది. ఈ ప్రక్క గదిలోనికి నీవు పొమ్ము." అని వానిని పంపి, తాను మెల్లగ తలుపు తెఱచి బయటకు వచ్చి, "అక్కా! ఏమి కావలెను?" అని యడిగెను.

"నీ గదిలో మాటలు వినవచ్చినవి. ఎవ్వరితో ఈ యర్ధరాత్రి వేళ ఆరహస్య సంభాషణము" అని ముఖము బిగించుకొని యామె లోనికి పోసాగెను.

కృష్ణ:- అక్కా! ఎవ్వరో తెలిసినచో నీవు సంతసింపజాలవు. కుక్కలచే వెంటాడబడుచున్న యొక లేడి! నిర్భాగ్యజీవి! గ్రహించితివా?

ఆమె కేమియు నర్థముకాలేదు. అట్టె యాతని ముఖమువైపు జూచుచు నిలువబడెను.

కృష్ణ:- అక్కా! నరేంద్రుడు! ఈ జడివానలో, ఈ చిమ్మచీకటిలో, తలదాచుకొనుటకీ విశాలప్రపంచమున వీని కెచ్చటను తావు లేదు.

ఆమె నోట మారుమాట రాలేదు. తలుపు తెఱచుకొని యాతనితో లోన ప్రవేశించెను. తలుపు తిరిగి వేయబడెను. ప్రక్క గదిలోనికి బోయి కృష్ణమోహన్ నరేంద్రుని దోడ్కొనివచ్చి యామె యెదుట నిలిపెను. నిశ్చేష్టయై యామె వానివైపు కొంతవడి నిదానించి,

"నరేంద్రా! ఇచ్చటి కిప్పు డేల వచ్చితివి? ఎంత ప్రమాదము! నీ కేమి పిచ్చియెత్తినదా?" యని ప్రశ్నించెను.

"ఇంచుక ధనసహాయము కోరి వచ్చితిని. నా పరిస్థితియంతయు మోహన్ కు తెలియును. ఇప్పుడే నేను పోయెదను."

"ఎచ్చటికి పోయెదవు ?"

అంత కృష్ణమోహన్, "అక్కా ! ఈ జడివానలో, ఈ యర్థ రాత్రివేళ వీ డెచ్చటికి పోవును ? మనయింటనే వీనిని గుప్తముగ నుంచవలయును. అక్కా ! వీనిని దాచియుంచు భారము నీదే," అని ఆమెకు వాని నొప్పగించెను. ఆమె యించుక యోచించి, "సరే వీనిని నా గదికి తగిలియున్న పంచలో పరుండబెట్టెదనులెమ్ము. దాని లోనికిబోవుటకు నా గదిలోనుండి తప్ప వేఱుమార్గములేదు. కావున, వాని యునికి నెవ్వరును గుర్తింపలేరు. ఉదయమైన పిమ్మట చూచు కొందము. చాల రాత్రియైనది. నీవింక పరుండుము," అని యామె వానిని వెంటబెట్టుకొని మేడమెట్లెక్కి తనగదిలోనుండి పోయి యా చిన్న పంచలో వానిని పరుండజేసి, తలుపు బిగించి తాను విశ్రమించెను. ఆరాత్రి, పాపము, నరేంద్రునకు కన్నులు మూతబడలేదు. కన్నుమూసినచో గౌరియు ఆ రక్షకభటుడును వాని యంతర్నేత్రమునకు గోచరించుచుండెను. కృష్ణమోహన్ సహితము పరిపరి విధముల యాలోచనములతో నా యవశిష్ట రాత్రి యంతయు గడపెను.

తెల్లవారగనే ఆతడు నరేంద్రు డున్న గదిలోనికి బోయి, వానికి ధైర్యము గొల్పుచు నచ్చటనే వానితో చాలసేపు సంభాషించుచు గూర్చుండెను. ఆతని యక్కగారు గృహపరిచారకుల కంట నరేంద్రుడు పడకుండ వాని యవసరము లన్నియు తానే స్వయముగ నిర్వర్తించు చుండెను. ఇంతలో, "కృష్ణమోహన్" అను గంభీరమైన పిలుపు మేఘగర్జన వలె క్రిందినుండి వినవచ్చెను. ఆ పిలచునది నరేంద్రుని తండ్రి హరిహరరాయలు. ఆ కంఠధ్వని వినవచ్చినంతనే నరేంద్రు డులికిపడి గజగజ వణక నారంభించెను. కృష్ణమోహన్ సహిత మించుక చలించెను. కాని, ఉత్తరక్షణమే స్థిమితుడై నరేంద్రునితో, "ఏమియును భయపడకుము. ఇచ్చటనే యుండుము. నేను పోయి మీ తండ్రిని సాగనంపి వచ్చెదను," అని పల్కి వడివడిగా మేడమెట్లు దిగి హరిహరరాయల కెదురేగి మందహాసముతో పలుకరించి తన గదిలోనికి దోడ్కొనిపోయి కూర్చుండజేసి సంభాషణమున కుపక్రమించెను.

కృష్ణ:— ఇంత వేకువనే మీ రిచ్చటకు వచ్చుటకు ఏదో విపరీత కారణమే యుండవలెను. మీ ముఖమునందు అశాంతి కూడ కానబడుచున్నది! విశేషమేమి?

హరి:— ఈ జాబు చూడుము.

అని జేబులోనుండి యొక పత్రమును దీసి యాతని కిచ్చెను. కృష్ణమోహన్ ఆ జాబు నత్యాత్రముతో జదివెను. లేఖకుని సంతకము లేదు. 'ఒక స్నేహితుడు' అనిమాత్రము వ్రాయబడియున్నది. హరిహరరాయల నుద్దేశించి యున్నది. హంతకుడైన తన కుమారుడు నరేంద్రుడు కల్యాణపురమునకు వచ్చుచున్నా డనియు, తాను ప్రమాదము తప్పించుకొనుటకు ఆ యూరినుండి వెడలిపోవుట యుక్తమనియు వ్రాయబడియున్నది. జాబును కడముట్ట జదివి కృష్ణమోహన్ "ఆర్యా! ఈ దొంగ జాబునకేనా యింత కలవరపడుచున్నారు? ఇది నాకే వచ్చినచో దీనికి తక్షణము అగ్నిసంస్కారము చేసి యుందును."

హరి:— (జేవురించిన మొగముతో) దీనిని వ్రాసిన దెవ్వరు? ఆ ద్రోహి, హంతకుడు, తిరిగి యీ గ్రామమునకు వచ్చుచున్నాడా?

కృష్ణ:— అయ్యా! ఎంత పిచ్చివాడైనను ఆ మాట విశ్వసించునా?

హరి:— (వినిపించుకొనకయే) వాడీ గ్రామమునకు వచ్చి నా కంటబడి తిరిగి ప్రాణములతో పోగలడా?

కృష్ణ:— మీ రూరకే కలవరపడుచున్నారు. మీ ప్రకృతి వానికి దెలియదా? కోరి కోరి మృత్యుముఖమున జొరబడుట కెవ్వ రిచ్చగించును? ఈ లేఖ కేవలము మిమ్ము రేకెత్తించుటకు సృష్టింపబడిన యొక దొంగజాబు. పుత్రునకే పరమశత్రువై యున్న మిమ్ము రెచ్చగొట్టి యానందించుటకు వాడెవ్వడో యిది వ్రాసినాడు. తీసికొనిపోయి నిప్పులో పారవేయుడు.

హరి:— ఏమైనను సరే, వాని రాకను వేయి కన్నులతో కనిపెట్టుచుండుడని రక్షకదళాధికారి కిప్పుడే చెప్పెదను.

కృష్ణ:— ఆపనిమాత్రము చేయకుడు. ఏమైనను వాడు మీకు పుత్రుడు కాడా? పుత్రునిబట్టి మృత్యుముఖమున వైచు తండ్రిని జూచి

యెవ్వరైన హార్థింతురా? నేను కఠినముగ బల్కుచున్నానని అన్యథా తలంపకుడు. వాడు దోషియని మీ న్యాయస్థానము నిర్ధారణ చేసినది. నిర్దోషులైన అమాయకులను ఎందఱను మీ న్యాయస్థానములు శిక్షించుచున్నవో న్యాయవాదులమైన మాకు తెలియును. రేపు అవకాశము లభించినచో వాని నిర్దోషిత్వమే ఋజువుకాఁగలదేమో. తండ్రియైన మీరు వాని కామాత్ర మవకాశము నీయరా?

ఈ పల్కులు హరిహరరాయల వేడిమి నించుక మాత్రము తగ్గింపగల్గినవేమో! ఆతడు మాఱుమాటాడక, ఆజాబును తిరిగి మడచి జేబులో నుంచుకొని, "అయిన, ఈవ్రాత యెవ్వనిదైయుండునో నీ వ్రూహింపలేవా?" అని యడిగెను.

"అసాధ్యము. ఆ తుంటరి యెవ్వడైన నేమి? దానిని బుగ్గిచేసి దానిమాటయే మఱచిపొండు." అని కృష్ణమోహన్ బదులు చెప్పెను. అంత హరిహరరాయలు మాఱుపలుకక యేదో గొణుగుకొనుచు లేచి వెడలిపోయెను.

ఆతని నంపకము పెట్టి కృష్ణమోహన్ తిరిగి నరేంద్రునియొద్దకు వచ్చెను. కుక్కినపేనువలె కూలబడియున్న నరేంద్రు డాతని జూచి, "ఏమి విశేషము?" అని ప్రశ్నించెను. జరిగిన దంతయు వివరింపగా నరేంద్రుడు, "ఆ జాబు నిస్సందేహముగా గౌరి వ్రాసినదే. నన్ను వాడు పనిపట్టియే యున్నాడు" అని వెలవెల పోసాగెను. కృష్ణ మోహన్ వానికి ధైర్యము గొల్పి,

"నీ విచ్చటనే యుండుము. ఈసారి మీ యమ్మను చూచు తలంపు కట్టిపెట్టుము. నేను సావకాశముగ పోయి శాంత నిచ్చటకు దోడ్కొని వచ్చెదను." అని పల్కి వానిని తన యక్కరక్షణమందు విడచి, మేడదిగి తన గదికి పోయెను. పిమ్మట భోజనానంతరము ఆతడు హరిహరరాయల గృహమునకు బోయెను. హరిహరరాయ లింట లేకుండెను. యథాప్రకారముగ శాంతా కుముద్వతుల మన్నన లంది, తన యక్కగారించుక యస్వస్థయై యున్నదనియు, శాంతను చూడగోరుచున్నదనియు చెప్పి, కుముద్వతీదేవి యనుమతి బడసి

శాంతను దోడ్కొని నిజగృహమునకు మరలి వచ్చెను. అచ్చట నిర్బంధింపబడి యున్న సోదరుని జూచి శాంత ఆశ్చర్యచకితయై కించి త్కాలము నోట మాటరాక ఉద్వేగ జన్యములైన బాష్ప బిందు వులతో పలుకరించుచు సోదరుని కౌగిలించుకొనెను. పిమ్మట కృష్ణమోహన్ వారిరువురను అన్యోన్య సంభాషణములకు విడచి, తాను కార్యాంతరముపై వెడలిపోయెను.

కలకత్తాయందు గౌరియు తానును ఎట్లు ముష్కరుల మూఖా ముఖి తటస్థమైరో, యెట్లు వాడు తన్ను బెదరించెనో, యెట్లు తా నచ్చటనుండి పలాయితుడై వచ్చెనో, యావిశేషము లన్నియు నరేంద్రుడు శాంతతో వివరించెను. పిమ్మట తల్లి యారోగ్య స్థితియు, తండ్రి మనోవైఖరియు, మొదలగు అనేక గృహ విషయములను గూర్చి వారు ముచ్చటించుకొనిరి. అన్యోన్య ప్రేమ భాషణములతో బాష్పజల సేచనములతో, వారు సూర్యాస్తమయము వఱకును, గడిపిరి. అంత, కార్యకలాపములను ముగించుకొని కృష్ణమోహన్ తిరిగి వచ్చి, వారిని కలసెను. ఆ దినమంతయు ఆ గృహ కలాప మంతయు, భోజన పానాదికములతో సహా, ఆ చీకటి గదియందే గడచిపోయెను. ఒక్క మంజరికి తప్ప తదితర దాసదాసీగణమున కా రహస్య సమావేశ మేమియు తెలియదు. విశ్వాస పాత్రమైన మంజరికి మాత్రము స్వయముగ కృష్ణమోహన్ నరేంద్రుని రాక దెలిపి వానియందామెకు సానుభూతి జనింపజేసెను.

ఆ దిన మంతయు ఆకసము మేఘాక్రాంతమై యుండెను. రాత్రియైనంతనే గాఢాంధకారము నలుదిక్కులను గ్రమ్ముకొనెను. నరేంద్రునిచే మరల తన వేషమును ధరింపజేసి, రహస్యముగ మేడ నుండి దింపి, యాతనికి కావలసిన ధనమిచ్చి, తానెచ్చట నుండు నదియు నేదో విధముగ తనకు తెలుపుచుండవలసిన దని చెప్పి, కృష్ణమోహన్ వానిని తోటగుమ్మము వరకును వీడ్కొల్పి, ఆ యంధకార జగతి కప్పగించి వచ్చెను.

పిమ్మట, దుఃఖాతిరేకముచే వగర్చుచున్న శాంత నోదార్చి, యామెను స్వయముగ వారియింట దిగబెట్టి వచ్చుటకు ఆమెతో

గుఱ్ఱపు బగ్గిపై బయలుదేరెను. ఆమెతో కలసి పోవుచున్నంత కాల మును వారిరువురి యంతరంగములందును ఏ యే భావములు ప్రక్ర మించు చుండెనో వారికే యెఱుక. ఎట్టి సంభాషణమును లేదు. బండి హరిహరరాయల ఆరామద్వారముకడ నాగెను. ఇరువురును బండిదిగి లోనికేగిరి. హరిహరరాయ లింకను ఇంటికి రాలేదు. కుముద్వతీదేవి విశ్రమించి యుండెను. ఆమెవిశ్రాంతికి భంగము చేయ నొల్లక వారిరువురును గవాక్షమున కెదురుగ చావడిలో సోఫాపై కూర్చుండిరి. అంతయు, నిశ్శబ్దముగ నుండెను. సుమారు పది నిము షములైన పిమ్మట, ఆ నిశ్శబ్ద వాతావరణమును భేదించుచు కృష్ణ మోహన్ శాంతివైపు జూచి "శాంతా! నీవు నన్నింకను ప్రేమించు చుంటివా ?" అని ప్రశ్నించెను.

శాంత:— (దీర్ఘ నిశ్వాసముతో) మోహన్ ! ప్రేమించుటకు నాకేమి యధికారము కలదు ? ఆనాటి సంధ్యాకాలమునందు నా ప్రణ యాగ్నిపై చన్నీరు జల్లి నీవు కావించిన యుపదేశమును మరచిపోతివా ?

కృష్ణ:— అగును. అదియంతయు నాకు జ్ఞప్తియున్నది. కాని, శాంతా! ఆ నాటి పరిస్థితి యిప్పుడు లేదు. విపన్నమైన యొకానొక నిర్భాగ్య బాలిక నుద్ధరించుటకై అప్పుడు నేను నా హృద యాంతర్గత ప్రేమను బలిదానము చేసితిని. ఆమె నుద్ధరించి తిని. ఆపై నా హృదయ సర్వస్వము నామె కర్పించితిని. విధి ప్రోక్తముగ నన్నామె విసర్జించినది. అయినను, ఆమె జీవించి యుండునంతవఱకు నా హృదయమును అన్యాక్రాంతము జేయుటకు నే నంగీకరించలేదు. ఇప్పు డామె మరణించినది. నా హృదయమునకు తిరిగి స్వేచ్ఛ లభించినది. ఒకప్పుడు బలిదానము చేయబడిన ప్రేమ తిరిగి యిప్పుడు నా హృదయ గోళమును విద్యోతమొనర్చుచున్నది. సంపూర్ణ హృదయ ముతో నేను నిన్ను ప్రేమించుచున్నాను. శాంతా! నీవు నన్ను పరిగ్రహింతువా ?

శాంత:— (బొట బొట కన్నీరు గార్చుచు) మోహన్ ! నీవు సత్యము పల్కుచుంటివా ? నన్ను నిశ్చయముగ ప్రేమించుచున్నావా ?

కృష్ణ:- శాంతా! నా హృదయమున కీశ్వరుడు సాక్షి!

శాంత:- మోహన్! నా జన్మము ధన్యమైనది! నీ వాక్రమించిన ఈ హృదయ సింహాసనముపై యింకొకనికి స్థానములేదు. ఈ పదిసంవత్సరములును నేను అవివాహితనై యుండుటకు కారణము అదియే! ఇప్పటికి ఈశ్వరానుగ్రహము కల్గినది. నేను ధన్యనైతిని!" (అని ఆనందబాష్ప కన్నీరు గార్చెను.)

అంత కృష్ణమోహన్ పవిత్ర ప్రేమహృదయముతో నామెను కౌగలించుకొనెను. చావడిలోని గడియారము పదిగంటలు కొట్టెను. ఆ సుముహూర్తమున వారిరువురకును ఆంతరంగిక వివాహము జరిగిపోయినది.

ఇంతలో కుముద్వతీదేవి మేల్కొనెను. సక్రమముగ నామెతో కృష్ణమోహన్ ఈ యన్యోన్య వివాహ నిశ్చయమును తెలియజేసెను. ఆమె యానందమునకు పారములేదు. మరియొక పావుగంటలోనే హరిహరరాయ లిల్లుచేరెను. కృష్ణమోహన్ తన యల్లుడు కానున్న విషయము తెలిసి యాతా డానందభరితుడయ్యెను. సర్వకాల సర్వావస్థలందును ఘుమఘుమలాడుచుండు నాతని ముఖమున ఆనందమును ఉత్సాహమును గిపించుట కదియే తొలిసారియై యుండును.

## అ ధ్యా య ము 20

శాంతాకృష్ణమోహనుల వివాహ మత్యంత వైభవముగ జరిగిపోయెను. స్వర్ణలతానిర్గమనము మొదలు విషాదచ్ఛాయాన్వితమై వెలవెల బోవుచుండిన సువర్ణదుర్గము తిరిగి నవ్యప్రభావిలసితమై కలకల లాడజొచ్చెను. ఆ పూర్వసంఘటనములెల్ల కాలప్రవాహమున కొట్టుకొనిపోయెను. స్వర్ణలతా విలాసకందమై యుండిన యా భవన మిప్పుడు శాంతావిలాస నిలయమయ్యెను. ఎట్టి సంపూర్ణ హృదయముతో స్వర్ణలతా సహవాసమును అనుభవించెనో అట్టి సంపూర్ణ హృదయముతోడనే కృష్ణమోహన్ ఇప్పుడు శాంతా ప్రణయసౌఖ్యము ననుభవించుచుండెను. వారి యన్యోన్యత ఆదర్శనీయమై యుండెను.

స్వర్ణలత స్మృతిచిహ్నములుగ నామె యిద్దఱు బిడ్డలు, లీలా చంద్రమోహనులుమాత్రము పూర్వసంఘటనములను మఱువనీయక ఆ భవనమునందు మెసలుచుండిరి. పోవుటకు పూర్వము స్వర్ణలతకు తాను చేసిన వాగ్దానమును దాసి మంజరి సంపూర్ణముగ పాలించుచు, ఆ పసిబిడ్డలను కంటికి ఱెప్పవలె కనిపెట్టుకొని యుండెను. కన్నతండ్రియైన కృష్ణమోహన్ వారిని ప్రాణాధికముగ ప్రేమించుచు ముద్దుముచ్చటలు చెల్లించుటయందు వింతలేదు. కాని, సవతిబిడ్డలైన యా పసివారలయెడ శాంత ప్రదర్శించుచుండిన యాదరాభిమానములు ప్రశంసార్హములు! తల్లిని గోల్పోయిన లోపము కానరాకుండ ఆమెయే వారికి తల్లియై, కన్నతల్లికంటె నధికముగ వారిని జూచుకొనుచుండెను. ఆహారపానీయము లందును, వస్త్రభూషణాదులయందును ఆమె హృదయమున వారిదే యగ్రస్థానము.

లీల ఆరోగ్యవతియైన బాలికయే కాని, చంద్రమోహన్ మాత్రము అనారోగ్యముచే కృశించుచుండెను. శాంతాకృష్ణమోహనుల మహానంద జీవితమునందు ఆ పసిబాలుని అస్వస్థతయే అప్పుడప్పుడించుక అశాంతి హేతువై యుండెను. ఇట్లొక సంవత్సరము గడచిపోయెను.

బిడ్డల కంతకంతకు జ్ఞానోదయ మగుచుండెను. వారికెట్టి లోపమును లేకుండ పరిచర్యల జేయుటకు మంజరి కనిపెట్టుకొని యుండినను, వారి మానసిక వికాసమునకును విద్యాభ్యాసంగములకును మరియొక స్త్రీ ప్రత్యేకముగ నియమింపబడుట అవసరమని శాంతాకృష్ణమోహనులు భావించిరి. అందు నిమిత్తము ఉత్తమ వంశీయయు, విజ్ఞానవతియు నగు నొక స్త్రీ కొఱకు కృష్ణమోహన్ ప్రయత్నింపనారంభించెను. నానాప్రాంతములందున్న తన మిత్రులకు అట్టివ్యక్తి యెచ్చటనైన తటస్థించినచో తనకు దెలుపుడని లేఖలు వ్రాసెను. స్వల్పకాలములోనే, ఢిల్లీ నివాసియగు నొక మిత్రుడు అట్టి యోగ్య స్త్రీ యొకతె తనకు తటస్థమైన దనియు, పంపుమన్నచో పంపెదననియు జాబు వ్రాసెను. తనకు సంతృప్తి కలిగినచో తక్షణమే పంపవలసినదని కృష్ణమోహన్ ప్రత్యుత్తరము వ్రాసెను. తిరుగుటపాయందు, రానున్న రవివారము నాటి మధ్యాహ్నముసరికి ఆమె

సువర్ణదుర్గమును చేరగల దనియు ఆమెను యథాయోగ్యముగ నాదరించ వలసిన దనియు, ఆ మిత్రుని యొద్దనుండి జాబు వచ్చెను. ఆ ప్రకారముగ ఆమె రవివారమునాటి మధ్యాహ్నము బండి దిగెను. పరిచారకు లిద్దఱు పోయి ఆమెను సువర్ణదుర్గమునకు దోడ్కొని వచ్చిరి. శాంతా కృష్ణమోహను లామె కెదురేగి సగౌరవముగ లోని కాహ్వానించిరి.

దూరప్రయాణపు బడలికచే గావలయు నామె ముఖమండలము నిస్తేజమై చాల కలతబడి యుండెను. తలపై మేలి ముసుగు వేణీబంధమును గప్పివైచెను. ముబ్బు రంగు గల కళ్ళ జోళ్ళు నేత్రద్వయమును మఱుగు పరచెను. సహజ కోమలమైన యా సువర్ణ తనూలత చాల కృశించి యుండెను. పరిచారిక లిద్దఱు వచ్చి యామెకై ప్రత్యేకించబడిన మేడమీది యొక గదిలోని కామెను దోడ్కొనిపోయి, యామె తెచ్చుకొనిన స్వల్ప వస్తుసామగ్రియు నా గదియందు చక్కగా నమర్చిరి. పిమ్మట స్నానభోజనాదులను యథావిధిగా నేర్పరచిరి. అనంతరము వారు "అమ్మా! మీ రించుక విశ్రమించుడు. సాయంకాలము అమ్మగారు వచ్చి మిమ్ము కలియుదురు." అని చెప్పిపోయిరి.

ఆమె పర్యంకముపై చేరబడెనేగాని, ఆమె కన్నులు మూతపడలేదు. కన్నులనుండి యేకధారగ కన్నీరు పారజొచ్చెను. కారణ మామెకే తెలియును. సాయంకాలము వఱ కామె యట్లే యుండెను. అంతట శాంత యామె గదికి వచ్చి బాష్పాకులనేత్రయై యున్న యామెను జూచి విస్మితయై, "ఏమమ్మా! ఏమైన బాధగా నున్నదా?" అని ప్రశ్నించెను. శాంతను జూచి యామె వడివడిగా లేచి, కన్నులు తుడుచుకొని, చిరునవ్వు తెచ్చుకొని "అమ్మా! ఏమియును లేదు. కన్నులు కొద్దిగా మండుచుండుటచే కన్నీరు వచ్చుచున్నది. ఈ కంటి మంట నాకు నైసర్గికమే. అందుకే యీ కళ్ళజోళ్ళు సదా వాడుకొనుచున్నాను." అని తలయెత్తకయే బదులు పల్కెను. అంత శాంత యొక కుర్చీపై గూరుచుండి యామెను కూర్చుండుమని యామెతో సంభాషణ కుపక్రమించి, "అమ్మా! నీ పేరేమి?" అని

యడిగెను. అంత నామె "దేవీ! నాపేరు హేమ" అని బదులు చెప్పెను.

శాంత:— నీ నివాస స్థలము ?

హేమ:— బహు దూరము. మా పూర్వులు తొల్లి యీ ప్రాంతపు వారే. కాని, అనేక కారణాంతరములచే నేను ప్రస్తుతము ఉత్తర దేశమున కాశీప్రాంతమునందు నివాసము చేయుచుంటిని.

శాంత — నీ బంధు వర్గము—

హేమ -ఎవ్వరును లేరు. అందఱను నేను పోగొట్టుకొన్న యభాగినిని. ప్రస్తుతము నే నేకాకిని. మరణము రాక జీవించుచున్నాను. ఒకప్పుడు ఒక సంపన్న గౌరవ కుటుంబమునకు చెంది భోగ భాగ్యము లనుభవించి యుంటిని. భర్తకు బహిఃప్రాణమునై సంసార సౌఖ్యము ననుభవించి యుంటిని. రత్నములవంటి బిడ్డలను కనియుంటిని. ఇప్పుడు ... ఇప్పుడు ... సర్వశూన్యనై శరీరమాత్రావశేషనై మరణమునకై వేచుకొని యున్నాను.

అని కన్నుల నీరు నింపుకొనెను. అంత, శాంత, "హేమా! దుఃఖాకులముగ దోచుచున్న నీ పూర్వచరిత్రమును స్మరణకుదెచ్చి నేను నీ కంట నీరు తెచ్చితిని. నన్ను క్షమింపుము. ఈ గృహమందు నీవు స్వగృహమునందువలెనే నిశ్చింతగ నుండనగును. నా సవతి బిడ్డ లిద్దఱు కలరు. ఒక బాలిక, ఒక బాలుడు. వా రిద్దఱను నీ చేతులయందు బెట్టుచున్నాము. తల్లిలేని బిడ్డలు, నిర్దాక్షిణ్యముగ వీరి తల్లి వీరిని పరిత్యజించినది. స్వైరిణియై, విదేశగామినియై యెచ్చటనో రైలుప్రమాదమున మరణించినది. ఆ దుర్మార్గురాలికి భగవంతుడు తగిన శిక్షనే విధించినాడు." అని చెప్పెను.

శాంత యీ మాటలు చెప్పుచున్నంత కాలమును హేమ దుర్వారమైన దుఃఖావేశముచే గుండె లార్చుకొని పోవుచుండ, కన్నీరు తుడుచుకొనుచునే యుండెను. అతి కష్టముపై నామె నోరు విప్పి "అమ్మా! నేను బిడ్డలను పోగొట్టుకొనిన తల్లిని! నిర్భాగ్యురాలను! వారు తల్లిని పోగొట్టుకొనిన బిడ్డలు! ఇట్లు

వారితో నన్నుగూర్చుట భగవదేచ్ఛ! ఇంకపై వారే నా బిడ్డలు. నేనే వారి తల్లిని!'' అని గద్గదికతో మాటుపల్కెను.

అంత శాంతి మంజరిని బిలచి బిడ్డలను దోడ్కొని రమ్మని పంపెను. తోటలో నాడుకొనుచున్న బిడ్డల నిద్దఱను మంజరి తోడ్కొని వచ్చెను. ఆ పసిబిడ్డల ముఖబింబములు కంటబడి నంతనే హేమ హృదయము తెఱుగుకొనిపోయెను. ఉచ్ఛ్వాస నిశ్వాసములు బంధింపబడిన ట్లయ్యెను. పొంగి పొరలి వచ్చుచున్న మహాదుఃఖమును మహాకష్టమున మఱుగుపఱచుకొను చుండెను. ఇంత దుఃఖమునకు కారణమేమో యామెకే తెలియును. శాంత వారిద్దఱను చెంతజేర్చుకొని, ముంగురులు నిమురుచు, ''లీలా! చంద్రమోహన్! ఇదిగో ఈమెను చూచితిరా? నేనెంతో ఈమె కూడ మీకంతే! ఈమె మీకేమికావలసిన నది యిచ్చును. ఈమెనుకూడ 'అమ్మా' అనియే పిలువవలెను. మీకు ఆటలు, పాటలు, చదువు అన్నియు నీమె నేర్పును. లీలా! మోహన్! ఈమె మీకు నచ్చినదా?'' అని చెక్కిళ్ళు నిమురుచు నడిగెను.

లీల:- అమ్మా! ఈమెను చూడగనే నాకెంతో యానందముగా నున్నది.

మోహన్:- అమ్మా! నేనెప్పుడును ఈమెను విడువనే విడువను.

అని తటాలున లేచి యామె యొడిలో గూర్చుండెను. ఒడి యందు గూరుచుండిన యాబాలుని హేమ తన బిగి కౌగిట జేర్చుకొని, ''నాయనా! నేను మీ యమ్మనుకదూ? నన్ను నీ వెప్పుడును విడచి యుండవుకదూ?'' అని యశ్రువర్షముతో బాలు ముద్దులవర్షమును గురిపించెను. ఇంతలో లీలకూడ వచ్చి యామె యొడిలో గూర్చుండెను. అంత శాంత, ''అమ్మా! ఇంకపై ఈ యిద్దఱు బిడ్డలును నీ బిడ్డలు. ఇట్టి యనురాగమూర్తియైన యుత్తమజనని వీరికి లభించినందుకు మాకెంతయు ఆనందముగా నున్నది. మాయింట నీ కెట్టిలోపమును కలుగదు. నీవు నాకొకసోదరివి. ఈ గృహము నీది. ఈ పరిచారకులు నీపరిచారకులు. నీ పూర్వక్లేశము లన్నియు పూర్తిగ మఱచిపోయి మాతో హాయిగ సుఖింపుము'' అని యామె నోదార్చి యచ్చోటు విడచి తన గదికిబోయెను.

అది మొదలు బిడ్డల యాహార విహారము లందును, విద్యాభ్యాసంగము లందును హేమ యత్యంతాసక్తయై వారిని కనిపెట్టుకొని యుండెను. మంజరి యామె సహచారిణియై పరిచారికయై యామె నంటిపెట్టుకొనియే యుండెను. కుమారి లీలవిషయమై వారి కేమియు చింత లేదు. మోహన్ ఆరోగ్యస్థితి నిరంతరాందోళనకరమై యుండెను. ఒకనాడు కలకలలాడుచు లేచి విహరించినచో వారము దినములు జ్వరగ్రస్తుడై తెప్పలువిప్పక మంచము నంటిపెట్టుకొని పడి యుండును. ఆ బాలుని యారోగ్యమునకై కృష్ణమోహన్ ఎట్టిన్యూను ప్రయాసములకైనను వెనుదీయకుండెను. ఎందరెందరో వైద్యులను రావించుచుండెను. ఎన్నెన్నో ఔషధము లిప్పించుచుండెను. కాని, బాలుని యారోగ్యమునం దేమియు మెఱుగు లేకుండెను. దినదినమును కృశించిపోవుచుండెను. అహోరాత్రములు హేమ వాని పజ్జనేయుండి సపర్యలు చేయుచుండెను. ఒక్కొక్కరాత్రి యామె సంపూర్ణ జాగరణమే చేయుచుండెడిది. సదా యామెనోట, "నాయనా! తండ్రీ! మోహన్! ఏమికావలెను? ఎట్లున్నది?" అనుమాటలే! కించిత్కాలము కన్నులు మూతపడినను, ఆ స్వల్ప నిద్రాసమయము నందు సహితము ఆ మాటలే ఆమె పలువరించుచుండెను. బాలుని పట్ల తాను ప్రదర్శించుచుండిన ప్రేమాభిమానములు చూచినచో ఈమె వాని కన్నతల్లియా యనిపించును.

అవకాశ మేమాత్రము కల్గినను కృష్ణమోహన్ వచ్చి బాలుని పజ్జనే కూర్చుండి మధురవాక్యములతో వానిని బుజ్జగించుచుండెను. పాపము, నిద్రాహారములను సహితము విడచి వానికి బరిచర్య చేయుచుండిన హేమను జూచి, "హేమా! నీ యారోగ్యము భంగము జేసికొనకుము. భగవదేచ్ఛ యెట్లున్నదో యట్లు జరుగును." అని యనేక పర్యాయము లాతడు హెచ్చరించెను. ఆ మృదుమధురవాక్యములకు ఆమె హృదయాంతరాళమునం దేమి ప్రళయము సంభవించుచుండెనో గాని, బొటబొట యామె కన్నుల నుండి యశ్రుబిందువులు రాలుచుండెను. ఆతని సమక్షమునం దామెకు ప్రపంచమంతయు నంధకార మగుచుండెను. ముఖమెత్తి యొక్కసారియైనను ఆమె యాతనితో భాషింపజాలకుండెను.

తీరిక కల్గినపుడెల్ల కృష్ణమోహన్ అక్కగారు ఆమెయొద్దకు వచ్చి యేదో లోకాభిరామాయణము పారాయణము చేయుచుండెను. తన యింటికి కళంక మాపాదించిన ఆ స్వర్ణలతను గూర్చియే తఱచుగ నామె యుపన్యసించుచుండెను. "ఆ దుర్మార్గురాలికి అట్టి అమృతకుంభమైన భర్త యెట్లు దక్కెను? వజ్రపుతునుకలవంటి యిట్టి బిడ్డ లెట్లు దక్కెను? కళంకిని! స్వైరిణి! ఇల్లు విడిచిపోయినది! ఇంటికి శని విరుగుడైనది! హేమా! అట్టి రాకాసి భార్యను, అట్టి రాకాసి తల్లిని ఎచ్చటనైన నీవు కని విని యుంటివా?" అని యడుగు చుండును. ఏమియు ప్రత్యుత్తరము నీయజాలక హేమ గుటకలు మ్రింగుచు దిగజారిపోవుచున్న హృదయమును చిక్కబట్టికొనుచు, "అమ్మా! అట్టి వివేకహీనులను భగవంతుడే శిక్షించును," అనుచుండును.

"భగవంతుడు! ఏడీ భగవంతుడు? దిక్కుమాలిన చావు చచ్చినదట! అది యొక శిక్షయా? బ్రతికియుండి సశరీర నరకము ననుభవించినప్పుడు కదా ఆ క్షుద్రురాలు తగిన విధముగ శిక్షింప బడుట!"

అని యాగ్రహావేశమున లేచి యుచ్చోటు విడచి రివ్వున బోవుచుండును. స్వర్ణలత మాట యేమోగాని, అట్టి భయంకర యాతన తా ననుభవించుచున్నట్లు హేమ పొడగట్టుచుండెను. ఆమెను జూచు ప్రతివారికిని, ఆమె క్షణమాత్రమైన మనశ్శాంతి లేనట్లును, క్షణక్షణమును బిందు బిందువుగ నామె రక్తము ఏదో యజ్ఞాత దుఃఖాగ్నిచే ఉచ్ఛ్వాసరూపమున శోషింపబడుచున్నట్లును తోపక మానదు. లోలోన ఆమె యెంత క్రుంగిపోవుచున్నను, తన యాంతరంగిక వేదనకు కారణమును మాత్రము ఆమె యెవ్వరికిని తెలుపలేదు. బిడ్డల వ్యాసంగము తప్ప అన్య వ్యవహారములం దామె కల్పించుకొనక, శాంతాకృష్ణమోహనులకే గాక సువర్ణదుర్గము నాశ్రయించుకొని యున్న ప్రతి ప్రాణికి నామె ప్రీతిపాత్రమై, సగౌర వముగ, గోప్యముగ కాలము గడపుచుండెను.

# అ ధ్యా య ము 21

ఇంతలో రాష్ట్రమునందలి ప్రజాప్రతినిధి సభయందు కల్యాణ నగర నియోజకవర్గమునకు ప్రతినిధిగా నుండిన యొక సభ్యుని మరణముచే ఒక స్థానము ఖాళీయయ్యెను. ఆ స్థానము పూరించుటకు ప్రభుత్వముచే ప్రత్యేకముగా ఎన్నిక నిర్ణయింపబడెను. ఈ యెన్నికకు కల్యాణనగరమునందలి యావత్ ప్రజానివహమును, నగరమునందలి న్యాయాధిపతులు మొదలు అంగడిలోని కిరాయి వర్తకులవరకు, ఏకగ్రీవముగ కృష్ణమోహన్ అభ్యర్థిగా నుండవలయునని నిశ్చయించిరి. ప్రశాంతమైన న్యాయవాదివృత్తికి భంగముకలిగించుకొని, అశాంతియుతమైన రాజకీయ వాతావరణమునందు ప్రవేశించుటకు కృష్ణమోహన్ ఇష్టపడకున్నను ప్రజాసంఘపు ఒత్తిడిని త్రోసిపుచ్చజాలక అందు కంగీకరించెను. కల్యాణనగరమునందు అభ్యర్థిగా కృష్ణమోహన్ నిలచినప్పుడు, ఇంక రెండవవాడెవ్వడైన ప్రత్యర్థిగా నిలచుట సూర్యమండలముతో దీపపుబుడ్డి పోటీచేయుటయే! కాని, అట్టి దీపపుబుడ్డి యొకటి యిప్పుడా సూర్యమండలముతో పోటీకి నిలచినది! ఎవరు? రమాపతి! కృష్ణమోహన్ సంసార పుష్పవనమును కూకటివ్రేళ్లతో పెకలించివైచిన ఘాతుకుడు! ఆనందకందమైన కృష్ణమోహన్ హృదయమందిరమునందు నిప్పురగిలించిన ఘోరరాక్షసుడు! అట్టి రమాపతి ఇప్పుడు కృష్ణమోహన్‌కు ప్రతిద్వంద్వియగుట యాశ్చర్యలీలవలె పొడగట్టును.

"ఏ ముఖముతో తిరిగి యా దుర్మార్గుడు కల్యాణనగరమునందు కాలిడగలడు? ఆ పాపిష్ఠిముఖమునుజూచి కల్యాణనగరవాసులు సహింపగలరనియే ఆ మూర్ఖుడు భావించెనా? లజ్జాలేశములేని పశువు! వాని ధైర్యమునకు సంతసింపవలెను! బలే! బలే!" అను శబ్దములు కల్యాణనగరము నల్గడలను ప్రతిధ్వనింపజొచ్చెను.

రమాపతి కృష్ణమోహన్‌కు ద్రోహ మొనర్చి, స్వర్ణలతను తరలించుకొనిపోయి స్వైరసంచార మొనర్చి, చివర కామెకు సహితము ద్రోహ మొనర్చి, ఒక యర్ధరాత్రమునందామెను నిష్కరుణముగ బరిత్యజించి తన దారిని బోయెను. పిమ్మట అంతవఱకును

చిక్కులలో బడి తనకు చిక్కకుండిన పిత్రీయమైన యాస్తినంతయు నెట్లో చిక్కించుకొని, కలకత్తా నగరము చేరుకొని తలయెత్తుకొని తిరుగ నారంభించెను. అచ్చట వానికి దగిన మిత్రవర్గమే వానికి లభించెను. ఇంతలో కల్యాణనగరమునందు జరుగనున్న ఈ యెన్నిక విషయ మెఱిగి తన మిత్రులచే బ్రోత్సహింపబడి యాత డిప్పుడు కృష్ణమోహన్‌కు ప్రత్యర్థిగా నిలచెను. ఆ విశ్వాసఘాతకుడు తనకు ప్రతి ద్వంద్విగా కల్యాణనగరమునందు నిలచుట కృష్ణమోహన్‌కు మిక్కిలి యాశ్చర్యము కలిగించెను.

న్యాయవాది వృత్తికి అంతరాయము కలిగించు రాజకీయము లందు కృష్ణమోహన్ ప్రవేశించుటకు, ఎంత మాత్రమును సుముఖముగ లేకుండిన ఆతని యక్కగారు, ఇప్పు డా దుర్మార్గుడు రమాపతి యాతనికి ప్రత్యర్థిగా నిలచియున్నాడని తెలిసి తన యభిప్రాయము మును మార్చుకొనెను. ఆ నీచుడు ఓడింపబడి పరాభవింపబడి కుక్కవలె కల్యాణనగరము నుండి తఱుమగొట్టబడవలె నని యామె గట్టి పట్టు పట్టెను.

ఎన్నిక యనిన సామాన్యము కాదు. అది అభ్యర్థియొక్క ధన మనః ప్రాణ సర్వస్వమును పీల్చి పిప్పిచేయు నొక పెద్ద పీడ. ఈ రోగబాధ అనుభవించినరోగికే తెలియును. ఎన్నిక పూర్తి యగు పర్యంతము నిద్రాహారము లుండవు. రక్తము శోషించుకొని పోవును. శారీరక మానసిక విశ్రాంతి క్షణమాత్రమేని యుండదు. ఉచితానుచిత జ్ఞానము నశించును. కాని, ఈ దురవస్థ తానొక యభ్యర్థి యయ్యును కృష్ణమోహన్‌కులేదు. ఈ యెన్నిక ఆతని కొక వినోదమువలె నుండెను. కాలు కదపకుండ, పెదవులు మెదపకుండ, ఈ యెన్నిక యందు విజయార్జనము చేయగలశక్తి యాతని కుండెను. ప్రజాశక్తియే ఆ శక్తి! ప్రజాసంఘమే ఆ విజయమును సాధించి తన పాదముల ముందు పడవైచును. కల్యాణనగరము నందును ఆ పరిసరముల యందును ఆతని కున్న గౌరవప్రతిష్ఠ లట్టివి!

కాని, రమాపతి విషయ మట్టిది కాదు. పరగ్రామవాసి! మరియు ఆ ప్రాంతమునం దంతటను తన పూర్వప్రవర్తనముచే నొక శత్రువువలె, ఒక నీచాతినీచ ప్రాణివలె, ద్వేషింపబడుచుండిన

యొక ద్రోహి! కల్యాణ నగరమునందు వానికిని వాని పరివారము నకును, తాత్కాలికముగ బసచేయుటకైన నెచ్చటను తగిన గృహము దొరకలేదు. ఎట్లో అత్యంత కష్టముపై ఊరి చివర నొక చిన్న కొంప దొరకినది. ఒక వింత జంతువును చూచుటకు వచ్చు నట్లు ప్రజలు వానిని జూచుటకు ఆ యింటిముందు మూగుచుండిరి. ఈ మూకయంతయు తన గొప్పయే యనుకొని రమాపతి బయటకు వచ్చి తన్ను బలపఱచుడని వారి కుపన్యాసము లిచ్చుచుండుటయు, నవ్వులతో, కేకలతో, అప్పుడప్పుడు రాళ్లవర్షముతో ఆ యుప న్యాసము లంతము లగుచుండుటయు, ఆ దినములలో ఆ నగరమునం దొక క్రొత్త సందడిగా నుండెను.

కృష్ణమోహన్ అట్టి సభలను గూర్చుటకు గాని, అట్టి యుప న్యాసము లిచ్చుటకు గాని యెట్టి యవసరమును లేకుండెను. ఉచ్చ శ్రేణికి జెందిన మిత్రవర్గముతో నాత డప్పుడప్పుడు సాయంసమయ మున మందహాసవదనుడై గ్రామ సంచారము చేయుటయు, అప్పటున ప్రజా సంఘము లాతనికి అడుగడుగునకు అభినందన ధ్వానములు చేయుచుండుటయు, తన వసతి యింటిలోనుండి రమాపతి చూచుచు ఉడుకుచుండెడివాడు.

ఒకనాటి సాయంకాలమున రమాపతి తన యింటిముంగిట మూగిన జనసమూహమునకు చాల ఆర్భాటముతో నుపన్యసించు చుండెను. జనసమూహమునుండి ఛీత్కారములు, ఛంకారములు చెలరేగుచుండెను. కార్యభారము నెట్లో సడలించుకొని ఆ దినమున కృష్ణమోహన్ గుమస్తా విశ్వాసరాయలు ఆ మార్గమున బోవుచు వినోదార్థము అచ్చట నొక మూల నిలచి వినుచుండెను. ఆతనిచెంత కల్యాణనగరమునందలి మరియొక ప్రఖ్యాత న్యాయవాదియైన బాలచంద్రదేవ్ గుమస్తా అభిరామసింగ్ కూడ నిలచియుండెను. ఇంతలో బహుకాలమై విదేశగమన మొనర్చి, యిప్పుడే తిరిగి వచ్చుచున్న దీక్షిత్ ఆ ప్రక్కనుండి పోవుచు వారి దృష్టి నాకర్షించెను. బహుకాలానంతరము పునస్సమావేశ మగుటవలన అన్యోన్య కుశల సంభాషణములతో అచ్చటనే వారు చాలసేపు నిలచిపోయిరి.

గుమికూడియున్న ఆ జనసమూహమును జూచి దీక్షిత్, "ఇది యేమి?" అని ప్రశ్నించెను.

విశ్వా:— ఇది యొక యెన్నిక సభ.

దీక్షిత్:— ఓహో, అగునగును. ఇప్పుడే వినియుంటిని. కృష్ణమోహన్‌కు ప్రత్యర్థిగా నెవ్వడో రమాపతి యట!

విశ్వా:— అగును.

దీక్షిత్:— ఏదీ ఆ ముఖమెట్టిదో యొకసారి చూచి సంతోషించెదను.

అని వారిద్వరతో గలసి కొంచెము దాపునకు వచ్చి చూడసాగెను. వానిని చూడగనే ఆతని ముఖలక్షణములందు ఒక వింత మార్పు దోచ ముఖము చిట్లించుకొనుచు,

"వీడా? వీ డిచ్చటి కెట్లు వచ్చెను?" అని యాశ్చర్యముతో బ్రశ్నించెను.

విశ్వా:— ఎవరు?

దీక్షిత్:— ఆ యుపన్యాస మిచ్చుచున్న వ్యక్తి!

విశ్వా:— వాడే అభ్యర్థి రమాపతి!

దీక్షిత్:— (ఆశ్చర్యముతో) రమాపతియా? వాని పేరు రమాపతియా?

ఈ సమయముననే రమాపతి దృష్టి దీక్షిత్ వైపు మరలెను. దీక్షిత్ చేయెత్తి మందహాసముతో నాతనిని సౌంజ్ఞాపూర్వకముగ బలుకరించెను. రమాపతి ముఖము ఒక్కసారి వివర్ణమైనట్లు కనబడెను.

విశ్వా:— దీక్షిత్! నీకు వీడు పరిచితుడా?

దీక్షిత్:— కొద్దిగా — ఒకప్పుడు.

అప్పుడు అభిరామసింగ్ నవ్వుచు, "ఔను. అల్లప్పుడు! ఈ రమాపతి అప్పుడు రమాపతి కాడు. ఏమందవు దీక్షిత్?" అని ప్రశ్నించెను. ఆ ప్రశ్న కించుక చకితుడై దీక్షిత్ "ఆ యప్రస్తుత ప్రసంగము నీకేల?" అని తీక్షణముగ జూచి, విశ్వాసరాయులకు పోయెదనని సౌంజ్ఞ జేసి వడివడిగా ఆ స్థలమునుండి వెడలిపోయెను.

అంత విశ్వాసరాయలు అభిరామసింగుతో, "అభిరామ్! ఇదియొక అంతర్నాటకమువలె నున్నదే! విశేషమేమి?" అని ప్రశ్నించెను.

అభి:— (నవ్వుచు) ఏమి విశేషము ! ఈ పెద్దమనిషి రమాపతి అప్పుడింత పెద్దమనిషి కాడు.

విశ్వా:— నీకు వీడింతకుముందు తెలియునా ?

అభి:— తెలియకేమి ? నాకేల యని ఇంతకాలమును నేను నోరుకట్టుకొని యుంటిని. ఆ రహస్యము నీకిప్పుడు చెప్పెదను వినుము. బహుకాలము పూర్వము ఈ సమీపవనమునందలి యొక గృహమునందు ఒక హత్య జరిగి యుండెను. జ్ఞప్తియున్నదా?

విశ్వా:— అగును. జ్ఞప్తియున్నది.

అభి:— ఆ హత్యగావింపబడినవాని కుమార్తె 'అమీనా' అను నామె అచ్చట నొక శృంగార నాటక మాడుచుండెనని నీవు విని యుందువు.

విశ్వా:— (అతిశ్రద్ధతో) అగును. వినియుంటిని.

అభి:— ఆ శృంగార నాటకమునందలి కథానాయకుడు వీడు ! అప్పుడు వీనిపేరు రమాపతి కాదు.

ఈ మాటలు వినినంతనే విశ్వాసరాయుల శరీరము లక్షసూదులతో గ్రుచ్చబడుచున్నట్లుండెను. తన పాదముల క్రింది నేల పాతాళములోనికి క్రుంగిపోవుచున్నట్లుండెను. ఒక్కింతసేపు దిగ్భ్రమ చెందినవానివలె చూచి, విశ్వాసరాయులు, "అభిరామ్ ! అప్పుడు వానిపేరేమై యుండెను ?" అని ప్రశ్నించెను.

అభి:- అప్పుడు వీని పేరు గౌరి. ప్రతిదినము వారెచ్చటినుండియో చీకటిపడువేళ అశ్వారూఢుడై వచ్చుచుండెడివాడు. అశ్వమును ఆ వనమునందొక చెట్టునకు గట్టివైచి సరాసరి అమీనాయింట జొచ్చుచుండెడివాడు. అమీనా ఒక విధముగ వానికి గుత్తయై యుండెను.

విశ్వా:- ఇదియంతయు నీకెట్లు తెలిసెను ?

అభి:- ఆ దినములలో నేనుకూడ ఆ శృంగార నాటకమునందొక పాత్రధారినే! ఈ గౌరియు, ఆ హంతకుడు నరేంద్రుడును లేకుండిన నా పాత్ర కొంత రాణించి యుండెడిది.

విశ్వా:- ఆ గౌరి యీ రమాపతియే యని అప్పుడు నీకు తెలియునా ?

అభి:- తెలియదు. గౌరి యను పేరుతోనే వా డప్పుడు మెలగు చుండెను. వాడే వీడని యిప్పుడు తెలిసినది! క్షణముక్రిందట దీక్షిత్ కూడ వానిని జూచి ఆశ్చర్య చకితుడగుట యిందువల్లనే!

విశ్వా:- వానికిని దీక్షిత్ కును కల సంబంధ మేమి?

అభి:- విశేష మేమియు లేదు. వేట చేయు నిమిత్తము తఱుచు దీక్షిత్ ఆ వనమునందే సంచరించుచు గౌరిని పలుసార్లు చూచు చుండెడివాడు. ఆ పరిచయమువల్ల నేకదా యిప్పుడు సౌంజ్ఞా మూలమున గౌరిని పలుకరించినాడు!

విశ్వా:- అగును, పలుకరించినాడు. ఆ పలుకరింపును వాడు నిరసించి నట్లు వాని ముఖవైఖరి కనుపట్టిన దేమి?

అభి:- నిరసించడా? పూర్వపు దుష్ప్రవర్తనమును స్మరింప జేయునట్టి పలుకరింపు వానికి రుచించునా? అప్పుడు గౌరి! ఇప్పుడు రమాపతి! ఇంతకును, వీని పేరు గౌరియా లేక రమాపతియా?

ఈ సంభాషణానంతరము విశ్వాసరాయులకు మరి యచ్చోట పాదము నిలువలేదు. ఎంత శీఘ్రముగ బోయి యీ వింత వృత్తాంత మును కృష్ణమోహన్ చెవిని వేయుదునా యని యాతడు తహతహ లాడెను. ఎట్లో అచ్చటనుండి విడివడి, ఏకధాటిని కృష్ణమోహన్ కచేరి గృహమునకు వచ్చి యాతని యెదుట నిలచెను. నగర్పుచున్న యాతని జూచి కృష్ణమోహన్, "విశ్వాస్! ఏమి విశేషము? అని యడిగెను.

విశ్వా:- విశేషమే! విశేషములలో విశేషము! ఆ దుర్మార్గుడు గౌరిని నేను కనిపెట్టితిని. వా డెవడో తెలియునా?

కృష్ణమోహన్ దిగ్భ్రాంతుడై యాతని ముఖమువైపు తేరి చూడసాగెను.

విశ్వా:- వా డెవడో తెలియునా?—రమాపతి!

కృష్ణ:- నా కేమియు నర్థమగుట లేదు.

విశ్వా:- ఆ నాటి గౌరి, యీనాటి రమాపతి! ఇది యాధి!

కృష్ణ:- నీ కెట్లు తెలిసెను?

పిమ్మట విశ్వాసరాయలు జరిగినదంతయు చెప్పెను. పర దేశ వాసమునుండి చిర కాలమునకు తిరిగి వచ్చుచు దీక్షిత్ వానిని

గుర్తించి పలుకరించుటయు, వాడు వినక్ష ధగుటయు, తదుపరి అభి రామసింగ్ వివరించిన విశేషము లన్నియు పూసగ్రుచ్చినట్లు ఆతడు కృష్ణమోహన్ చెవిని వైచెను.

కృష్ణ:— నేనొకసారి గౌరి విషయమై ప్రస్తావింపగా దీక్షిత్ వాని గూర్చి తన కేమియు తెలియదని చెప్పెనే?

విశ్వా:— దాని కేదియో కారణ ముండి యుండును. ఆతడు వానిని పలుకరించుట నేను చూచితిని. అభిరామ్ చూచినాడు.

కృష్ణ:— ఆ పలుకరించుట రమాపతిగా పలుకరించెనా? లేక గౌరిగా పలుకరించెనా?

విశ్వా:— నిస్సందేహముగ గౌరిగానే పలుకరించెను. వాడే రమాపతియని నేను చెప్పగా వాని ముఖమునం దాశ్చర్యము కన్పడెను. వారిద్వరి నడుమ తప్పక ఏదో రహస్య మున్నది!

కృష్ణ:— (సందేహముతో) గతసారి నరేంద్రు డిచ్చటకు వచ్చినప్పుడు గౌరియు రమాపతియు మిత్రు లనియు వానిచెంత నీవిని తాను స్వయముగ చూచితి నని చెప్పెనే!

విశ్వా:— నరేంద్రుడు పొరపాటు పడియుండును. నా కన్నులను, నా చెవులను నేను విశ్వసించనా?

కృష్ణ:— మంచిది, విశ్వాస్! ఈ సందేహనివృత్తి ఒక్క నరేంద్రుని వల్లనే కావలసియున్నది. బహుకాలమై మనము చేయుచున్న రహస్య పరిశోధనము ఫలోన్ముఖ మగుచున్నట్లే తోచుచున్నది. నరేంద్రునియొద్ద నుండి మొన్ననే చండీపురము నుండి రహస్యలేఖ వచ్చినది. తక్షణమే వానిని రప్పించుదము. ఆపై కర్తవ్యము మనకే గోచరించును. నీవు వేయికండ్లతో దీక్షిత్ కార్యకలాపములను రహస్యముగ కనిపెట్టుచుండుము.

అని తక్షణమే లేచి గృహమునకుబోయి, ఈ యావత్ వృత్తాంతమును శాంత కెఱిగించెను. ఆమె హృదయావేగమును ఎవ్వరు వర్ణింపగలరు? ఇరువురును యోచించుకొని చండీపురమునందు అజ్ఞాతవాసమునందున్న నరేంద్రుని తక్షణమే రమ్మని యొక రహస్యలేఖ ఆత డిచ్చిన విలాసమునకు వ్రాసిరి.

# అధ్యాయము 22

ఆ మూడవనాటి రాత్రి సుమారు తొమ్మిదిగంటలైనది. చీకటి రాత్రి. ఆకాశము మేఘాక్రాంతమై యుండెను. హోరుమని వీచుచున్న గాలిలో వృక్షాగ్రము లల్లల నాడుచుండెను. సువర్ణదుర్గపు పరిసర ప్రాంత మంతయు నిర్మానుష్యమై యుండెను. కృష్ణమోహన్ గవాక్షమునుండి మాత్రము దీపపుకాంతి నిబిడీకృతమై యున్న యంధకారమును భేదింప యత్నించుచుండెను. ఆ చీకటిలో నొక వ్యక్తి తోటవాకిలి తెఱచుకొని మెల్లగ లోన ప్రవేశించి యొక ప్రాని చెంతి నిలచి గవాక్షమువైపు చూచుచుండెను. మూడు రాత్రులై తెప్పపాటు లేక యెదురు చూచుచుండిన రెండు ప్రేమమయ నేత్రము లీ ఛాయావ్యక్తిని గుర్తించెను. ఉత్తరక్షణమందే శాంత గదితలుపు తెఱచుకొని నిశ్శబ్దముగ వచ్చి నరేంద్రు నెదుట ప్రత్యక్షమయ్యెను.

శాంత:- అన్నయ్యా! వచ్చితివా? నీ రాక యెవ్వరును కనిపెట్టలేదు కదా?

నరేం:- లేదు.—మోహన్ ఇంటియొద్ద లేడా?

శాంత:- ఉన్నారు. త్వరలోనే ఇచ్చటకు వచ్చెదరు.

నరేం:- శాంతా! నీ వివాహవార్త తెలిసి యెంత యానందించితినో దైవ మెఱుగును. ఆ మహోత్సవమును జూచు భాగ్యము నాకు లేదు.

శాంత:- అన్నయ్యా! దయామయుడగు సర్వేశ్వరుడు నా హృదయమును గుర్తించి నన్ను ధన్యను జేసెను. ఒక్క నీ విచారము తప్ప అన్య విచారము మాకు లేదు.

నరేం:- భగవదేచ్ఛ! అమ్మ యారోగ్య మెట్లున్నది?

శాంత:- అట్లే యున్నది.

నరేం:- ఈసారి నేను తప్పక ఆమెను చూడవలెను.

శాంత:- అవకాశము లభించిన అటే చేయవచ్చును.

నరేం:- శాంతా! ఇంత హఠాత్తుగ నన్ను రప్పించుట కేమి కారణము?

శాంత:— కొంచె మోపికపట్టుము. ఇచ్చట జరుగనున్న ప్రజాప్రతినిధి యెన్నికవిషయమై వింటివా ?

నరేం:— వింటిని. కృష్ణమోహన్ నిలచియున్నాడట! ఆతనికి ప్రతి పక్షుడై రమాపతి నిలచియున్నాడట! వానికి ఆ గౌరి సహాయము కాబోలును!

శాంత:— ఏమో !

ఇంతలో కృష్ణమోహన్ వచ్చి వారిని కలసెను.

కృష్ణ:— (చిరునవ్వుతో) నరేంద్రా! ఈసారి వేషము మార్చి నట్లున్నదే !

నరేం:— అగును. ఈ వేషముల మార్పుతోనే నా నిర్భాగ్యజీవనము గడచిపోవుచున్నది! ఎప్పటికి విముక్తియో తెలియకున్నది.

కృష్ణ:— కాలము, కర్మము, కలసిరావలెను కదా!

నరేం:— మీ వివాహమహోత్సవముజూచు భాగ్యము లేకపోయినది. కాని, ఆనోట ఆనోట విని మిక్కిలి యానందించితిని. ప్రజా ప్రతినిధిసభకు నీ విప్పు డభ్యర్థిగా నిలచితి వనికూడ విని యుప్పొంగితిని. నీకు ప్రత్యర్థిగా రమాపతి నిలచియున్నాడట!

కృష్ణ:— అగును. రమాపతి నెఱుగుదు ననియు, వాడు గౌరి మిత్ర వర్గములోనివా డనియు, వాడును గౌరియు కలసిపోవుచుండగా చూచితి ననియు నీవు చెప్పితివి. ఈ రమాపతిని ఎట్లు నీ వెఱుగుదువో చెప్పుము.

నరేం:— ఒకసారి గౌరియు వీడును గలిసిపోవుచుండిరి. ఆ చెంతనే నేనొక మూల నిలచి యుంటిని. "వా డెవ్వడో నీకు తెలి యునా ?" అని నా ప్రక్కనే నిలచియున్న యొక బండివాని నడిగితిని. అంత వాడు "వా డెవడో నాకు తెలియదు. కాని వాని ప్రక్కనున్నవాడు రమాపతి" అని చెప్పెను. ఇంక తెలియుట కేమున్నది? వానికి తెలియనివాడు గౌరి! నాకు తెలియనివాడు రమాపతి !

కృష్ణ:— సరియే. ఈ విధముగనే నీవు రమాపతి నెఱుగుదువన్న మాట !

నరేం:— అగును. అంతకు ముందు వాడు నాకు తెలియడు.

కృష్ణ:— ఇప్పుడు తెలిసినది! నీవును ఆ బండివాడును కూడ పొరపడినారు. గౌరి కాక ఆ రెండవవా డెవ్వ డని నీవు బండివాని నడిగితివి. వాడు, నీ వెవ్వని గూర్చి యడుగుచుంటివో తెలియక గౌరిని చూపుచు వాడు రమాపతి యని చెప్పినాడు. నీకు గౌరియు, వానికి రమాపతియు, అయిన వ్యక్తి యొక్కడే! గ్రహించితివా?

నరేంద్రుడు తెల్లబోయెను.

కృష్ణ:— అభిరామసింగ్ గౌరిని జూచియుండెనా?

నరేం:— చూడ కేమి? ఆ దినములలో అమీనా కొంపచుట్టు తిరిగిన వారిలో అత డొక్కడు కదా!

కృష్ణ:— ఇంక దీక్షిత్?

నరేం:— అతడు కూడ ఆ వనములో వేటాడుచు చాలసార్లు గౌరిని చూచియే యుండుననుటలో సందేహము లేదు.

ఇంక కృష్ణమోహన్‌కు పూర్తిగ సందేహనివృత్తి యయ్యెను.

కృష్ణ:- నరేంద్రా! ఇప్పుడు నీ వొకపని చేయవలసియున్నది.

నరేం:- ఏమది?

కృష్ణ:- ఇప్పు డింకను పదిగంటలు కాలేదు. ఈ కల్యాణనగర రాజమార్గమున చివరి యింటిలో, ఆ రమాపతి బసచేసి యున్నాడు. సుమా రర్ధరాత్రివఱకును వాడు వాని బృందముతో ఆ యింటి వసారాపై నిలచి ముంగిట మూగుచుండు ప్రజలకు ఉపన్యాసము లిచ్చుచుండును. ఇప్పుడే నీ వచ్చటకు పోయి, ఆ వ్యక్తిని జూచి, వాడు గౌరి యగునో కాదో స్థిరపఱచుకొని రమ్ము. ఈ వేషమునందు నిన్నెవ్వరును గుర్తింపజాలరు. పోయిరమ్ము. నీకొఱ కిచ్చటనే వేచికొనియుందుము.

తత్క్షణమే పొంగిపొరలుచున్న హృదయోద్రేకముతో ఆ యంధకారమునందు పోయి, రాజమార్గము చివర నున్న ఆ వసతిగృహమున కెదుట సమీపముననున్న యొక చెట్టుచాటున నిలచెను. ఇంటి ముంగిట నమర్చబడియున్న దీపపు కాంతియందు ఒక చిన్న

మూఁక చేరియుండెను. దీపము చెంత నిలచి రమాపతి గంభీరముగ నుపన్యసించుచుండెను. వాని చెంతనున్న వ్యక్తి ఆనాఁడు కలకత్తా యందు గౌరిచెంత తాను చూచియున్న వ్యక్తియే. ఉపన్యాసకుని చూచిన తక్షణమే నరేంద్రుఁడు వాఁడే గౌరి యని గుర్తించెను. రమాపతి వాఁడే యగునో కాదో తెలియుఁగోరి ఆప్రక్కను నిలచియున్న వ్యక్తిని "ఆ యుపన్యాసకుఁ డెవరు ?" అని ప్రశ్నించెను.

"ఏమయ్యా ! నీ దీయూరు కాదా ?" అని యాతఁడు తిరుగు ప్రశ్న వైచెను. నరేంద్రునికి ముచ్చెమటలు పోసెను. "కాదు. కార్యాంతరమున నీ గ్రామమునకు వచ్చితిని." అని మెల్లగా పల్కెను.

"వాఁడే కృష్ణమోహన్ ప్రత్యర్థి రమాపతి." అని యా వ్యక్తి బదులు పల్కెను.

"ఓహో ! అట్లనా !" అని మెల్లగ తలయూఁపి, నరేంద్రుఁడు ఆ ప్రదేశమును విడచి బ్రతుకు జీవుఁడా యని వెనుఁజూడక వడివడిగా నగర్చుకొనుచు సువర్ణదుర్గమును చేరెను. వానికొఱకు శాంతా కృష్ణమోహను లెదురు చూచుచుండిరి. రొప్పుచు వచ్చి యాతఁడు వారిని సమీపించి. గద్గదస్వరముతో, "మోహన్ ! చూచితిని, వాఁడే! వాఁడే! ఆ గౌరియే యీ రమాపతి ! ఏమియు సందేహము లేదు." అని పల్కెను. ఉద్రేకవశమున కంఠస్వరముతో పాటు వాని కరచరణములు సహితము వణంకుచు కంపించుచుండెను. శాంతాకృష్ణమోహనులు వాని చేతులు పట్టుకొని, "భయపడకుము. నీ వేమియు పొరపాటు పడలేదు కద ?" అని ప్రశ్నించిరి.

"ఏమియును పొరపాటు లేదు. అదే వజ్రపు టుంగరము! ముంగురులు పైకెగ ద్రోయుటయందు అదే చేతివిసరు! ఏమియు సందేహము లేదు. వాఁడే! వాఁడే! ఇంక నీదే భారము మోహన్ !" అని యాతఁడు దీనస్వరముతో బల్కెను.

కృష్ణః— నరేంద్రా ! ఇంతవఱకును కథ బాగుగనే నడచినది. కాని, ఇంకపై నడపించుటయే కష్టము. నేను ఈ అభియోగము నందు పూనుకొనజాలను.

నరేం:— (దీనముగ) మోహన్! నీవు పూనుకొని పనిచేయకున్న ఇంక నాకు దిక్కెవ్వరు? నీవు స్వయముగ పూనుకొనుటకు ప్రతిబంధక మేమి?

కృష్ణ:— వాడు రమాపతి యగుటయే.

నరేం:— రమాపతియై యీఘాతుకుడు నీకు గావించిన ఘోరద్రోహమునకు ప్రతీకారము చేయుటకు ఇంతకన్న అవకాశ మేముండును?

కృష్ణ:— వాని హత్యానేరమునకు నేను వానిని ఉరికంబమెక్కించ గలను. కాని, నాకు వాడు చేసినద్రోహమునకు నేనేమియు చేయదలచుకొనలేదు. ఆ శిక్షాక్రమమును భగవంతునకే విడచుచున్నాను. ఈ యవకాశమును గ్రహించి నేను వానిపై చర్య తీసుకొనినచో లోక మన్యథా భావించును. కావున నేను పూనుకొనుట కంగీకరించను.

నరేం:— పోనిమ్ము. నా చెల్లెలు శాంత పూనుకొనినచో?

కృష్ణ:— శాంత నీకు చెల్లెలే కాని నాకు భార్యకాదా? ఆమె సహితము బయల్పడరాదు.

నరేం:— ఇంక నా కెవ్వరు కలరు? తండ్రి నాకు పరమశత్రువు కదా? తల్లి మంచముపట్టి యున్నది కదా?

కృష్ణ:— ఎవ్వరును వద్దు. నీవే స్వయముగ పూనుకొనుము.

నరేం:— పరిహాసము చేయుచుంటివా, మోహన్? నేనే బయల్పడుటయా? అది ఉరిత్రాటికి తల యందిచ్చుట కాదా?

కృష్ణ:— కాదు. నేను చెప్పునది వినుము. రెండుమూడు దినముల వఱకు నీవు ఈ సమీపమందే యెచ్చటనో రహస్యముగ దాగి యుండవలెను. అట్టి రహస్య ప్రదేశ మొకటి నీకిది వఱకు ఈ ప్రాంతమున నుండెనుకదా?

నరేం:— ఉన్నది.

కృష్ణ:— అచ్చటనే దాగియుండుము. ఈ కల్యాణ నగరమునందు బాలచంద్రదేవ్ అను నొక న్యాయవాది కలడు, తెలియునా?

నరేం:— ఎఱుగుదును.

కృష్ణ:- నాకు బదులుగ ఆతడు నీ పక్షమున పని చేయును.
నరేం:- నే నాతనియొద్దకు పోవలయునా ?
కృష్ణ:- ఇప్పు డవసరము లేదు. రేపు రాత్రి ఎనిమిదిగంటల సమయమునకు నీ విచ్చటకు రమ్ము. ముందు నే నాతని గలసి ఈ వ్యాజ్యమున కాతని సిద్ధము జేసెదను. పిమ్మట నీవు సరాసరి యాతనికడకు బోయి సమస్త విషయములను దాపరికము లేక చెప్పుము. ఏమియు భయపడవలదు. నీ కపాయము రాకుండ జూచు బాధ్యత నాకున్నది కదా ?
నరేం:- (మందహాసము జేయుచు) మోహన్! నన్ను దరిజేర్చు భారమంతయు నీదే కదా! నా కేమి భయము ? అట్లే చేసెదను.
కృష్ణ:- మంచిది. ఇంక నీ వా రహస్యప్రదేశమునకు బొమ్ము. రేపు రాత్రి మరల కలసుకొందము.

అప్పటి కర్ధరాత్రియైనది. ఆ సమావేశానంతరము నరేంద్రుని హృదయభారము తగ్గినదో హెచ్చినదో చెప్పజాలము. ఒక పెద్ద నిట్టూర్పుతో శాంత యాతనితో నాలుగడుగులు నడచి, యాతని నా యంధకారమున విడచి, భర్తతో గృహము జొచ్చెను. పిమ్మట, చాలసేపటివఱకు భార్యాభర్తలు తమ గదియందు సంభాషించుకొనుట మేడమీది తన గదినుండి అనిద్రావస్థయందుండిన హేమ వినుచునే యుండెను.

మరునాటి యుదయమున నే కృష్ణమోహన్ తనతోడి న్యాయవాదియైన బాలచంద్రదేవ్ గృహమునకు బోయెను. బాలచంద్రదేవ్ ఆతని కెదురేగి సగౌరవముగ లోనికి దోడ్కొనిపోయి యాసీనుగావించి, "ఆర్యా! మీరాక కేదియో విశేషకారణమే యుండవలయును. సెలవిండు." అని సవినయముగ నర్థించెను.
కృష్ణ:- అగును. ఒక విశేషకారణమే తటస్థించినది. ఇచ్చట మన సంభాషణము రహస్యముగానే యుండునా ?
బాల:- సందేహము లేదు. సెలవిండు.
కృష్ణ:- నేను మీయొద్దకు కార్యార్థినై వచ్చితిని. కాని, ఆ విషయము మీతో జెప్పుటకుపూర్వము మీరు నాకొక వాగ్దానము జేయవలయును.

బాల:— సెలవిండు.

కృష్ణ:— నేను చెప్పబోవునది ఒకవేళ మీ కంగీకారము కానిచో, నేను విచారింపను కాని, దానిని గుప్తముగ నుంచెదనని మాత్రము మీరు వాగ్దానము చేయగోరెదను.

బాల:— తప్పక అట్లే యుంచెదను. బహుశః, అది మీరు స్వీకరింప గోరని యొక యభియోగమై యుండును.

కృష్ణ:— అగును.

బాల:— ఏమది ?

కృష్ణ:— బహుకాలము క్రిందట ఈ పరిసర వనమందిరమునందు సంభవించిన ఒక హత్యావిషయము.

బాల:— (విస్మితుడై) ఓహో ! ఆ హత్యావిషయమా ? నాకు జ్ఞప్తి యున్నది. హరిహరరాయల కుమారుడు నరేంద్రుడే ఆ హంతకుడని ఋజువుచేయబడినది. దానిసంబంధ మింక నేమున్నది ?

కృష్ణ:– ఉన్నది. ఇంతకాలమైన పిమ్మట కొన్ని విశేషములు బయటపడినవి. ఆ హంతకుడు నరేంద్రుడు కాడనియు, మరియొకడనియు, ఇప్పుడు స్పష్టమగుచున్నది.

బాల:— అట్లు మీకు స్పష్టముగ గోచరించుచున్నదా ?

కృష్ణ:— అగును. కొన్ని రోజుల క్రితమే అజ్ఞాతవాసమునందున్న నరేంద్రుడు నన్నొకసారి కలసి తాను నిరపరాధి ననియు, ఆ హంతకుడు గౌరి యను పేరుగలవా డొకడనియు చెప్పెను. అతడు చెప్పిన విషయములనుబట్టి అది యథార్థమే యని నాకు తోచినది. తదుపరి దానిని ధ్రువపరచుచు మరికొన్ని ప్రమాణములు నాకు క్రమక్రమముగ గోచరించినవి. ఇప్పుడు అతడు కేవలము నిర్దోషియని నేను నిస్సందేహముగ చెప్ప గలను. ఆ గౌరి నివాసాదికములు నేనెఱిగియుండినచో, చాల కాలము క్రిందటనే నేను వానిని రచ్చ కీడ్పించి యుందును. ఇప్పుడు అన్నియు తెలిసినవి.

బాల:— ఇప్పుడు వాడు మీ కంటబడెనా ?

కృష్ణ:— అగును. ప్రస్తుతము వా డీ గ్రామమునందే యున్నాడు. కాని, ఇప్పుడు నేను స్వయముగ వానిపై చర్యసాగింపజాలను.

బాల:— కారణము ?

కృష్ణ:— కారణము ముందు ముందు మీకే తెలియగలదు. నేను పని చేయజాలనని నరేంద్రునితో జెప్పితిని. మీ యొద్దకు వెళ్ళుమని చెప్పితిని. తాను మిమ్ము కలియుటకు పూర్వము, నేను మిమ్ము కలసి ఆ విషయమై మాటలాడుదునని వాగ్దానము జేసితిని. మీరు సమ్మతించినచో ఆతడు మిమ్ము కలసి తన కథయంతయు నిరవశేషముగ విన్నవించుకొనును. అది మీరు వినిని పిదప, ఒకవేళ మీరంగీకరింపనిచో, ఆతని రాక మాత్రము రహస్యముగ మీ రుంచెదరుగాక యని నే నర్థించుచున్నాను.

బాల:— ఆర్యా! సందేహింపకుడు. నేను వాగ్దానము జేయుచున్నాను. ఆతని నోట అంతయు విన్నపిదప, నాకు విశ్వాసము కలిగినచో, తప్పక నే నాతని పక్షమున పనిచేయుదును.

కృష్ణ:— సంతోషము. నరేంద్రుడు మిమ్ము జూచుట కెప్పుడు వీలగునో చెప్పుడు.

బాల:— ఆత డిప్పు డీ గ్రామమునం దున్నాడా ?

కృష్ణ:— లేడు. కాని, మీరు కోరిన సమయమునకు వాని నిటకు రప్పించెదను. ఈ రాత్రి మీ కవకాశముండునా ?

బాల:— మంచిది. ఈరాత్రి తొమ్మిది గంటలకు రమ్మనుడు. ఆతని కేమియు అపాయ ముండదు.

కృష్ణ:— మంచిది. ఇంక నాపని తీరినది. ఈపై వాని కార్యభారము మీది.

అని మందహాసము జేయుచు లేచెను. బాలచంద్రదేవ్ ఆతని వీథిద్వారము వఱకు అంపకము పెట్టి వచ్చెను.

## అ ధ్యా య ము 23

ఆ రాత్రి యథోక్తముగా నరేంద్రుడు ఎనిమిదిగంటలవేళకు సువర్ణదుర్గమునకు వచ్చి శాంతాకృష్ణమోహనులను గలసెను. కృష్ణమోహన్ వానికి ధైర్యము గొల్పి వెంటనే బాలకృష్ణదేవ్

గృహామునకు బంపెను. వాని రాకకై యెదురుచూచుచుండిన యా న్యాయవాది వానిని లోని కాహ్వానించి కూర్చుండ నియమించెను. అటుపై వానినోట యావద్ వృత్తాంతమును విని, చాలవఱకు సంతృప్తుడై యిట్లు ప్రశ్నించెను.

"నరేంద్రా! నీవు చెప్పిన దంతయు విశ్వసించుచున్నాను. కాని, ఆ గౌరియే యీ రమాపతి యను నిర్ధారణమేమి?"

నరేం:— అయ్యా! ఆ విషయమున దీక్షిత్ సాక్ష్యమును గ్రహింప వచ్చును. ఆత డిష్టపడకున్న, అభిరామసింగ్ సాక్ష్యమును గ్రహింపవచ్చును.

బాల:— అభిరామసింగ్ ఈ విషయ మెఱుగునా? ఆ, ప్రస్తుతము నాయొద్దనే పనిచేయుచున్నాడు.

నరేం:— ఆతడు బాగుగా నెఱుగును. ఆ దినములలో అభిరామసింగ్ గౌరిని చాలసార్లు చూచియుండెను. ఆ గౌరియే యీ రమాపతి యని యాతడు గుర్తించినట్లు నేను వినియున్నాను.

బాల:— అట్లనా?—మంచిది. ఇప్పుడే యాతని రప్పించి తెలుసుకొనెదను.

నరేం:—(భయముతో) వలదు. నేనుండగా వలదు. నేను వెడలి పోయిన పిమ్మట ఆతని రప్పింపుడు.

బాల:—(చిరునవ్వుతో) భయపడకు నరేంద్రా! చిలుక నుంచిన పంజరములోనికి పిల్లిని రానిత్తునా? నీవీ ప్రక్కగదిలోనికి పోయి కూర్చుండుము.

అని యాతని బంపి, అభిరామసింగును తోడ్కొని రమ్మని యొక పరిచారకుని బంపెను. పది నిముషములలో అభిరామసింగ్ వచ్చెను.

బాల:— అభిరామ్! ఒకటి రెండు ప్రశ్న లడుగుటకు నిన్ను బిలిపించితిని. ఈ రమాపతి పూర్వ మింకేమైన పేరుతో వ్యవహరించి యుండెనా?

అభి:— 'గౌరి' యను పేరుతో వ్యవహరించి యుండెను.

బాల:— ఎప్పుడు?

అభి:— బహుకాలము క్రిందట. ఈ సమీప వనమందిరమునందు హత్య యొకటి జరిగియుండెను కదా! ఆ దినములలో, ఆ వనమందు ప్రతి సాయంకాలమును నేను నీనిని చూచుచుంటిని.

బాల:— అచ్చటికి వా డేల వచ్చుచుండెనో చెప్పగలవా ?

అభి:— (నవ్వుచు) చాలమంది యువకులు అచ్చటి కేల పోవుచుండిరో, అందుకే వాడు సహిత మెచ్చట నుండియో వచ్చుచుండెను. హత్యగావింపబడిన అమీర్‌జాన్ కుమార్తె అమీనా కొఱకు!

బాల:— నీవేల ప్రతి సాయంకాలము నచ్చటకు పోవుచుంటివి ?

అభి:— (నవ్వుచు) అందుకే!

బాల:— మీ యందఱకు అమీనా ఆతిథ్య మిచ్చుచుండెనన్నమాట!

అభి:— అంత యదృష్టము అప్పుడు పొందినవాడు ఒక్క గరియే!

బాల:— సరియే. వాడే యీ రమాపతి యనుటలో నీ కేమియు సందేహము లేదు!

అభి:— ఏమియు సందేహము లేదు.

బాల:— న్యాయస్థానమునందు ప్రమాణము జేసి యీ విషయము నీవు చెప్పగలవా ?

అభి:— తప్పక చెప్పగలను.

బాల:— మంచిది. ఇంక నీవు పోవచ్చును. మన సంభాషణము అత్యంత రహస్యముగ నుండవలయును సుమా!

"చిత్తము" అని యభిరామసింగ్ వెడలిపోయెను. పిమ్మట చాలరాత్రివఱకు బాలచంద్రదేవ్ నరేంద్రునితో సంభాషించుచుండెను. అతడు చెప్పిన సమస్తవిషయములను వ్రాసుకొనెను. పిమ్మట, "నరేంద్రా! నీవింక పోవచ్చును. నీ విముక్తికై నేను యధాశక్తి ప్రయత్నించెదను." అని యాతనికి ధైర్యముగొల్పి పంపివైచెను.

ఆ మరుసటి దినమంతయు నాతడు ఈ ప్రయత్నమునందే నిమగ్నుడై యుండెను. కృష్ణమోహన్ యొక్క కచేరి గృహమునకు బోయి యాతనితో సుమారు మూడుగంటలసేపు రహస్యముగ సంభాషించెను. కావలసిన సర్వసామగ్రియు సిద్ధము జేసుకొని యామరునాడు న్యాయస్థానమునకు బోయి అమీరుజాన్ హత్యానేరమును

పునర్విచారణము జేయుటకు అంకురార్పణ మొనర్చెను. ఈ కార్య కలాప మంతయు అతిరహస్యముగ జరుపబడెను. నగరవాసు లెవ్వరికిని ఆ విషయమే తెలియదు.

ఆ మరునాడే ఎన్నిక. పురమందిరమునందు ఎన్నిక జరుగును. కల్యాణనగరమంతయు చాలసందడిగా నుండెను. ఇరుపక్షములవారును విరామములేక నగరవీధులలో గుంపులు గుంపులుగా తిరుగుచుండిరి. వాతావరణ మంతయు "కృష్ణమోహన్‌కు జై! రమాపతికి ఛీ!" అను నినాదములతో నిండియుండెను.

సాయంకాలమైనది. రమాపతి మిత్రవర్గముతో గలసి పుర మందిరమువైపు కాలినడకను పోవుచుండెను. ఒక యల్లరిమూక యేవేవో చిల్లరచేష్టలతో, పరిహాసములతో, అట్టహాసములతో, వారివెంట నంటియుండెను. పురమందిరపు పరిసర ప్రదేశమంతయు ప్రజాసంఘములచే క్రిక్కిరిసియుండెను. ఇరుకెలంకులభవనప్రాంగణ ములు, మేడలు, మిద్దెలు, అన్నియు స్త్రీజన సమ్మర్దముచే కిటకిట లాడుచుండెను. కృష్ణమోహన్ కచేరి చావడి యందు కృష్ణమోహన్ కుటుంబ మంతయు ఆ వేడుక జూచుటకై వచ్చి కూర్చుండి యుండిరి. వారితో హేమసహితము వచ్చి యుండెను. ఆ వేడుకచూచుట కామె కెట్టి యుత్సాహమును లేకుండెను. రోగగ్రస్తుడై యున్న బిడ్డను విడచి యింట నుండజాలక వారితో నచ్చుటకు వచ్చెను. గ్రామమంతటను మహోత్సవమువలె నుండెను. కాని, ఆమె హృదయమునందు మాత్రము ఒక భయంకర మైన తుపాను రేగుచుండెను. కృష్ణమోహన్ అక్కగారు ఆమెను జూచి, "హేమా! లజ్జాలేశములేని ఆ నరపశువు రమాపతికి నేడు బహిరంగముగ కానున్న శుద్ధక్షౌరమును జూచి యానందించుటకు వచ్చియున్న ఆ జనసమ్మర్దమును జూడుము." అని హెచ్చరించెను. హేమ, "అమ్మా! విశేషమేమున్నది? ఎవరికైన కర్మఫలము ననుభవింపక తప్పదు." అని హీనస్వరముతో మారుబల్కెను.

"కృష్ణమోహన్‌కు జై!" అను ప్రజాఘోషములు మిన్ను ముట్టుచుండెను. త్రోసికొనుచు గుంపులు గుంపులుగా ప్రజలు పుర

మందిరపు ఆవరణములోనికి జొచ్చుచుండిరి. వసారాపై నొక ప్రక్క రమాపతి తన మిత్రవర్గముతో నిలచియుండెను. ముఖముపైకి జారు చుండిన ముంగురులను క్షణక్షణమును పైకెగద్రోసికొనుటయందు తన వ్రేలినున్న వజ్రపు టుంగరము తళుక్కు తళుక్కు మనుచు చూపరుల దృష్టి నాకర్షించుచుండెను.

ఇంతలో ఒక రక్షక శాఖోద్యోగి మూకను త్రోసికొనుచు వడివడిగా వచ్చి రమాపతిని సమీపించి యాతని భుజముపై జేయి వైచి, "అయ్యా! ఈ క్షణమునుండియు మీరు మా ఖైదీ!" అని పల్కెను. ఈ పల్కులు వెల్వడినంతనే ఆ సమీపమందున్న ప్రజా సమూహ మంతయు నిశ్శబ్ద మయ్యెను. క్రమక్రమముగ ఆ యావరణ మంతయు నిశ్శబ్దమై పోయెను. కొన్ని క్షణములవఱకు రమాపతి నోటమాట రాలేదు. ఈ నిర్బంధమునకు కారణము ఎవ్వరు నూహింప జాలకపోయిరి. రమాపతి మానసము పరిపరి మార్గముల పరుగులిడ సాగెను. ముఖము జేవురించెను. ఆగ్రహావేశమున నాతడు "ఎవరు నీవు?" అని యా యుద్యోగిని ప్రశ్నించెను. ఇంతలో నిద్దఱు రక్షక భటులు వచ్చి యాతని చేతులకు సంకెలలు బిగించిరి. ఇది చూచు చున్న ప్రజాసమూహ మంతయు విస్మయభరిత మయ్యెను. రమాపతి మిత్రవర్గము సుమా రొక పదిమంది యా రక్షకోద్యోగిని "ఏమిది?" అని తీవ్రముగ ప్రశ్నించిరి. అంత నాతడు, "అయ్యా! ఇందఱిలో ఈతని శృంఖలా బద్ధుని జేయవలసి వచ్చినందుకు చింతించుచున్నాను. ఇదిగో, న్యాయస్థానపు ఆజ్ఞాపత్రము! అయ్యా! రమాపతీ! అమీరొ ఖాన్ హత్యాసందర్భమున మీపై ఇప్పు డారోపింపబడిన హత్యా నేరమునకు నేను మిమ్ము నిర్బంధించుచున్నాను. క్షమాపణకు దయ చేయుడు," అని సగౌరవముగనే పల్కెను. రమాపతి ముఖము వివర్ణమయ్యెను. చిక్కిన నెత్తురు లేదు. ముంజేతికి తగిలియున్న యినుప సంకెళ్ళను జూచి వ్రేలినున్న వజ్రపు టుంగరము కలకల నవ్వుచుండెనో, వలవల యేడ్చుచుండెనో చెప్పజాలము. ముఖముపై నొకానొక బిభీషిక, ఒకానొక ప్రేతకళ తాండవింప సాగెను. ఉద్రేక పూరితములైన శూన్యదృష్టులతో నలువైపులను జూచుచు నిలువ బడెను. సమావేశమైన సమగ్ర జనసమూహపు దృష్టియు నాతనిపై

కేంద్రీకరింపబడెను. ఒక పెద్ద నిట్టూర్పు విడచి, సమీపమునందే నిలచియున్న దీక్షిత్ వైపు జూచి, రమాపతి "ద్రోహీ! దీనికి కారణము నీవు!" అని గ్రుడ్లెఱ్ఱ జేసెను.

ఈ మాటలకు, "లేదు. ప్రమాణము చేసెదను," అని దీక్షిత్ ప్రత్యుత్తర మిచ్చెనో లేదో, ఇంతలో మరియొక రక్షకోద్యోగి వచ్చి దీక్షిత్ భుజముపై చేయివైచి, "అయ్యా! అమీన్‌జాన్ హత్యసంబంధమున మీరు రమాపతికి సహకారులైన నేరముపై ఇప్పుడు మీరు నిర్బంధింప బడినారు," అని యాజ్ఞాపత్రమును జూపెను. తక్షణమే యిద్దరు రక్షక భటులు వచ్చి యాతని చేతులకు బేడీలు వైచిరి.

"అయ్యా! ఆ విషయము నా కేమియు తెలియదు. నేను ప్రమాణము చేసెదను," అని దీక్షిత్ బిక్కమొగముతో చెప్పుకొనెను.

"కావచ్చును. న్యాయస్థానమునందు మీ రది ఋజువు పరచుకొనుడు. అంతవఱకును మీరు మా నిర్బంధమునం దుండక తప్పదు. అయ్యా! మేమేమి చేయుగలము?" అని సగౌరవముగ బదులు పల్కెను.

అనంతరము శృంఖలా బద్ధులైన యా యిర్వురు ఖైదీలతో ఆ రక్షకోద్యోగులు రాజమార్గమున క్రిక్కిరిసియున్న ప్రజానీకమును భేదించుకొనుచు ఠాణావైపు నడువసాగిరి. ఎన్నిక వినోదమును చూడవచ్చిన యా జనసమూహ మంతయు ఈ యంతర్నాటకమును జూచుచు ఆ ఖైదీలవెంట గుంపులు గుంపులుగా పోవసాగిరి. వారి యానంద వికటాట్ట హాసములతో, ఉద్రేక భాషణములతో, వాయుమండలము నిబిడీకృత మయ్యెను.

ఈ యావద్ విశేషములను తమ కచేరి చావడినుండి చూచుచుండిన శాంతయు, కృష్ణమోహన్ అక్కగారును, ఆనంద పారవశ్యమున మైమరచి పోయిరి. నిరుత్సాహియై యేదో మరొక లోకమునందున్న హేమనుజూచి, శాంత, "హేమా! ఇంతకాలము నకు దైవానుగ్రహము కల్గినది! నిష్కారణముగ హత్యానేర

మారోపింపబడి, విదేశగామియై, అజ్ఞాత వాసము జేయుచున్న నా సోదరుడు నరేంద్రుడు తిరిగి తలయెత్తుకొని మామధ్య తిరుగు శుభ సమయము వచ్చినది! ఓహో! ఎన్ని దీర్ఘవర్షములు నిష్కారణ యాతనకు వాడు పాల్పడెను! వాని విముక్తికై నా వివాహమునకు పూర్వము ఎన్నిసార్లు నేను కృష్ణమోహన్ సహాయ మపేక్షించి యాతనితో రహస్య సంభాషణములను జేసియుంటిమి! మా రహస్య సమావేశములకు లోక మన్యథా తలంచునను భీతి సహితము నాకు లేకుండెను! ఆ పూర్వసంఘటనము లన్నియు తలచుకొనిన ఇప్పుడు నా శరీరము జలదరించుచున్నది!'' అని యానందోద్రేకమున జెప్పసాగెను. ఆ వాక్యములు వినుచున్నంతకాలమును హేమ ముఖమునందొక విపరీతమైన యావేగము స్ఫురించుచుండెను. ఏదో యొక మహాపరాధమును తాను కావించినట్లు ముఖలక్షణములు పొడగట్టుచుండెను. ఆమె యంతర్నేత్రముల యెదుట యేమేమి దుఃఖకర దృశ్యములు పొడగట్టెనో గాని, చూచుచుండగనే యామె కన్నులనుండి బాష్పధారలు స్రవింపజొచ్చెను. అన్యాక్రాంత చిత్తయై యున్న శాంత యది కనిపెట్టనే లేదు.

ఇంతలో కృష్ణమోహన్ అచ్చటకు వచ్చి, మందహాసము జేయుచు, ''శాంతా! మీరిప్పుడు కండ్లార జూచిన వినోదములు నేను తిరిగి చెప్పనవసరము లేదుకదా! మీరు చూడని విషయము చెప్పెదను. ఎన్నిక కార్యక్రమము పూర్తియైనది.''

శాంత:— ఏమైనది? ఎవరు నెగ్గిరి?

కృష్ణ:— ఎవరు నెగ్గిన నీవు సంతోషించెదవు?

శాంత:— (నవ్వుచు) ఆ రమాపతి నెగ్గిన నేను సంతోషించెదను. వాని చేతికి బేడీలు వేయించినారే, పాపము! మీరే గెలిచినారా?

కృష్ణ:— శాంతా! నేను గెలుచుట యేమి? వాడే నన్ను గెలిపించినాడు!

ఇచ్చట నీ సంభాషణము జరుగుచుండగనే, ''కృష్ణమోహన్ కు జై!'' అను కేకలు నగరమందంతటను మారుమ్రోగుచుండెను.

విజయఘోషములతో నభినందించుటకు యావద్ బంధు మిత్రవర్గ మును అచ్చటకు వచ్చిరి. తదనంతరము అందరును కలసి ప్రజా సంఘముల విజయ వాద్యములతో సువర్ణదుర్గమును జేరుకొనిరి. అంతకు బహుకాలము పూర్వమే దీక్షిత్ రమాపతులు ప్రజాసంఘ ముల ఛీత్కారములతో, పరిహాస వికటనాదములతో కారాగృహ మును జేరుకొనిరి. కృష్ణమోహన్ కంఠమున పుష్పహారములు! రమాపతి ముంజేతుల ఇనుప సంకెలలు!

ఈ దృశ్యమును, ఆ దృశ్యమును కూడ చూచుచు నివ్వెరపడి యొక యింటిముంగిట వన్నెలవిసనకఱ్ఱవలె నిలచియున్న యొకానొక స్త్రీ, జనసమూహపు దృష్టి నాకర్షించుచుండెను. ఆమె పూర్వ హత్యాకాండమున కథానాయికయైన అమీనా! హత్యగావింప బడిన అమీర్ జాన్ కుమార్తె! ఏ వ్యక్తి కారణమున ఇంతకాలమును నరేంద్రుడు అజ్ఞాతవాసమున తలదాచుకొని యున్నాడో, ఏ వ్యక్తి కారణమున ఇప్పుడు రమాపతి కారాగృహ ప్రవేశముచేసి యున్నాడో, ఆ వ్యక్తియే యామె! హత్యజరిగిననాటి రాత్రియే యీమె యంతర్ధానమయ్యెను. నరేంద్రునితో గలసి యామెయెచ్చటికో పరారియైపోయెనని కల్యాణనగరవాసు లందఱును తలంచియుండిరి. తిరిగి యింతకాలమునకు ఈమె కల్యాణనగరమున ప్రత్యక్షమయ్యెను. ప్రాతపరిచయస్థు లనేకు లామెనుజూచి యించుక విస్మితులై దూరము నుండియే చూపులతో నామెను పలుకరించి పోవుచుండిరి. కాని, ఎవ్వరి పలుకరింపులను ఆమె స్వీకరించుటలేదు. ఇంతలో నొకవైపు నుండి అభిరామసింగ్ మెల్లగ నామెచెంతకు వచ్చెను. ఆతనిజూచి యామె తిరస్కార సూచకముగ పెడమొగము పెట్టెను. అంత అభిరామసింగ్, "అమీనా! ఎంత కాలమునకు తిరిగి నీవు కంటబడి తివి! నీవు నరేంద్రునితోగలసి యెచ్చటికో పరారియైతివని అంద ఱును భావించిరి.

అమీనా:- (ముఖము చిట్లించుకొని) నేను నరేంద్రునితో గలసి పోయితినా? నాతండ్రిని చంపిన నరేంద్రునితోనా?

అభి:- నా యభిప్రాయము మాత్ర మది కాదు. పోనిమ్ము. ఎచ్చట నుండి యిప్పుడు నీ రాక?

అమీనా:- నేనిప్పు డొక జమీందారిణియొద్ద పనిచేయుచున్నాను. ఆమె దేశయాత్ర చేయుచు ప్రస్తుతము ఈ యూరి పొలిమేర నున్న బంగాళాయందు బసచేసియున్నది. కల్యాణనగరమునం దీసందడి యేమా యని చూడవచ్చితిని.

అభి:- చూచితివా?

అమీనా:- చూచితిని. కాని, ఆ రమాపతికి అన్యాయము జరిగినది. అంత పెద్దమనిషిపై అట్టి యపనిందవైచి బేడీలు వేయుట తగదు.

అభి:- ఆ పెద్ద మనిషి మీ తండ్రిని చంపిన పెద్దమనిషి యని రేపు ఋజువు కానున్నది!

అమీనా — అసత్యము! నా తండ్రిని చంపిన ద్రోహి నరేంద్రుడు!

అభి:- సత్యాసత్యములు రేపు న్యాయస్థానమున తేలిపోవా? నీవు కూడ రేపు న్యాయస్థానమునకు వత్తువుకదా!

అమీనా:- ఏల? నాకేమి సంబంధము?

అభి:- నీ తండ్రిని చంపిన నేరముకదా! నీ సాక్ష్యము కూడ పనికి వచ్చును.

అమీనా:- నాకేమియు తెలియదు. నేనేమియు సాక్ష్యము చెప్ప జాలను.

అని యింక నాతనితో సంభాషణమును చాలించి, వడివడిగా ఆ స్థలమును విడచిపోయెను. అభిరామసింగ్ తక్షణమే పోయి, తన యధికారియైన న్యాయవాది బాలచంద్రదేవుతో అమీనా ప్రస్తుతము గ్రామమందున్న వార్తను తెలిపి తదనంతర కార్యక్రమము నాతనికి వీడచెను.

అమీనాకు ఆనాటి రాత్రియంతయు నిద్రలేదు. మరునాడు జరుగనున్న న్యాయ విచారణమునందు తనకెట్టి నిర్బంధము కలుగునో యని యామె భయపడెను. మరునా డుదయము ఏదో మిష జెప్పి తన యధికారిణి యనుజ్ఞబొంది గ్రామాంతరము బోవుటకు ఆమె బయల్వెడలి కొంచెము దూరము సాగినంతనే యొక రక్షక భటుడు వచ్చి యామె చేయి బట్టుకొనెను.

"ఎవరు నీవు? చేయి విడువుము," అని యామె గర్జించెను.

"ఓహో! పతివ్రతాశిరోమణీ!!" అని వాడు నవ్వుచు, "రమ్ము, రమ్ము. ఈ నాటి విచారణమునందు నీవు సాక్ష్యము చెప్పవలసియున్నది. ఇదిగో, న్యాయస్థానపు ఆజ్ఞ! రమ్ము, పోవుదము." అని పల్కెను. ఈ మాటలకు నీరు జల్లిన నిప్పువలె అమీనా చల్లబడి నోట మాటరాక నిలచిపోయెను.

"ప్రయోజనములేదు, వచ్చితీరవలెను," అని వాడు తొందర జేసెను.

"నాకేమియు దెలియదు. నేను సాక్ష్యము చెప్పజాలను," అని యామె మారుబల్కెను.

"అది యంతయు నాకు దెలియదు. ముందు నడువుము. లేదా, బలవంతముగ నేను నిన్నీడ్చుకొని పోవలసి యుండును." అని బింకముగ చెప్పెను. చేయునదిలేక, ఎఱ్ఱబారిన ముఖమును వంచుకొని, తోట్రుపాటుతో, రక్షకభటునితో గలసి న్యాయస్థానమునకు నడచెను. అచ్చట నొక చిన్న గదియందు, ఇద్దఱు రక్షకభటుల కాపుదలక్రింద నామె నుంచిరి.

తన తండ్రిని జంపిన హంతకుడు గౌరి యని యామె యెన్నడును భావించి యుండలేదు. ఆ హంతకుడు నరేంద్రుడే యని యామె నిశ్చితాభిప్రాయము. ఆ నేరమునకు ఇప్పుడు గౌరిని, అనగా, రమాపతిని నిర్బంధించుట అన్యాయమనియే యామె భావించుచుండెను. అంతయు ఆమె కగమ్యగోచరమై యుండెను.

## అధ్యాయము 24

ఆనాటి న్యాయ విచారణమును జూచుటకు నగరము నందలి భద్రజను లనేకులు వచ్చియుండిరి. ఆవరణమంతయు సామాన్య జనసంఘములచే కిటకిట లాడుచుండెను. న్యాయస్థానమునం దొక నియమిత స్థలమునందు ఖైదీలిద్దఱును నిలచి యుండిరి. న్యాయవాదు లందఱును యుక్తాసనములపై నాసీనులై యుండిరి. రమాపతి పక్షమున వాదింపవచ్చిన రహీంసాహెబును, నరేంద్రుని పక్షమున

వాదింపవచ్చిన బాలచంద్రదేవును ముఖాముఖి కూర్చుండి యుండిరి. వేదికపై న్యాయపీఠమునందు న్యాయాధిపతి హరిహరరాయలు మొగము బిగించుకొని యాసీనుడై యుండెను. అంతయు నిశ్శబ్ద ముగా నుండెను. విచారణము ప్రారంభమయ్యెను.

బాలచంద్రదేవ్ నిలచి తన యభియోగమును న్యాయపీఠము సమక్షమున వివరించి, అమీర్ జాన్ అను వ్యక్తిని హత్య గావించినది పూర్వవిచారణమునందు అపరాధిగా భావింపబడిన నరేంద్రుడు కాడనియు, గౌరి యను పేర ఆ సమయమున వ్యవహరించుచుండిన యీ ఖైదీ రమాపతి యనియు, తాను ఋజువుచేయ సిద్ధముగా నుంటి ననియు చెప్పి కూర్చుండెను. ఆనాటి గౌరియే యీనాటి రమాపతి యని ఋజువుపరచుటకు ప్రథమసాక్షిగా అభిరామసింగ్ బోనెక్కెను. ఆ సాక్షివిచారణమును న్యాయమూర్తి హరిహర రాయలే స్వయముగ జరిపెను.

హరి:— ఈ ముద్దాయి రమాపతి గూర్చి నీకేమి తెలియును?

అభి:— విశేష మేమియు తెలియదు. ఇతడు 'గౌరి' యను పేర వ్యవ హరించు చున్నప్పుడు నే నీతని నెఱుగుదును. అమీర్ జాన్ గృహమునకు ఈతడు తఱచు పోవుచుండెను.

హరి:— ఆతని పేరు గౌరి యని నీ కెట్లు తెలిసినది?

అభి:— అమీర్ జాన్ కుమార్తె అమీనా చెప్పినది.

హరి:— ఆమెను నీకును పరిచయ మున్నదా?

అభి:— చిత్తము.

హరి:— ఈతని సంబోధించి నీ వెప్పుడైన మాటాడి యుంటివా?

అభి:— రెండు మూడు సార్లు ఆమె యింటి ముంగిటనే మాటాడి యుంటిని.

హరి:— 'గౌరి' యని యాతని నింకెవ్వరైన సంబోధింపగా నీవు విని యుంటివా?

అభి:— వినియుంటిని. ఆ రెండవ ముద్దాయి దీక్షిత్ సంబోధించుటయు ఈతడు మారు పల్కుటయు వినియుంటిని. మరియు, హత్య గావింపబడిన అమీర్ జాన్ ఒకసారి, "ఈ గౌరి నా గడప

స్త్రీ 'క్కినచో నేను సహింపను'' అని అమీనాతో చెప్పు చుండగా నేను వింటిని.

హరి:— సరియే. గౌరి ఆ యింటికి తఱచుగా నేల పోవుచుండెనో చెప్పగలవా ?

అభి:— అతడు అమీనాను ప్రేమించి యుండెను. నేనుకూడ అదే పనిమీద అచ్చటకు పోవుచుంటిని.

హరి:— ఆ వ్యవహారమున మీ యిద్దఱకు నేమేని వైరము తటస్థించి నదా ?

అభి:— ప్రయోజనమేమి ? ప్రథమ తాంబూలము ఈతనిదే యగుటచే నే నీతనితో కలహించిన లాభమేమి ?

హరి:—హత్యజరిగిననాటి సాయంకాలము నీవీతని నచ్చట చూచితివా?

అభి:— లేదు. ఆనాడు నే నచ్చటకు పోలేదు.

హరి:— ఈతడే హత్య చేసియుండునను సందేహము నీ కెప్పుడైన కలిగినదా ?

అభి:— ఎప్పుడును కలుగలేదు.

హరి:— ఇప్పుడు, ఇంతకాలము గడచిపోయిన పిమ్మట, ఆ గౌరియే యీ రమాపతి యని నిస్సంశయముగ చెప్పగలవా ?

అభి:— నిస్సంశయముగ చెప్పగలను.

హరి:— అసంభవము. ఈ మధ్యకాలమున ఒకసారియైన నీ వీతని జూడకయే ఆ విషయ మెట్లు చెప్పగలవు ?

అభి:— చూడకయే నేను చెప్పుట లేదు. ఒకసారి చూచితిని.

హరి:— ఎప్పుడు ? ఎచ్చట ?

అభి:— హత్యానంతరము సుమారు పదునెనిమిది మాసములై యుండును, కలకత్తాయందు జూచితిని.

హరి:— పొరపాటు పడితివేమో !

అభి:— (నవ్వుచు) ఏమియు పొరపాటు లేదు. ఆ గౌరియే !

హరి:— ఆ గౌరియే యీ రమాపతి యని యెప్పుడు తెలిసికొంటివి ?

అభి:— ఇప్పుడు, ఈ యెన్నిక సందర్భమున ఆతని చూచువఱకు, ఈతనికి రమాపతి యని మరియొక పేరు కలదని నాకు తెలియదు.

హరి:— మంచిది. ఇప్పటికి నీవు పోవచ్చును.

అభిరామసింగ్ బోను దిగి బయటకు పోయెను. పిమ్మట, అమీనా విచారణము ప్రారంభమయ్యెను. బాలచంద్రదేవ్ నిలచి యామెను ప్రశ్నింపజొచ్చెను.

బాల.— నీవు అమీర్‌జాన్ కుమార్తె అమీనా ?

అమీనా:— అగును.

బాల:— ఆ గౌరికిని నీకును——

అమీనా:— (ముఖము చిట్లించుకొని) అదిగో, ఆవిషయము మీకేల ?

బాల:— ప్రమాదములేదు. అమీనా! అడిగిన ప్రశ్నకు సమాధానమిమ్ము. ఇంత చక్కని ముఖమును జూచి యెవ్వరు ప్రేమించరు ? గౌరి నిన్ను ప్రేమించెను. ప్రతి సాయంకాలమును నీయొద్దకు వచ్చుచుండెను. అగునా ?

అమీనా:— (తన యందము కొనియాడబడినందుకు మురిసి) అగును. అయిన ?

బాల:— అది, నిన్ను ప్రేమించిన చాలమందికి కన్నెఱ్ఱనై యుండెను; కాదా ?

అమీనా:— కావచ్చును.

బాల:— కానచ్చును. నెమిలియు నెమిలియు జతకూడుచుండ కాకులకు కన్నెఱ్ఱ! దానికేమికాని, ఆ గౌరికి రమాపతి యను నామాంతర మున్నదని యప్పుడు నీకు తెలియుదు; కాదా ?

అమీనా:— తెలియదు. తనపేరు గౌరి యని యాతడు చెప్పెను.

బాల:— ఆతని నివాసస్థలము ?

అమీనా:— తెలియదు. ఆ విషయము నే నడుగలేదు, ఆతడు చెప్పలేదు. ఏదో పరిసరగ్రామమే యని నే ననుకొంటిని.

బాల:— పోనిమ్ము. ఆతని యసలుపేరు రమాపతి యని తరువాత నెంత కాలమునకు నీవు తెలుసుకొంటివి ?

అమీనా:— స్వల్పకాలమునకే. కొన్ని మాసములై యుండును.

బాల:— మీ తండ్రి హత్య జరిగిన కొద్దికాలమునకే యనుకొందును.

అమీనా:— అగును.

శాల:— అగును. క్రొత్తరికమున కొంత దాపరికము కాని, కలసి మెలసి యున్న పిమ్మట అసలు పేరు దాచవలసిన యవసర మేమున్నది ? సరియే ఆ హత్య జరిగిన నాటి సాయంకాల మున గౌరి కాక, ఇంక నెవ్వరైన ఆ వనమునం దుండిరా ?

అమీనా:— నరేంద్రు డుండెను. మరియు, దీక్షిత్, రామసింగ్ కూడ నుండిరి.

శాల:— దీక్షిత్, రామసింగ్, కూడ నీకెఱుకు —

అమీనా:— ఛీ ! వారా ?

శాల:— పోనిమ్ము. ఆ సాయంకాలము నీయింట గౌరియుండెనా, లేక నరేంద్రుడా ?

అమీనా ఈ ప్రశ్నకు కొంచెము సంకోచింప సాగెను. ఏమి చెప్పిన ఏమి ప్రమాదమో ! అంత న్యాయాధిపతి హరిహర రాయలు ఆమెతో, "సాక్షీ ! ప్రమాణము చేసితివి. నిజము చెప్పుము. నరేంద్రుడు అప్పుడు నీ యింటిలో లేడా ?" అని తీక్ష్ణముగ ప్రశ్నించెను ?

అమీనా:— (ఉలికిపడి) లేడు. గౌరి యుండెను.

శాల:— అప్పుడు నరేంద్రు డెచ్చట నుండెను ?

అమీనా:— నాకు తెలియదు. ఆతడు మా యింటికి వచ్చెను కాని, నేనాతని బంపివైచితిని. ఆ వనమునందే యెచ్చటనో యుండి యుండును.

శాల:— ఆతడు నీయొద్ద నొక తుపాకి విడిచిపోయెనా ?

అమీనా:— అగును. దానిని మా తండ్రి కిమ్మని చెప్పెను. అందు తోటా అమర్చబడి యున్నదని కూడ చెప్పిపోయెను. నేను భద్రముగ దానిని తలుపు వార నుంచితిని.

శాల:— సరియే. లోన నీవును గౌరియు నుంటిరి. ఎంతకాలమునకు నీ తండ్రి మీ యొద్దకు వచ్చెను ?

అమీనా:— నా తండ్రి మా యొద్దకు రానేలేదు. ఆతని మృతశరీర మును మాత్రమే నే నటుపిమ్మట జూచితిని.

శాల:— ఎంతకాలము మీరిద్దరు నింటిలో నుంటిరి ?

అమీనా:— స్వల్పకాలమే. పిమ్మట పెరటివైపు వనములో కొంత కాలము విహరించుటకు పోయితిమి. కొంత తడవైన పిమ్మట గౌరి వెడలిపోయెను. నేను మరి కొంతసేపు అచ్చటనే యొక చెట్టుకొమ్మ నానుకొని యేదో యోచించుచు నిలచియుంటిని.

బాల:— ఇంతలో తుపాకి ధ్వని వినబడినది!

అమీనా:— అగును.

బాల:— అది మీయింటనే ప్రేలినదని నీకు తెలియదు!

అమీనా — తెలియదు. ఎవ్వరో వనములో వేట చేయుచుంటిరని యనుకొంటిని.

బాల:— మరల గౌరి మీ యింటిలోనికి పోయియుండెనుకదా, ఏదైన మరచి యది తెచ్చుకొనుటకు పోయెనా?

ఇదియొక గడుసుప్రశ్న. ఒక ప్రక్క విసురు! తగిలిన తగులును, లేకున్న లేదు! కాని. బాగుగనే తగిలెను.

అమీనా:— అగును. అతడు తన యుత్తరీయమును ఇంటిలో మరచెను.

బాల:— దానికొఱకు అతడు తిరిగి యింటిలోనికి బోయెను సరియే. హత్యానంతరము నిన్ను మరల కలసినప్పుడు నరేంద్రుడే మీ తండ్రిని హత్యజేసెనని నీకు రూఢిగా చెప్పియుండును.

అమీనా:— చెప్పెను. కాని, అతడు చెప్పనేల? నాకు తెలియదా? అది యందరకును తెలియును.

బాల:— అగును. నరేంద్రుడు హత్యగావించుచుండగా చూచితినని గౌరి నీతో చెప్పియుండెనా?

అమీనా:— అతడు తన యుత్తరీయమును తీసుకొని కొంతదూరము పోయినపిమ్మట మా యింటిలో మా తండ్రితో యెవ్వరో కలహించుచున్నట్లు వినెను. ఇంతలోనే తుపాకి శబ్దము వినవచ్చెను. ఏదో ప్రమాదము సంభవించె ననుకొనెను. కాని, నా తండ్రియే చంపబడెనని యనుకొనలేదు.

బాల:— అని గౌరి నీతో చెప్పెను. ఎప్పుడు?

అమీనా:— ఆ రాత్రియే, అర్ధరాత్రివేళ!

బాల:— అర్ధరాత్రివేళ తిరిగి యాతడు నీయొద్దకు వచ్చెనా?

అమీనా:— వచ్చెను. వచ్చి, సాయంకాలము ఇంటిలో జరిగిన ఆ కలకల మేమి యని నన్నడిగెను. ఎవ్వరో తుపాకితో నా తండ్రిని చంపెనని చెప్పితిని. అప్పు డాతడు, 'నరేంద్రుడే ఆ పని చేసియుండును. ఆ కలకలమందు నరేంద్రుని కంఠధ్వని నాకు స్పష్టముగ వినబడినది' అని చెప్పెను.

శాల:— ఆతని మాటలయందు నీకు పూర్తిగ విశ్వాసము కలిగినదా?

అమీనా:— కలుగ కేమి ? ఆ నరేంద్రుడే హంతకుడనుట కెట్టి సందేహమును లేదు.

శాల:— సరే. అదిగో, ఆ ముద్దాయిని చూడుము. అతడేనా గౌరి ?

అమీనా:— అగును. అయిన నేమి ? అతడు హంతకుడని చెప్పుటకు వీలు లేదు.

శాల:— అగును. గౌరియే రమాపతి యని నీవు చెప్పగలవు కాని, అతడే హంతకుడని యెట్లు చెప్పగలవు ? సరియే. అది యటుండనిమ్ము. గౌరితో నెంతకాలము నీవు కలకత్తాలో నుంటివి ?

ఇది యొక గడుసు ప్రశ్న. తగిలిన తగులును. లేకున్న లేదు. ఈ ప్రశ్నకు అమీనా తెల్లబోయి చూచుచుండెను.

శాల:— హత్యానంతరము నీవీ స్థలమును విడచి గౌరిని కలియుటకు కలకత్తా పోయితివి కదా! అచ్చట ఆతనితో నెంతకాలముంటివి ?

అమీనా:— నేను గౌరితో కలసి కలకత్తాలో నుంటినని యెవరు చెప్పిరి ?

శాల — నేను చెప్పుచున్నాను. అమీనా! అయిన దేదో అయి పోయినది. ఇంకను దాపరిక మేల ? లేదన్న ప్రయోజన మేమి ? అందు దోష మేమున్నది ? మేము మాత్రము మా మిత్రులను చూచుటకు పోవకుందుమా ? మిత్రులతో కొన్నాళ్ళు నివసింపకుందుమా ?

అమీనా:— (ముఖము జేవురింప) చాల బాగున్నది !

అంత హరిహరరాయలు, "సాకీ! నిజము చెప్పవలెను. నీవు గారితో నుంటివా, లేక నరేంద్రునితో నుంటివా?" అని ఖండితముగ ప్రశ్నించెను. ఆ ప్రశ్నయందు విస్పష్టముగ నొక యుద్రేక భావము ప్రస్ఫుటమగుచుండెను. నరేంద్రుడే దోషియని తన హృదయమునందు సుస్థిరమైయుండిన నిశ్చితాభిప్రాయమే యందుకు కారణము.

అమీనా:— (ఆవేశముతో) నేను — నరేంద్రునితో నుంటినా? దానికన్న అసత్యము వేఱొకటి లేదు. హత్యజరిగిన నాటి నుండియు నేను నరేంద్రుని చూడలేదు. ప్రమాణము చేయుచున్నాను. ఆ హంతకుని నే నీ జన్మమున చూడగోరుదునా?

ఆమె వాక్యములు విన్నవారికి ఆమె పల్కినది యథార్థమని తోచక మానదు. హరిహరరాయల దృగ్జాలములు విస్మయోత్తేజితము లయ్యెను. 'నరేంద్రుడు దోషి కాడా? తన యభిప్రాయము నిరాధారమా? నిర్దోషి పట్ల తానింతకాలమును నిష్కారణ ద్వేషము వహించి యుండెనా?' ఈ జిజ్ఞాస ఆతని నేత్రములందు సువ్యక్తమగుచుండెను. అంతవరకు అచంచల పాషాణమై యున్న యాతని హృదయము ఇంచుక చలింపసాగెను.

శాల:— పొరపాటు, అమీనా! నీవు నరేంద్రునితో ఎంత మాత్రము నుండజాలవు. నీవు గారితోనే యుంటి వన్నమాట!

అమీనా:— (తలవంచుకొని) అగును.

శాల:— మంచిదే. అట్లతనితో రెండు మూడేండ్లుంటివా?

అమీనా:— మూడెండ్ల వరకుండలేదు.

శాల:— సరే, సుమారు రెండేండ్లుండి యుందువు.

అమీనా:— అయిన దోషమేమి? నేను కలకత్తాలో నుండగా, అప్పుడప్పుడు పరిచయమునుబట్టి ఆతడు నన్ను చూచుటకు వచ్చుచుండెను.

శాల:— ఏమియు తప్పులేదు. సరే, అమీనా! ఇప్పటికే అతిసుకుమారివైన నిన్ను చాల శ్రమపెట్టితిని. ఇంక నీవు పోవచ్చును.

పంజరమునుండి విడిపడిన పక్షివలె అమీనా బోనులోనుండి యీవలకు వచ్చి చరచర బైటకు పోయెను.

అంత బాలచంద్రదేవ్ తదనంతర విచారణమునకు తిరిగి అభిరామసింగును పిలిపించెను.

బాల:— అభిరామ్! హత్యానంతరము పదునెనిమిది మాసముల పిమ్మట నీవు కలకత్తాయందు గౌరిని చూచితినని చెప్పియుంటివి.

అభి:— అగును.

బాల:— అది, అమీనా ఆతనితో నక్కడ నున్న కాలమునందై యుండును. — అప్పుడు నీవు అమీనానుకూడ చూచి యుంటివా?

అభి:— చూచియుంటిని.

బాల:— ఎప్పుడు, ఎట్లు చూచియుంటివో కొంచెము చెప్పుము.

అభి:— ఒక సాయంకాలము నేను కలకత్తాలో సంచరించుచు, ఆకస్మికముగ నొక యింటిముంగిట అమీనాను చూచితిని. నన్ను జూచి యామె పలుకరించి, "ఈగృహమందే నేను నివసించుచున్నాను. లోనికి రమ్ము" అని నన్నాహ్వానించెను. ఏదో అల్పాహారము సహితము నాకిచ్చెను.

బాల:— ఆ యింట గౌరిని నీవు చూచితివా?

అభి:— అప్పుడు చూడలేదు. కాని యొక గంట పిమ్మట అత డచ్చటకు వచ్చుట చూచితిని.

బాల:— ఎట్లు?

అభి:— చీకటిపడు వేళకు నాతో సంభాషణము ముగించి యామె నన్ను సాగనంపెను. నేను లోనుండి బయటకు వచ్చితినో లేదో, ఒక గుఱ్ఱపుబండి యింటిముంగిట నాగెను. దానిలోనుండి గౌరి దిగి, బండివానితో కొంత చర్చ జరిగిన పిమ్మట వానిని పంపి, ఆయింట జొచ్చెను.

బాల:— అమీనా నరేంద్రునితో పరారియై పోయినదని నీ వదివరలో వినియుండలేదా?

అభి:— వినియుంటిని.

బాల:— మరి, ఇప్పుడా విషయము అసత్యమని నీవు తెలిసికొనినప్పుడు దాని నేల ప్రకటించ లేదు ?

అభి:— దానితో నాకేమిసంబంధము ? మరియు, ప్రకటించిన ప్రయోజనమేమి ? నరేంద్రునిపై హత్యానేర మారోపింపబడినది. ఆ నేరముతోపాటు ఈనేరముకూడ ఆతని తలమీదనే యుండ నిమ్మని నే నూరకుంటిని.

అంతట ముద్దాయిపక్షపు న్యాయవాదియైన రహీంసాహెబ్ లేచి "ఓయీ! గౌరి వచ్చినప్పటికి చీకటిపడినదని చెప్పితివి. ఆ చీకటిలో నీవు గౌరి నెట్లు గుర్తింపగల్గితివి ?" అని యడ్డుప్రశ్న వైచెను.

అభి:— ఆ యింటిముంగిట నొక పెద్దదీపము వెలుగుచుండెను. మరియు ఆతని కంఠస్వరము నాకు పరిచితమే కదా ?

రహీం:— ఆతడు నీతో మాటాడెనా ?

అభి:— లేదు. కాని, బండివానితో అద్దెనుగూర్చి కయ్యమాడుట విని యుంటిని కదా ?

రహీంసాహెబ్ మరి ప్రశ్నింపక కూర్చుండెను. అభిరామసింగ్ సాక్ష్యము పూర్తియయ్యెను. పిమ్మట కృష్ణమోహన్ గుమస్తా విశ్వాసరాయులు పిలువబడెను. ఆతడు ప్రమాణముచేసి, రెండు దినములక్రిందట రమాపతికిని దీక్షిత్ కును జరిగిన యొక వాగ్వాదమును తాను వింటినని చెప్పి యా వివాద మంతయును ఈ క్రింది విధముగ ఉన్నది యున్నట్లు వివరించెను.

"ఆకస్మికముగ వారిద్దరును కలిసికొనిరి. అంత దీక్షిత్ రమాపతితో "ఏమయ్యా! నేను పలుకరించినను పెడమొగము పెట్టితివి! నన్నింత శీఘ్రముగ మరచిపోయితివా ?" అని యడిగెను. అంత రమాపతి కోపముతో "ఓహో! నీవెవ్వడవని నిన్ను జ్ఞప్తి యుంచుకొనవలసిన యవసరము నాకున్నది ?" అని నిర్లక్ష్యముగా బలికెను. అప్పుడు దీక్షిత్—"నా యవసరము అమీన్ జాన్ హత్య జరిగిన నాటితోనే తీరిన దనుకొంటివా ? నిన్నిప్పుడు ఉరికంబముపై కెక్కించగలనని నీకు తెలియునా?" అని కొంచెము ఘాటుగా పలికెను.

డానికి రమాపతి, "మూర్ఖా! నేనే ఉరికంబ మెక్కినచో నాతో నీవు కూడ ఎక్కవా? నేను నీకిచ్చిన నూరు రూప్యముల పురస్కారము నీ తలపై లేదా?" అని బదులు పల్కెను.

"ముష్టి నూరు రూప్యములు! నా నోరు కట్టుటకు నీవు నాచేత బెట్టిన ముష్టి నోటు నీతొందరపాటులో అనాలోచితముగ నేను గ్రహించినందుకు ఎంత పరితపించు చుంటినో దైవ మెఱుంగును. నీ గుట్టు దాచియుంచుటకు నేను నిష్కారణముగ ఆ నరేంద్రుని బలి చేయవలసి వచ్చినది." అని దీక్షిత్ పల్కెను.

"లేకున్నచో నీవే బలియైయుందువు" అని రమాపతి యనెను.

"నేనో, నీవో, తెలిసియుండును. లంచము పట్టినందుకు నేనే బలియైనచో, హత్య చేసినందుకు నీవేమై యుందువో!" అని దీక్షిత్ బింకముగ బదులు చెప్పెను.

ఈ వాగ్వాద మంతయు నేను చెవులార వింటిని" అని విశ్వాస రాయలు వెలిబుచ్చెను. ఈతని సాక్ష్యము వినినంతనే రమాపతి ముఖము వివర్ణమయ్యెను. ఆవిరి సోకినట్లు ముఖమంతయు ముచ్చె మటలు పోసెను. చెంత నిలచియున్న దీక్షిత్ ఒకసారి రమాపతి వైపుచూచి తిరిగి ముఖము వంచుకొనెను.

సాక్షి విచారణమున తేలిన యంశములనుబట్టి న్యాయాధిపతి రమాపతిపై హత్యానేరమును, దీక్షిత్ పై హంతకునకు సహాయ భూతుడైన నేరమును స్థిరపరచి, అంత్య విచారణమునకు మండల న్యాయస్థానమునకు పంప నాజ్ఞాపించెను. జామీనుపై విడుదల చేయవలసినదని రహీంసాహెబ్ చేసిన ప్రార్థనము నిరాకరింపబడెను. తక్షణమే, ఖైదీ లిద్దరకును బేడీలు వైచి రక్షకభటులు తోడ్కొని పోయిరి.

ఒక స్వప్నమునుండి మేల్కాంచిన వానివలె లేచి హరిహర రాయలు గృహోన్ముఖు డయ్యెను. "కుమారుడు నరేంద్రునిపై నిష్కారణముగ దోష మారోపించితివి!" అని యాతని యంతరాత్మ యాతని చెవిలో ఘోషించుచుండెను.

బాలచంద్రదేవ్ బయట నిలచియున్న అమీనావైపు జూచి, నవ్వుచు, "చూచితివా, అమీనా! రమాపతి పెద్దమనిషి యంటివి! నరేంద్రుడే హంతకు డంటివి! సత్యము గ్రహించితివా? దుష్టులు కలహించినచో సజ్జనులకు శ్రేయము! దీక్షిత్ రమాపతులు కలహించబట్టి నరేంద్రుని నిర్దోషిత్వము ఋజువైనది." అని పకపక నవ్వుచు పోయెను. రహీంసాహెబ్ ఏవైపునుండి పోయెనో యెవ్వరును చూడలేదు.

## అ ధ్యా య ము 25

మండల న్యాయస్థానము ప్రేక్షక సమూహముతో క్రిక్కిరిసి యుండెను. సామాన్యమైన యభియోగమా? హత్యానేరమునకు ఉన్నత శ్రేణికి చెందిన యొకానొక భద్రవ్యక్తి విచారణము! సర్వజన వేద్యమైన యాతని యత్యాచార పరంపరకు నేడు ఫలప్రదానము జరుగును. ఒక్క కృష్ణమోహన్ తప్ప తక్కిన న్యాయవాది సంఘ మంతయు ఆనాటి విచారణమునకు వచ్చియుండెను. రమాపతి యొక్కడే ముద్దాయికి నియమింపబడిన స్థలమందు నిలచియుండెను. రెండవ ముద్దాయి దీక్షిత్ నేరస్వీకారము చేసి ప్రభుత్వపక్షమున సాక్ష్యమీయ నంగీకరించెను.

పదిగంటలు మ్రోగెను. న్యాయాధిపతి న్యాయపీఠమధిష్ఠించెను. తక్షణమే విచారణము ప్రారంభమయ్యెను. అంతయు నిశ్శబ్దముగా నుండెను. "నరేంద్రుని రప్పింపుడు" అని న్యాయాధిపతి యాజ్ఞాపించెను. ప్రేక్షక సంఘమంతయు నివ్వెరపడి చూడసాగెను. "నరేంద్రుడు! పూర్వవిచారణమున దోషియని నిర్ణయింపబడిన నరేంద్రుడు! పరారియైపోయిన నరేంద్రుడు! ఇప్పుడెట్లువచ్చును?" అను గుసగుసలు నలుగడలను బయలుదేరెను. గ్రహణదోషము నుండి విముక్తుడై మేఘముల చాటునుండి బయటపడిన పూర్ణచంద్రుని వలె కలకలలాడు ముఖముతో నరేంద్రుడు ప్రవేశించెను. మారు వేసపు నిడుదమీసములు లేవు. పోలముకాపు దుస్తులు లేవు. భయ విహ్వలములైన యాచూపులు లేవు. ప్రాణము లరచేతబట్టుకొని చీకటి చాటులందు సంచరించుచుండిన యా పంద్రెండేండ్ల యజ్ఞాతవాసమును

తీరినది. కృష్ణమోహన్ రెక్కల చాటునుండి బాలచంద్రదేవ్ పర్యవేక్షణమున నిర్భయముగ సాక్ష్యమిచ్చుటకు కొనిరాబడెను. ఇద్దఱు రక్షకభటులు వెంటనుండిరి. విచారణము ప్రారంభమయ్యెను.

న్యాయా:— ఓయీ! ఆ ముద్దాయివైపు చూడుము. ఆతని నీ వెఱుగుదువా?

నరేం:—ఎఱుగుదును. హత్యాకాలమున నీతడు 'గౌరి' యని పిలువబడుచుండెను. ఇప్పు డీతని పేరు రమాపతియని తెలిసినది.

న్యాయా:— హత్యజరిగిననాటి సాయంకాలమున నేమిజరిగినదో నీకు తెలిసినది చెప్పుము.

నరేం:—ఆ సాయంకాలము నేను అమీనాయింటికి బోవుటకు ముందే నిర్ణయము చేసుకొని తుపాకి తీసుకొని పోయితిని.

న్యాయా:— తుపాకి యేల?

నరేం:— తన తుపాకి చెడియుండుటచే నా తుపాకి నొకసారి యెరువిమ్మని అమీరాన్ జాన్ నన్ను కోరియుండెను. కావున, దాని నాతని కిచ్చుటకు తీసుకొని పోయితిని. నే నా యిల్లు చేరుసరికి అమీనా వీధి యరుగుపై నిలచి, "ఇప్పుడు కాదు. వెడలిపొమ్ము," అని చెప్పినది. అప్పుడు గౌరి లోపల నున్నాడను సందేహము నాకు కలిగినది. అట్లనేకసార్లు నన్ను పొమ్మనినప్పుడు గౌరి లోపల నుండుట నేను కనిపెట్టితిని.

న్యాయా:— గౌరికిని నీకును అన్యోన్యద్వేష ముండె ననుకొందును.

నరేం:— గౌరి నన్ను ద్వేషించుచుండెనో లేదో నాకు తెలియదు. కాని, నేను మాత్రము గౌరిని ద్వేషించుచుంటిని.

న్యాయా:—సరియే. తరువాత!

నరేం:— తరువాత, చేయునది లేక నేను పోయితిని. పోవుటకు పూర్వము నాతుపాకి నామెకిచ్చి తన తండ్రి కందజేయుమని చెప్పితిని. 'తుపాకియందు తోటా అమర్చబడి యున్నది. సుమా, జాగ్రత్త' అని చెప్పితిని. ఆమె దానిని పుచ్చుకొని లోపల తలుపు వారగోడకు చేరబెట్టెను. నేను వెనుకకు మరలితిని. కాని సరాసరి యింటికిపోవక, గౌరి ఆయింట

నప్పుడున్నాడో లేదో సందేహనివృత్తి జేసికొనగోరి, ఆ సమీపమందే పొదలచాటున నక్కియుంటిని. ఆ సమయము ననే ఆ వనమునందు వేటచేయుచుండిన రామసింగ్ నన్ను జూచి "ఇచ్చట యేల నక్కియున్నావు?" అని ప్రశ్నించెను. నేను మాటాడక అచ్చటనుండి కొంచెము దూరమున నున్న మరొక పొదచాటునకు బోయితిని. పిమ్మట సుమారు అర గంటు యైనదో లేదో తుపాకి ప్రేలిన శబ్దము వినబడినది. ఆ ముహూర్తమందే దీక్షిత్ ఆ మార్గమున ఆ యింటివైపు పోవుచుండెను.

న్యాయా:— అయిన, దీక్షిత్ ఆ తుపాకి ప్రేల్చలేదన్నమాట!

నరేం:— లేదు. ప్రేలినప్పటికి ఆతడు నా దృష్టిపథమునందే యుండెను. దీక్షిత్ నా కదృశ్యుడైన మూడు నాల్గు నిమిషములకు ఆ గృహమార్గమున రోజుకొనుచు ఎఱ్ఱబారిన ముఖముతో గారి నా వైపునకు పరుగిడుచు వచ్చి, నా ప్రక్కనుండియే పోయి, చెట్లచాటున అదృశ్యుడయ్యెను. మరి మూడు నిముషములలో గుఱ్ఱపుడెక్కల చప్పుడు వినవచ్చెను. అశ్వారూఢుడై ఆతడు వాయువేగమున జమాల్‌పురాభిముఖుడై పోవుచుండుట మరల నేను చూచితిని. తక్షణమే అమీనా యింటికి నేను వడి వడిగా పోయితిని. ఇంట నడుగు పెట్టితినో లేదో, అమీర్ జాన్ మృతశరీరము ఒక రక్తపుమడుగులో నా కంటబడెను. ఆ ప్రక్కనే నా తుపాకి పడియుండెను. దిగ్భ్రమ చెంది, కొయ్యబారి కొంతవడి యట్లే నిలచిపోయితిని. గృహమంతయు నిశ్శబ్దముగ నుండెను. 'అమీనా' అని బిగ్గఱగ పిలచితిని. ప్రతిశబ్దము రాలేదు. వర్ణింపరాని భయాతిరేకమున నేను నా తుపాకిని గ్రహించి యీవల కొక్క గెంతు గెంతితిని. ఎదుట రామసింగ్ కానవచ్చెను. వానిని జూచి మతిభ్రమ కలిగి వెంటనే ఆ తుపాకిని మరల నింటిలోనికి విసరివైచి పరుగు పెట్టితిని.

న్యాయా:— ఆ తుపాకిని తీసితివేల? మరల పారవైచితివేల?

నరేం:— మృతదేహముచెంత నా తుపాకి యున్నచో నేనే హంతకుడ నని నన్ను పట్టుకొనెదరేమో యని తుపాకి తీసుకొనిపోదలచితిని. తుపాకితోనున్న నన్ను రామసింగ్ చూచినచో నేరము నామీఁదపడునేమో యని దానిని మరల లోనికి విసరివైచితిని. కేవలము భయోత్పాతముచేతనే నే నట్టి యవివేకమునకు గాల్పడితిని.

న్యాయ:— పిమ్మట నేమిజరిగినది?

నరేం:— పిమ్మట నేను పరుగిడుచుండ దీక్షిత్ ఎదురుపడెను. రోజు కొనుచు పోవుచున్న గారిని ఆ మార్గమున బోవుచుండిన దీక్షిత్ చూచియుండునని భావించి యాతని నడిగితిని. "నే నెవ్వరిని జూడలేదు." అని బదులుచెప్పి యాతడు తన దారిని పోయెను.

న్యాయ:— ఆపోవుట సరాసరి మీయింటికే పోయితివా?

నరేం:— లేదు. ఆ హత్యానేరము నామీఁదపడునేమో యని భయపడి, రెండు మూడు దినము లచ్చటచ్చట దాగియుంటిని. ఇంతలో విచారణము జరిగినది. అన్యాయముగ నేనే హంతకుడనని ఋజువు చేయబడినది. ఇంక నే నా ప్రాంతమున కనబడినచో నా కురిశిక్ష తప్పదని ప్రాణములమీఁది యాసచే యెట్లో కలకత్తానగరము చేరుకొని, అచ్చట నజ్ఞాతవాసము చేయసాగితిని. ఇప్పటికి సుమారు పండ్రెండేండ్లు గడచినది. న్యాయమూర్తీ! ఇందొక్క యక్షరమైనను మిథ్యలేదు. దైవమే సాక్షి!

అని నరేంద్రుడు తన కథ పూర్తి జేసెను. పిమ్మట ప్రతిపక్ష న్యాయవాది యతనిని ప్రశ్నపరంపరలచే కొంత యూపి చూచెను. కాని, యాతడు చలించలేదు. అతని యుదంతమంతయు పరమ సత్యముగా నచ్చటి ప్రతివానికిని తోచెను.

పిమ్మట అమీనా రాపింపబడెను. ఆమె విచారణమునందు నరేంద్రుడు చెప్పిన దెల్ల యథార్థమని ఋజువయ్యెను. పిమ్మట దీక్షిత్ విచారణము ప్రారంభమయ్యెను. అతని వాఙ్మూలము సహితము నరేంద్రుడు చెప్పిన విషయములను సమర్థించెను.

న్యాయా:- అయిన, ఆ తుపాకి ప్రేల్చినది నరేంద్రుడు కాడనియే నీ యభిప్రాయమా ?

దీక్షిత్ :- చిత్తము. ఆ తుపాకి ప్రేలినప్పటికి నరేంద్రుడు ఆ గృహమునకు చాల దూరమునం దుండెను. ఆతనికంటె నేనే ఆ యింటికి కించుక సమీపమునం దుంటిని.

న్యాయా:- శబ్దము విన్న పిమ్మట నీవేమి చూచితివి?

దీక్షిత్ :- ఆ యింటివైపు జూచితిని. ఉత్తర క్షణమందే ఆ యింటిలో నుండి గోడ యావలకు లంఘించి పటాటోపమున నా వైపునకే పరుగెత్తుకొని వచ్చుచుండెను. నా ప్రక్కనుండి యాతడు పోవునప్పుడు నే నాతని చేయి పట్టుకొని నిలిపి, "ఈ పరుగేమి? ఆ తుపాకి ప్రేల్చినది నీవేనా?" అని ప్రశ్నించితిని.

న్యాయా:- ఆ ప్రశ్నకవసరమేమి కలిగినది ?

దీక్షిత్ :- ఆతని ముఖలక్షణములను బట్టి నాకు సందేహము కలిగినది.

న్యాయా:- పిమ్మట ?

దీక్షిత్ :-పిమ్మట నన్ను విదలించుకొని యాతడు పోవ యత్నించెను. కాని, ఆతనికన్న నేను బలశాలి నగుటచే ఆతని యత్నము సాగలేదు. అప్పు డతడు మెత్తపడి. "దీక్షిత్ ! నా గుట్టు బయటపెట్టకుము. నన్ను వాడు అనరానిమాటలాడుటచే కోప మాపుకొనజాలక ఆ పని చేసితిని. నాగుట్టు కాపాడుము. ఇదిగో దీనిని పుచ్చుకొనుము" అని జేబులోనుండి యొక నూరు రూప్యముల నోటును తీసి నాచేత పెట్టెను. మారుప్రశ్న వేయక నేను దానిని పుచ్చుకొని యాతని విడచిపెట్టితిని. ఆత డేమిపని చేసెనో కూడ ఆ తొందరలో నే నడుగలేదు. ఇంతలో నరేంద్రుడు పరుగిడుచు వచ్చి "ఆ గోడని నీవు చూచితివా ?" అని ప్రశ్నించెను. నే నెవ్వరిని చూడలేదని బొంకి నా దారిని పోయితిని.

న్యాయా:- అయిన ఒక ఘోరహత్యను కప్పిపుచ్చుటకు నీవు లంచము గ్రహించితివి !

దీక్షిత్ :- చిత్తము. అపరాధము చేసితిని. ఆ లంచమును గ్రహించి నందుకు తదుపరి నే నెంత పరితపించితినో దైవ మెఱుగును. ఆ సమయమున నేను ఆర్థిక దురవస్థయం దుండుటచే ధనము నన్నాకర్షించినది. నన్ను మతిభ్రష్టుని జేసినది. ఈ రహస్య గోపనమువలన నరేంద్రునిపై నేరము పడినందుకు నే నా పాపిష్ఠిధనమును నెంతనిందించితినో దైవ మెఱుంగును. లంచమునకు కట్టుబడి నే నింత కాలమును హత్యా రహస్యమును బయల్పఱుపలేదు. న్యాయమూర్తీ! దైవతుల్యమైన యీ న్యాయపీఠము సమక్షమున నేను చెప్పినదంతయు సత్యము.

అని దీక్షిత్ తన సాక్ష్యమును పూర్తిచేసెను. తదుపరి ప్రతిపక్ష న్యాయవాది నరేంద్రునివలెనే యీతనిగూడ ప్రశ్నపరంపరచే గుంజిచూచెను. కాని యీతడు చలించలేదు. అంతటితో సాక్షి విచారణము ముగిసెను.

పిమ్మట ఇరుపక్షముల న్యాయవాదులును వారివారి వాదములను న్యాయాధిపతికి వినిపించిరి. ఉభయ వాదములను సావధానముగ విని యాచారము ననుసరించి న్యాయవిచారణమునందు తనకు సహాయులుగా నియమింపబడి, యచ్చట నుపవిష్టులైయున్న భద్ర వ్యక్తులను జూచి, "మీ యభిప్రాయ మేమి?" అని ప్రశ్నించెను. వారు తమలో తాము కొంతవఱకు చర్చించుకొని, "రమాపతి అపరాధి" అని తమ యభిప్రాయమును దెలిపిరి. పిమ్మట న్యాయాధిపతి రమాపతి నుద్దేశించి, "ముద్దాయీ! నీ వేమైన చెప్పుకొన దలచితివా?" అని యడిగెను.

అంత రమాపతి హీనస్వరముతో, "న్యాయమూర్తీ! నేను దోషినని స్వీకారము చేయుచున్నాను. నరేంద్రుడు చెప్పినదంతయు వాస్తవము. అమీనా చెప్పినదంతయు వాస్తవము. దీక్షిత్ చెప్పినదంతయు వాస్తవము. నేను అమీర్‌జాన్ ప్రాణముల దీసినది వాస్తవమే. కాని, తాత్కాలికమైన ఆగ్రహోన్మాదముచే నే నాపని జేసితిని. నా యుత్తరీయము కొఱకు నే నింటిలోనికి పోయినప్పుడు అమీర్‌జానును చంపు నుద్దేశము లేశమాత్రమును నాకు లేదు.

ఆకస్మికముగ ఆతనికిని నాకును సంభవించిన కలహమునందు కోపోద్రేకమున ముందువెనుకలు యోచింపక ప్రక్కనున్న తుపాకి తీసి యాతని జంపివైచితిని. అపరాధమే చేసితిని. నన్ను క్షమించ ప్రార్థించుచున్నాను.'' అని కన్నుల నీరు నింపుకొనెను.

అంత న్యాయాధిపతి, ''అపరాధీ! విద్యావిహీనుడైన మూర్ఖుడు ఇట్టి నేరము చేసియుండిన కొంత క్షమాయోగ్యుడై యుండునేమో! కాని, విద్యావంతుడనై ఉన్నతశ్రేణికి చెందిన నీయట్టి వ్యక్తి యిట్టి నీచ వ్యవహార మొనర్చి యిట్టి ఘాతుక కార్యము చేసినచో క్షమాయోగ్యుడు కాజాలడు. నీవు హత్యచేయుటయే కాక ఆ హత్యా నేరము నిరపరాధియైన నరేంద్రునిపై మోపి, యాతనికి మహాపకారము చేసితివి. న్యాయసూత్రము లత్యంత కఠోరములు! హత్యా దోషమునకు శిక్ష ప్రాణహరణము. ఇంక నతి స్వల్పసమయమే నీ యధీనమునందున్నది. ఇప్పుడు నీకు నేను చేయు ఉపదేశమేమనగా, ఈ క్షణమునుండియు నీయపరాధమును క్షమింపుమని భగవంతుని ప్రార్థింపుము. పశ్చాత్తాపమువలన పాపశాంతియు భగవదనుగ్రహమును లభింపగలవు. న్యాయాధిపతినై అపరాధుల శిక్షింపవలసిన విధి నాపై నుండుటచే నీయపరాధమునకు నేను నీకు ఉరిశిక్ష విధించుచున్నాను. భగవంతుడు నీయాత్మకు శాంతి నొసంగుగాక!''

అని పల్కి యాసీను డయ్యెను. ప్రపంచమంతయు నొక్కసారిగ రమాపతి నేత్రముల కంధకార మయ్యెను. శరీర మాపాద మస్తకమును గజగజ వణకసాగెను. రక్షకభటులువచ్చి తిరిగి యాతని చేతులకు బేడీలువైచి యీడ్చుకొనిపోయిరి.

తదుపరి, పూర్వవిచారణమునందు అపరాధియని నిర్ణయింపబడిన నరేంద్రుని విముక్తునిజేయ న్యాయాధిపతి యాజ్ఞాపించెను. ఆతని విముక్తికి అపరిమితానంద భరితమైన యాతని బంధుమిత్ర వర్గమంతయు చేతులపై నాతని నెత్తుకొనిపోయి, పశ్చాత్తాప తప్తుడై యుండిన తండ్రి హరిహరరాయల కౌగిలి కప్పగించిరి.

ఆ న్యాయవిచారణమునకు ఇచ్ఛాపూర్వకముగనే పోవనొల్లక ఫలితమునకై మాత్రము వేయి చెవులతో వేచుకొనియున్న శాంతా

కృష్ణమోహనులు ఈ వార్తదెలిసి సువర్ణదుర్గమునుండి పెన్కలు కట్టుకొని యచ్చుటకు వచ్చిరి. ఆనందాతిరేకమున కుముద్వతీదేవి కుమారుని కౌగిలించుకొని యేకధారగ నాతని బాష్పాభిషిక్తుని జేసెను. "శాంతా! మోహన్! మీ యిర్వురి దీక్షాబలమే నన్ను తిరిగి మనుష్యుని జేసి మీ మధ్యకు దెచ్చినది! ఎన్నిజన్మములకైనను నేను మీ ఋణము తీర్చుకొనజాలను" అని నరేంద్రుడు వారికి బాష్పాంజలి సమర్పించెను.

"నరేంద్రా! ధర్మత్రాతయగు సర్వేశ్వరుని ప్రశంశింపుము," అని కృష్ణమోహన్ మందహాసము జేసెను. ఆ దినమంతయు సమాగతమైన బంధుమిత్ర సంఘముతో హరిహరరాయ లత్యంతానందమున గడపెను.

ఆ మహోత్సవమునందు కేవల మొక్క వ్యక్తి మాత్రము పాల్గొనజాలక, భయంకర యాతనా గోళమున కొట్టుకొనుచు, ప్రపంచమునే మరచి, సువర్ణ దుర్గమున మిగిలియుండెను. ఆమె హేమ. రోగగ్రస్తుడై క్షణక్షణమును క్షీణించిపోవుచు మంచము పట్టియున్న పసిబాలుని ధ్యానము తప్ప ఆమె కన్యధ్యానమే లేదు.

## అధ్యాయము 26

బాలుడు చంద్రమోహన్ క్షణక్షణమును కృష్ణపక్షచంద్రునివలె క్షీణించి పోవుచుండెను. దివారాత్రములు నిద్రాహారములను మరచి హేమ యా బాలు నంటిపెట్టుకొని యుండి సంరక్షణము జేయుచుండెను. దాసి మంజరి ఛాయవలె హేమ నంటిపెట్టుకొని బాలుని కనిపెట్టుకొని యుండెను. ప్రతిదినమును వైద్యుడు వచ్చి చూచిపోవుచుండెను. యథావిధిగా నౌషధ సేవనము జరుగుచునే యుండెను. కాని బాలునియం దణుమాత్రమును సుముఖత్వము గోచరించుటలేదు. ఊపిరి తీయుట కవకాశము నీయని అత్యవసర కార్యకలాపములందు కొట్టుకొనుచుండినను కృష్ణమోహన్ దినమునకు సుమారు పదిసారులైనను బాలుని మంచము చెంతకు వచ్చి పోవుచుండెను. సోదరుని పునరాగమన మహానందమును తల్లి దండ్రు

లతో పాల్గొనుటకు పుట్టింటికి పోయి యుండిన శాంత, తరచు సువర్ణ దుర్గమునకు వచ్చి బాలుని యారోగ్య పరిస్థితి నారయుచుండెను. కృష్ణమోహన్ అక్కగారు తీరిక చేసుకొనుచు తెఱచు బాలుని మంచముకడకు వచ్చి పోవుచుండెను.

ఒకనాడు శూన్యదృష్టితో కొంతవఱకు చూచి చూచి బాలుడు చెంతనున్న హేమతో, "అమ్మా! మాయమ్మ—ఈయమ్మకాదు—ఆయమ్మ, చచ్చిపోయినది కదా, నేనుకూడ చచ్చిపోయిన తరువాత, ఆమెను నేను కలుసుకొనగలనా?" అని ప్రశ్నించెను. అంత హేమ కన్నుల నీరునింపుకొని, "నాయనా! మీ యమ్మ చచ్చిపోయినను వెయ్యికళ్ళతో ఎల్లప్పుడు నిన్ను కనిపెట్టుకొనియే యున్నది." అని బదులు చెప్పెను. అంత నా బాలుడు, "అమ్మా! అక్కను, నన్నును, నాన్నగారిని, అందరను విడిచిపెట్టి అప్పుడామె వెళ్ళి పోయినది. మామీద ప్రేమలేకనే కదా?" అని నిట్టూర్పు విడిచెను.

హేమ దుఃఖ మాపుకొనజాలక గద్గదికతో, "నాయనా! ఆమె మహాపరాధము చేసినది. తరువాత తానుచేసిన తప్పిదమున కెంతో పరితపించినది. మిమ్ము విడచిపోయినది మొదలు పరితాప తప్తమగుచుండిన ఆ నిర్భాగ్యురాలి చిత్తమునకు దణుమాత్రమైన విశ్రాంతిలేదు." అని కన్నీరు తుడుచుకొనెను.

బాలుడు నివ్వెరపడి, అమ్మా! నీ కెట్లు తెలిసినది? మా యమ్మను నీ వెచ్చటనైన చూచి మాటాడి యుంటివా?" అని యాత్రముతో నడిగెను.

"ఎప్పుడో యొకసారి చూచియుంటిని."

"అట్లైన, ఇంతకాలమును చెప్పకుంటివేల?"

"చెప్పిన ప్రయోజనమేమి నాయనా? దీప మారిపోయినది కాదా?" అని వెక్కి వెక్కి యేడువసాగెను.

"అమ్మా! ఏడ్చెదవేమి? నేను చచ్చిపోయెదననియేనా?"

"లేదు నాయనా! నీ వెన్నటికిని చచ్చిపోవు."

"మరి మా అమ్మను నే నెట్లు చూడగలను?...అమ్మా! నాకు చచ్చిపోవలెననియే యున్నది...నేను...తప్పక చచ్చిపోవుదును... మంచిదే!...అబ్బా!...దాహము..."

అని ప్రక్కకు తిరిగెను. హేమ వడివడిగా లేచి యించుక ద్రాక్షరసమును తెచ్చి బాలుని నోట పోసెను. ఇంతలోనే కృష్ణ మోహన్ ఆగదికి వచ్చి బాలుని పలుకరించెను. కాని పలుకలేదు. శరీరము సలసల క్రాగుచుండెను.

"హేమా! ఈదినము వైద్యుడు రాలేదా?" అని ప్రశ్నించెను. "వచ్చియుండెను. కాని...నిరాశా...భావమునే...ప్రకటించెను. ఈ రాత్రి...గడచుట...కష్టమని కూడ...చెప్పెను." అని గద్గదికతో హేమ ముఖ మెత్తకయే నివేదించెను.

కృష్ణమోహన్ ఒక పెద్ద నిట్టూర్పు విడిచి, బాలుని ముఖము వైపు నిదానించి, కంట తడిపెట్టుకొని, "కానిమ్ము. భగవదేచ్ఛ యెట్లున్నదో యట్లే జరుగును. మా చేత నేమున్నది! నేను పోయి వైద్యునితో నొకసారి మాటాడి వచ్చెదను." అని లేచి యావలకు పోవనున్న సమయమునకు బాలుడు త్రుళ్ళిపడి లేచెను. తటాలున కృష్ణమోహన్ వచ్చి మంచముపై గూర్చుండి "మోహన్! ఏమి నాయనా?" అని యా చిన్ని చెక్కిళ్ళు నిమురుచు నడిగెను.

బాలు:- నాన్నగారూ!...వాడు...వాడు...

కృష్ణ:- ఎవడు మోహన్?

బాలు:- వానికి శిక్ష చెప్పినారా?

కృష్ణ:- ఎవరికి?

బాలు:- ఆ రమాపతికి!...శిక్ష — ఉరిశిక్షయేనా?

కృష్ణ:- అగును. పోనిమ్ము. ఆ విషయము మన కెందుకు మోహన్?

బాలు:- పాపము. దేవుడు వానిని క్షమించడా?

కృష్ణ:- దేవుడు మిక్కిలి దయాళుడు. క్షమించు మన్నవారిని తప్పక క్షమించును నాయనా!

బాలు:- మా అమ్మ తప్పు చేసినందుకు చాల విచారించినదట! ఇప్పుడే ఈ అమ్మ చెప్పినది. ఈమె అమ్మను చూచినదట!

కృష్ణమోహన్ విస్మయదృష్టితో హేమవైపొకసారి చూచెను. హేమ తలవంచుకొని, "తల్లి విషయమై అశాంతి పొందుచుండుట చూచి యట్లు చెప్పితిని" అని హీనస్వరముతో సమాధాన మిచ్చెను.

మోహన్ :— నాన్నగారూ! దేవుడు అమ్మను క్షమించును కాదా?

కృష్ణ:— తప్పక క్షమించును. నాయనా! విశేషము మాటాడినచో అలసిపోవుదువు. ఏమియు నాలోచింపక పండుకొనుము తండ్రీ!" అని ముంగురులు సరిదిద్దుచు శాలున కప్పెను.

మోహన్ :— మంజరి యేదీ?

కృష్ణ:— ఇప్పుడే బయటకు పోయినది. ఏమి కావలెను?

మోహన్:— అక్క యేదీ?

కృష్ణ:— అమ్మతో కలసి తాతగారింటికి పోయినది. ఇప్పుడే పిలిపించెద నుండుము.

అని బయటకు పోయెను. మరియొక గంటలో శీలను దోడ్కొని మంజరి యా గదిలోనికి వచ్చెను. శీలను చూచి మోహన్, "అక్కా! నిన్ను జూడకుండ నే నెట్లు పోగలను!" అని ప్రశ్నించెను.

శీల:— ఎక్కడకు పోయెదవు?

మోహన్ :— అమ్మయొద్దకు.

శీల కేమియు నర్థము కాక నివ్వెరపడి చూచుచుండెను. హేమ యామెను చెంత జేర్చుకొని, "ఏమియు లేదమ్మా! ఎక్కువ జ్వరమువల్ల.........ఏమేమో యనుచున్నాడు." అని సమాధాన పఱచి యామె నా గదిలోనుండి పంపివైచెను. మరల బాలుడు నిద్రాగతు డయ్యెను. క్షణక్షణమును హేమ వాని యొడలు తాకి చూచుచునే యుండెను. అగ్నిహోత్రమువలె మండుచుండిన శరీరము క్రమక్రమముగ చల్లబడెను. జ్వరము తగ్గినదని యామె భావించెను. కాని బాలుని ముఖమునందు మాత్రము దుర్లక్షణములు కన్పడు చుండెను. క్రమక్రమముగ నుచ్ఛ్వాసనిశ్వాసములు భారముగ గాఢ ముగ వినవచ్చుచుండెను. కన్నులు మూతపడియే యుండెను. ఉండుండి యులికి పడుచుండెను.

సూర్యాస్తమయమైనది. వైద్యుడు వచ్చి బాలుని పరీక్షించి మూతి విఱిచెను. "ప్రయోజనము లేదు. ఇంక రెండు మూడు గంటలుమాత్రమే. ఇంతకును మనశక్తి యేమాత్రము! భగవదేచ్ఛ!" అని మెల్లగా గదివిడచి పోయెను. అది మొదలుకొని యొక భయం

కర దుఃఖసముద్రము హేమ హృదయమునందు ఘూర్ణిల్లసాగెను. "నాయనా! నాయనా! ఒక్కసారి కన్నులు విప్పి చూడుము." అని యెన్నివందల సార్లు ఆమె ఆ యచేతన శరీరమును నిమురుచు ఘోషించెనో దైవమున కెఱుక! కమ్మరితిత్తులవలె నుద్రేకించు చుండిన యా చిరుప్రక్కలు క్రమక్రమముగ శాంతింప సాగెను. జేవురించి యుండిన వదనమండలము ప్రశాంతము కాజొచ్చెను. ఆ శుష్క నేత్రాంచలముల నుండి వెల్వడి యొక సుకుమార మందహాస రేఖ ముఖమంతయు నావరించెను. "మోహన్! నన్ను పోల్చితివా? నన్ను గుర్తించితివా? నా వైపొక్కసారి చూడుము." అని హేము యా ముఖమును రెండు చేతులతో బట్టి నిదానించెను. కాని, మఱే మున్నది! ఆ శిశు దేహమునందలి దివ్యజ్యోతి యారిపోయినది. "తండ్రీ!" యని యెలుగెత్తి యఱచి మూర్ఛాగతయై యామె నేల గూలెను. నిరంతరము శిరోవేష్టముగ ధరించియుండిన సిలినస్త్రము విడిపడినది. రేయింబవళ్ళు నేత్రయుగ్మమును మఱుగు పఱచు చుండిన సిలియద్దములు నేలబడెను. అనాచ్ఛాదిత వదనయై నేల బడియున్న హేమను జూచి మంజరి భయోత్పాతమున శిలాప్రతిమ వలె నిశ్చేష్టయై "ఎవ్వరీమె! స్వర్ణలత! స్వర్ణలత! ఎంత సాహసము ఎంత సాహసము చేసినది!" అని గజగజ వణకసాగెను. కొంతవడికి ధైర్యము వహించి, "అమ్మా! అమ్మా!" అని యామెను తట్టి లేపెను. ధారాపాతముగ స్రవించుచున్న కన్నీటి తెరనుండి యామె మంజరిని జూచి, "ఎవరు నీవు? మంజరీ!.. మంజరీ!...మంజరీ! నేను నిర్భాగ్యురాలను! నన్ను గుర్తించితివా? నన్ను రక్షింపుము. నా గుట్టు కాపాడుము. నిన్ను బ్రతిమాలుకొనుచున్నాను. దుస్సహ మైన మానసిక వేదన నన్నీస్థలమున కాకర్షించినది. నా భర్త సన్ని ధానమున నా బిడ్డల సంరక్షణ మొనర్చుకొనుచు గోప్యముగ నేనింత కాలమును గడపితిని. ఇంక నా యాశ లంతరించినవి. నేను పరమ పాతకిని. మరణ సమయమందైన నేను నా బిడ్డతో 'నాయనా! నేను నీ తల్లిని!' అని చెప్పజాలకపోయితిని. ఇంక నే నిచ్చటినుండి పోయె దను. మంజరీ! నేను పోవువఱకు నన్ను గాపాడు భారము నీది" అని యామె రెండు చేతులను బట్టుకొనెను. పొంగి పొరలి వచ్చు

చున్న దుఃఖము నాపుకొనుచు మంజరి, "అమ్మా! ఏమియు భయ పడవలదు. నే నున్నాను. ఇంక త్వరలోనే బాబుగారు రాగలరు. మీ రిచ్చట నుండుట ప్రమాదకరము రండు. రండు." అని బల వంతముగ నామెను తన గదిలోనికి దోడ్కొనిపోయి యందు నిర్బంధించెను.

మరి నాలుగైదు నిముషములలోనే కృష్ణమోహన్ వచ్చెను. బాలుని మంచముచెంత బాష్పాకులనేత్రయై నిలచియున్న దాసిని జూచి, "మంజరీ! వైద్యుడు వచ్చినాడా? ఎట్లున్నది? అని ప్రశ్నించుచు బాలుని ముఖమువైపు జూచెను. ఇం కేమున్నది? బాలుని ముఖము మృత్యుశీతల మందహాసము జేయుచు, "నాన్నగారూ! నే నమ్మదగ్గఱకు పోవుచున్నాను" అని చెప్పుచున్న ట్లుండెను. దుఃఖాతిరేకము నడచుకొనజాలక, కృష్ణమోహన్ పెద్ద నిట్టూర్పు విడచి బాష్పవర్షము గురియుచు బాలుని మృతదేహము నొక్క సారి తన హృదయమునకు హత్తించుకొని, ముద్దిడి "నాయనా! తల్లిలేని లోపము లేకుండ నిన్నింతకాలమును పెంచుకొని వచ్చితిని. ఇంతటితో నీకును నాకును ఋణము తీరినదా? ఈ పాడు రోగముతో నెంత బాధ పడితివి తండ్రీ! ఈ విధముగ నీ బాధా విముక్తి యైనదా?" అని పరిపరి విధముల విలపించెను.

పిమ్మట మంజరిని జూచి, "మంజరీ! హేమ యేదీ? అని యడిగెను. "దుర్భరమైన దుఃఖవేదనతో నిచ్చట నుండజాలక నా గదిలోనికి పోయినది." అని మంజరి ప్రత్యుత్తర మిచ్చెను.

"పాపము. కన్నతల్లికంటె నధికముగ బిడ్డను కనిపెట్టినది. రాత్రింబగళ్ళు నిద్రాహారములను విసర్జించి బిడ్డకు సేవచేసినది. ఆమె ఋణమును నేను తీర్చుకొనజాలను. మంజరీ! అక్క ఇంటియొద్ద లేదు. నేను పోయి శాంతను దోడ్కొని వచ్చెదను. అంతవఱకును హేమకు దుఃఖోపశమన మొనర్చుచు నీ విచ్చట నుండుము." అని పల్కి బయటకు పోయెను.

బాలుని మరణవార్త త్వరలోనే అంతటను వ్యాపించెను. బంధుమిత్రవర్గ మంతయు సువర్ణదుర్గమును జేరిరి. యథావిధిగా బాలుని యంత్యక్రియలు నిర్వర్తింపబడెను.

అప్పటికి గర్భవతియై యుండిన శాంత, పుత్రప్రాయముగ తాను ప్రేమించుచుండిన మోహన్ మరణమునకు అహోరాత్రములు దుఃఖాకులయై కన్నతల్లికంటె నధికముగ బాధపడజొచ్చెను. మరియు నామె యారోగ్యము దిన దినమును క్షీణించుచుండెను. ప్రథమ భార్యయైన స్వర్ణలతా విషయమున తానార్జించిన యను భవమును బట్టి, సముద్రతీర నివాసము ఆరోగ్యకరమని, శాంత నచ్చటకు బంపుటకు కృష్ణమోహన్ నిశ్చయించి దానికి నలయు నేర్పాటు లన్నియు జేసెను. ఇంక రెండుదినములలో శాంత ప్రయాణ మనగా హేమ ఆపాదమస్తకమును గప్పుకొని ఆమెయొద్దకు వచ్చి దీపచ్ఛాయలో నిలచి, "అమ్మా! ఇంక నిచ్చట నాపని తీరినదికదా! నే నింక నుండవలసిన యవసరము లేదు. నాకింక సెలవిచ్చినచో ఇంక నెచ్చటికైన బోయెదను. ఇంతకాలమును తాము నాయెడల జూపిన యపార ప్రేమాదరణములకు నేను మరణపర్యంతము కృతజ్ఞురాలను." అని మెల్లగ ముఖము వంచుకొని పల్కెను. అంత శాంత, "హేమా! మా బిడ్డకు నీవు చేసిన సేవకు మేము నీకు శాశ్వతముగ ఋణగ్రస్తులమై యున్నాము. నీవు వేఱు, మేము వేఱుగ మేము భావించుట లేదు. మా కుటుంబమునందు నీ వొక్క తెవు. నీ వింక నెచ్చటికిని బోవలదు. ఇచ్చటనే యుండి యావ జ్జీవము మాతో కష్టసుఖముల బాల్గొనగోరుచున్నాను. నా ప్రార్థన నంగీకరింపవా?" అని పల్కెను. అంత హేమ, "అమ్మా! క్షమిం పుడు. ఇంక నిచ్చట నుండినను నాకు దుఃఖమే కాని సుఖ ముండదు. మీ పదములంటి ప్రార్థించుచున్నాను. నాకు సెలవొసంగుడు." అని దుఃఖవివశయై మాఱుపల్కెను. శాంత, "హేమా! పోనిమ్ము. నేను తిరిగివచ్చు పర్యంతమైనను నీ విచ్చట నుండగోరుచున్నాను. ఈమాత్రపు విశ్రాంతి నైనను నీవు మాయింట తీసుకొనక తీరదు" అని నిర్బంధించెను. మాఱు పలుకజాలక హేమ యంగీకరించెను. పుత్రుడు మరణించెను గాని, పుత్రిక లీల తన హృదయతంత్రుల నింకను బిగియబట్టి యుండెను. త్రెంచుకొని పోవ యత్నించెను. కాని శాంత యనురోధము పుత్రికా ప్రేమబంధమునకు తోడయ్యెను. శాంతా కృష్ణమోహనులు సంతోషించిరి.

ఆ మూడవనాడే లీలను హేమ కప్పగించి, శాంత ప్రయాణమై సువర్ణదుర్గమును విడచి పోయెను. ఆమె తల్లిదండ్రులు కూడ వారి యారోగ్యముకొఱకు ఆమెతో బోయిరి.

హేమయొక్క రహస్యమును మంజరి యతిభద్రముగ గా పాడు చుండెను. దినమంతయు నామె తన గదియందే పడియుండెడిది. బాలిక లీల సంరక్షణమంతయు తానే స్వయముగ నిర్వహించు చుండెడిది. తనయొద్దనున్న స్వల్ప విత్తముతో నెన్నో వస్తువులను బొమ్మలను రహస్యముగ కొని తెప్పించి లీలకిచ్చి యానందించు చుండెడిది. దినమంతయు నెట్లో గడచిపోవుచుండెను. కాని, రాత్రి యంతయు నామె యమయాతన ననుభవించుచుండెను. కంటికి కూర్కు లేకుండెను. కన్నుమూసినచో, లజ్జాకరమైన తన పూర్వ చరిత్రమంతయు తన యంతర్నేత్రములకు గోచరించుచుండెను. కన్నులు విప్పినచో హృదయపుటభేదనమైన పుత్రుని మరణదృశ్య మును, నీచాతినీచమైన తన ప్రస్తుతావస్థయు నెదుట పొడగట్టు చుండెను. ఇట్టి పరిస్థితియందామె యారోగ్యము దినదినమును క్షీణింపసాగెను. క్రమముగ జ్వరగ్రస్తయై మంచము బట్టెను.

ఒకనాడు జ్వరతీవ్రతచే కంపించుచు శరీరమంతయు గప్పుకొని యామె మంచముపై బరుండి యుండెను. తలుపు కొంచెము తెరచి యుండెను. కృష్ణమోహన్ అచ్చటకు వచ్చి, "హేమా!" అని మెల్లగ బిలచెను. "ఎవరది ? లోనికిరండు" అని యామె పల్కెను. కృష్ణమోహన్ తలుపు తెరచుకొని లోనప్రవేశించెను. ఆతని జూచి, భయోత్పాతముగ దద్దరిల్లి లేచి యామె ముఖము వంచుకొని వణకుచు నిలువబడెను.

కృష్ణ:— హేమా! పండుకొనుము. నీకు జ్వరము వచ్చినదని లీల చెప్పినది.

హేమ— స్వల్పము. నే నీ జ్వరమున కలవాటుపడితిని.

కృష్ణ:— నిద్రాహారములు లేక అవిరామముగ శ్రమపడి బాలునకై నీవు నీ యారోగ్యమును వెచ్చించితివి. వైద్యుని రప్పించెద నుండుము.

హేమ:- వలదు. ప్రయోజనము లేదు.

కృష్ణ:- అదేమి?

హేమ:- నా జ్వరము అస్థిగతమైన యౌకానిక వ్యాధి. ఇది వైద్యులకు సాధ్యముకాదు.

కృష్ణ:- గ్రహించితిని. బాలుని మృతి నీ హృదయపీఠమున గాఢముగ నాటుకొని పోయినది. హేమా! గడచిన దేదియో గడచిపోయినది. భగవత్సంకల్పమునకు మన మేమి చేయగలము? నిరంతర విచారముచే నీ యారోగ్యమును భంగము చేసికొనకుము. నిశ్చింతగ నుండుము. కుమారి లీలను సహితము నేడే ఆమె తల్లియొద్దకు పంపివేసెదను. నీ సంపూర్ణ విశ్రాంతికి ఆమె భంగము కలిగించును.

అని యాతడు పల్కెను. "వలదు. నేనే ఆమె తల్లిని. ఆమె నిమిత్తమే నేనింక నిచ్చట నుంటిని" అని చెప్పుట కామె కధికారము కాని, సాహసముకాని లేని తన దీనావస్థను తలంచుకొని, యామె కన్నుల నీరునింపుకొని "ఆర్యా! నా విషయమై యేమియు చింతింపవలదు. నే నింక నెంత కాలమో జీవింపను. నాకై యెట్టి వ్యయ ప్రయాసములకును తాము లోను కావలదు" అని గద్గదికతో మారుబల్కెను.

"హేమా! విశ్రమింపుము. జ్వరాతిరేకముచే నీ మానసము చలించుచున్నది." అని పలికి మంజరిని పిలచి, యామెకు సర్వోపచారములను జేయుచు కనిపెట్టుకొని యుండుమని చెప్పి, యచ్చటి నుండి పోయి వైద్యునకు వర్తమానమంపెను. వైద్యుడు వచ్చి పరీక్షించునప్పటికి జ్వర మత్యంత తీవ్రముగా నుండెను. ఔషధమిచ్చి, యుపచారక్రమమును మంజరికి జెప్పి, తిరిగి మరునాడు వచ్చెదనని చెప్పి యాతడు పోయెను.

## అ ధ్యా య ము 27

సముద్రపవన ప్రభావముచే శాంత యారోగ్యము దిన దినమును వృద్ధికాజొచ్చెను. హృదయాంతరాళము నదలించుచున్న ప్రళయ పవన ప్రభావమున స్వర్ణలత యారోగ్యము క్షణక్షణమును

క్షీణించి పోవుచుండెను. ఔషధ మేమాత్రమును గుణమిచ్చుట లేదు. దివారాత్రములు మంజరి యామెను కనిపెట్టుకొని యుండెను. అప్పుడప్పుడు కృష్ణమోహన్ వచ్చి యామెను చూచి పోవు చుండెను. ఆతని యుక్కగారు సహితము ఆమె పరిస్థితి కాంక్షో నము చేయుచుండెను. దినదినమునకు దుర్లక్షణము లధికములు కాజొచ్చెను. ఇంక నెంతయో కాలము జీవింపదను నిరాశ మంజరికి కల్గెను.

నాడు కృష్ణ చతుర్దశి. అపరాహ్ణముతోపాటు స్వర్ణలత జీవన స్రవంతి నడివడిగా గడచిపోవుచుండెను. సూర్యాస్తమయము కాజొచ్చెను. మంజరిహృదయము దడదడ కొట్టుకొనసాగెను. "ఈమె కీరాత్రి గడువదు. ఈమె రహస్యము నింతవఱకును కాచుకొని వచ్చితిని. మరణానంతరము ఈ రహస్యము తప్పక బయట పడగలదు. తెలిసియు ఇంతకాలము అందరి కన్ను గప్పియుంచినందున నాపై ఘోరమగు నింద పడగలదు. ఏమి చేయుదును! ఏమి చేయుదును!" అని యామె భయోత్పాతమున చలించి పోవుచుండెను.

ఉదయమునుండియు తెలివి తప్పి పడియుండిన స్వర్ణలత, ఇంచుక చైతన్యము గాంచి కన్నులు విప్పెను. గవాక్షమార్గమున గదియందు పడుచున్న అస్తారుణ కిరణకాంతియందు ఆమె యనాచ్ఛాదితమైన ముఖము సువర్ణప్రభారంజితమై "నన్ను చూడుడు! నేను స్వర్ణలతను!" అని విస్పష్టముగ చెప్పుచున్నట్లుండెను. ఇంక రహస్యము దాగుట యసాధ్యము! మంజరి యాందోళనమునకు మేర లేదు. ఆమె ముఖమును శాలువతో గప్పుటకు ఆమె ప్రయత్నించెను. కాని, గాలికొఱకై యామె కప్పు నామె వెంటనే తీసివేసెను.

ఇంతలోనే కృష్ణమోహన్ కంఠస్వరము క్రింది వసారాయందు వినవచ్చెను. ఆ మధుర కంఠస్వరము చెవిని సోకినంతనే స్వర్ణలత "మంజరీ!" అని పిలచెను.

మంజరి:- ఏమమ్మా?

స్వర్ణ:- నే నిప్పుడు మరణింపనున్నాను. ఈ యంత్యముహూర్తమున నా ప్రాణపతి యొక్కసారి నాకంట బడినచో నేను నిర్విఘ్నాకముగ మరణింపగలను.

మంజరి:- (భయముతో) ఆతని నీ యవస్థలో మీరు చూచుటయే!

స్వర్ణ - చూచిన నేమి? మంజరీ! ఇది నా జీవనమునందలి శేష ఘట్టము! ఒక్కసారి చూచి, ఒక్కసారి మాటాడి, మరణించెదను. ఈతుదికోరిక నా మరణము నాలస్యము చేయుచున్నది.

మంజరి:- అమ్మా! అసంభవము! అసాధ్యము!

స్వర్ణలత కన్నులనుండి బొటబొట కన్నీరు పొఱజొచ్చెను. "ఏమైనను సరే. ఆతని చూడక నేను మరణింపజాలను." అని మంజరి చేయి బట్టుకొనెను.

ఇంతలో నొక సేవకుడు వచ్చి "మంజరీ! బాబుగారు పిలచుచున్నారు" అని బయటనుండి కేకవైచెను. భద్రముగ తలుపు చేరవైచి మంజరి పోయెను.

కృష్ణ:- మంజరీ! హేమ కెట్లున్నది?

మంజరి:- బాబూ! చాల ప్రమాదస్థితిలోనే యున్నది.

కృష్ణ:- (చకితుడై) వైద్యుడు రాలేదా?

మంజరి:-వచ్చి చూచెను. ఈ రాత్రిగడచుట కష్టమని చెప్పిపోయెను.

కృష్ణ:- ఏమీ! ఏమీ! ఇంతశీఘ్రముగ ఎట్లు ముంచుకొని వచ్చినది? రమ్ము ఒక్కసారి చూచివచ్చెదను.

అని చేతబట్టియున్న ఫలాహారపాత్రను నేల పారవైచి, వడి వడిగా మేడమెట్లెక్కి హేమ గదివైపు నడువసాగెను. దుర్భరమైన భయోద్రేకముతో మంజరి యాతనికంటె ముందు నడచి గది గుమ్మముకడ నాతని నిలిపి, "బాబూ! క్షమింపుడు. క్షమింపుడు. తామా గదిలోనికి పోవలదు" అని పల్కెను.

కృష్ణ:- (విస్మితుడై) ఏమి?

మంజరి:- ఆమె అప్రస్తుత స్థితిలో నున్నది. పది నిముసము లాగి రండు.

కృష్ణ:- మంచిది.

అని యాతడు మరలిపోవుచు, అక్కను పిలచి, "అక్కా! హేమ స్థితి ప్రమాదకరముగా నున్నదట! ఒక్కసారి చూచి రమ్ము" అని చెప్పెను. ఆమె తక్షణమే యున్నపాటున వడివడిగా హేమ

గదియొద్దకు పోయెను. మంజరి యామెను ద్వారముయొద్దనే యాపి, "అమ్మా! ఆగుడు. లోనికి పోనలదు," అని భయవిహ్వల వదనముతో బలికెను.

"మంజరీ! నీకేమి పిచ్చి యెత్తినదా? దారి విడువుము" అని కసరివైచి లోన బ్రవేశించి మంచముకడకు బోయెను. మంచముపై పడియున్న రోగిని జూచి యామె దిగ్భ్రమ చెందెను. నోట మాట రాలేదు. కనురెప్ప వేయక అట్లే యామెవైపు తేరిచూచుచు నిలచిపోయెను. "స్వర్ణలత!...స్వర్ణలత!" అను శబ్దములు అస్పష్టముగ నామె కంఠనాళమునుండి వినవచ్చెను. ఒకరి నొకరు రెప్ప వేయక చూచుకొనసాగిరి. "మరణించిన యామె తిరిగి యెట్లు వచ్చినది?" అని యామె మానసము కలవరపడజొచ్చెను. క్షణమాత్రమున సహస్రభావము లామె యంతరంగము నుఱ్ఱూతలూచెను. "నీవు మరణింపలేదా? మరల నిచ్చటికి వచ్చుటకు నీ వెట్లు సాహసించితివి?" అని ప్రశాంతముగనే ప్రశ్నించెను.

మెల్లగా చేతులు జోడించి స్వర్ణలత, "అమ్మా! కరుణింపుడు! క్షమింపుడు! నేను.. మరణింపలేదు. నా బిడ్డలకొఱకు...నా భర్తకొఱకు...ఇంకను జీవించి యున్నాను. మహాపరాధము...చేసితిని. ఇప్పుడు...మరణింప నున్నాను...భగవంతుడు ... నన్ను...శిక్షించును." అని దీనముగ మారుబల్కెను.

ఈ వాక్యములకు ఆమె రాతిగుండె కఱగిపోయెను. ఆమెపై తనకుండిన ఆగ్రహ ద్వేషభావమంతయు నిశ్శేషముగ హరించిపోయెను. మరణశయ్యనుండి వచ్చు శేషవాక్యముల కట్టి యద్భుతశక్తి కలదు.

"బిడ్డా! దుఃఖింపకుము. పశ్చాత్తాపము చేసి పాపము లన్నియు క్షమించబడును." అని యామె శయ్యపై గూర్చుండెను. స్వర్ణలత యామె చేతులను బట్టుకొని, "అమ్మా! క్షమించితిరా?...ధన్యురాలను! ఈ జీవన్మరణ సంధ్యాసమయమునందు...ఒక్కసారి...కడసారి...నా ప్రియభర్తను చూడగోరుచున్నాను...ఒక్కసారి... చూపరా? మంజరి నెంత ప్రార్థించినను...ఆమె...వినలేదు. క్షణ

మాత్రము...ఆతని నా యెదుట నిలుపుడు!...ఆతని...క్షమాదానమునుపొంది... నేను నిశ్చింతగ...మరణించెదను.'' అని ప్రార్థించెను.

తత్క్షణమే యామె మంజరిని పిలచి, "మంజరీ! నే నొకసారి రమ్మనుచుంటి నని బాబును పిలచుకొని రమ్ము." అని పంపెను. ఉత్తరక్షణమే కృష్ణమోహన్ ద్వారముకడకు వచ్చి, "అక్కా! ప్రేమ యెట్లున్నది?" అని ప్రశ్నించెను.

"నిన్ను చూడగోరుచున్నది. ఒక్కసారి లోనికిపోయి చూడుము." అని యాతని లోనికి బంపి, మంజరితో తాను బయటకు వచ్చి తలుపు వేసెను. కృష్ణమోహన్ నిశ్శబ్దముగ మంచముకడకు బోయి, "ప్రేమా!" అని పిలచి, మంచముపై పడియుండిన వ్యక్తిని గాంచి, దిగ్భ్రాంతుడై నోట మాటరాక, ఒక్క యడుగు వెనుకకు వైచి తదేకదృష్టితో చూడసాగెను. అదే స్వరూపము! అదే సుందర ఫాలఫలకము! అదే ప్రశాంత నేత్రయుగ్మము! అదే శిరోజ సంపద! ఈ సౌందర్య మంతయు నింతకాలమును ప్రచ్ఛన్నమై యాతని దృష్టి నాకర్షింపకుండెను. "స్వర్ణా! స్వర్ణా! నేనేమి స్వప్నము గాంచుచుంటినా?" అని యాతడు ప్రశ్నించెను.

"ప్రభూ! ప్రభూ! స్వప్నము కాదు! ఈ యభాగ్యురాలు... తమ...స్వర్ణ! నన్ను క్షమింపుడు!...క్షమించితినని పల్కుడు!... తమ ...క్షమాదానము కొఱకే ... నే నింతవఱకును ... జీవించి యున్నాను." అని యామె కన్నీటితో చేతులు జోడించెను.

"నీవు ఈ స్వరూపమున నన్ను మోసగించుట లేదు కద?"

"లేదు ... లేదు ... మోసగించుట లేదు...ఆ మహాపాతకినే నేను! ఆ యభాగ్య జీవినే... నేను! అజ్ఞాన తిమిరమునందు ... పడి... చేజేత ... తమ హృదయ రాజ్యమును ... పోగొట్టుకొని ... దైవోపహతనై...ఇప్పుడు ... నరకమార్గమున ... నడచుచున్న ... తమ ప్రాణాధిక స్వర్ణనే... నేను!...నన్ను...క్షమింపుడు ప్రభూ!... నా యంతిమ ప్రార్థనమును ... మన్నింపుడు ... నిర్విచారముగ ... మరణించెదను."

అప్రయత్నముగ కృష్ణమోహన్ నేత్రములు బాష్పావరుద్ధము లయ్యెను.

"నీవు మరణించుటేవన్న వార్త...."

"అసత్యము !... నేను మరణించ లేదు... ప్రాణాపాయము... సంభవించినది. చైతన్యము తప్పుటకు పూర్వము...తమ కందజేయుమని... ధారానగరమునకు...జాబు వ్రాయించితిని. పిమ్మట... నేను మరణించితి ననియే యెల్లరును భావించి ... విడచిపెట్టిరి. నా మహా దురాగ్యముచే ... తిరిగి నాకు చైతన్యము కలిగినది ... కాల క్రమమున ... తిరిగి ... స్వస్థత చెంది ... విశాల ప్రపంచమున... పడితిని. ఈ విషయ మెవ్వరికిని... తెలియదు. నా ప్రియభర్తను ... నా బిడ్డలను ... విడచి ... ఉండజాలక పోయితిని. ... అదృష్ట వశమున ... నాకు మరల ... నా గృహమందు...ఆశ్రయము... లభించినది. కాని...కాని...దాసిని! ఇది నా గృహమని... చెప్పుకొనుట కధికారము లేదు! నా భర్త ... నా బిడ్డలు ... అని ... బహిరంగముగ .... చెప్పుకొనుటకు ... అర్హత లేదు. ఇంతకాలమును ... ఇచ్చట ... నరకాగ్ని గోళమునం దుంటిని. ... నా నికృష్టజీవనము ... పరిసమాప్తి పొందనున్నది. ఈ శేషముహూర్తమందు ... తమ క్షమాదానము ... నే నర్థించుచున్నాను ... ప్రభూ! నన్ను క్షమించితిరా? క్షమించితిరా?" అని వెక్కి వెక్కి యేడువసాగెను.

కృష్ణ:- స్వర్ణా! అప్పుడు నన్నును బిడ్డలను విడచి నీవు పోవుటకు కారణమేమి?

స్వర్ణ:- కారణము ... ప్రభూ! తమయందు నాకుండిన అపరిమిత ప్రేమయే ... నన్నట్టి ఘాతుక కార్యమునకు...పురికొల్పినది.

కృష్ణ:- (విస్మితుడై) ప్రేమయే కారణముగ మమ్ము నిరాకరించితివా?

స్వర్ణ:- అగును...ప్రేమయే...ప్రేమయే...అకలంకమైన నా ప్రేమ హృదయము...మీ ప్రేమను శంకించినది. మీ ప్రేమ...అన్యాక్రాంత మగుచుండినట్లు ... నేను పొరపడితిని ... ఆ దురాత్ముడు నా నిష్కలుష హృదయమునందు ... విషబీజములను నాటినాడు ... మోసపోయితిని ... తాత్కాలికమైన ... రోషావేశమున ... అంధురాలనై ... అపమార్గమునందు బడితిని ... సత్యము ... సత్యము ... నన్ను విశ్వసింపుడు.

కృష్ణ:— స్వర్ణా! త్రికరణశుద్ధిగ నేను నిన్ను ప్రేమించుచుంటిని. నీ హృదయము నన్నెట్లు శంకించినది?

స్వర్ణ:— (నిట్టూర్పుతో) నా కన్నులు...నన్ను మోసగించినవి! రజ్జువును చూచి...సర్పమని భ్రమించితిని!...పిచ్చి యెత్తితిని...శూన్యజ్ఞానినై...సుపవిత్రమైన...సువర్ణదుర్గమునకు....కళంకము తెచ్చితిని! సర్వసుఖాల వాలమైన...సంసారమును...సర్వనాశన మొనర్చితిని!...ఇప్పుడు సత్యమును గ్రహించితిని! మహాపరాధము చేసితిని! నా యపరాధమునకు......శిక్ష ననుభవించితిని! ఇంకను.....మరణానంతరము.....అనుభవింప...సిద్ధముగ నున్నాను...తాము నన్ను క్షమించితినని పల్కుడు. నిర్విచారముగ...మరణించెదను.

ధారాపాతముగ కన్నీరు ప్రవహించుచునే యుండెను. క్షణక్షణమును ఆయాస మధికమై పోవుచుండెను. ఆతని చేతులను బట్టుకొని, "క్షమించితిరా? క్షమించితిరా?" అని దీనస్వరముతో నడిగెను.

కృష్ణ:— స్వర్ణా! పశ్చాత్తప్తవైయున్న నిన్ను సర్వేశ్వరుడే క్షమించును. నేను క్షమింపనా? చింతింపకుము. పశ్చాత్తాపముచే నీ పాపము లన్నియు నశించినవి!... నే నెన్నడైన నీ యెడ నపరాధము చేసియుండినచో నీవు నన్ను క్షమింపుము.

స్వర్ణ:—తాము! నాయెడ నపరాధమా? భగవాన్! భగవాన్! నా మూర్ధమును వేయిఖండములుగ చీల్చివేయుము! ద్రోహిని! పరమ పాతకిని!

అని హృదయాంతర్యాతమగుచున్న యా వేదన నడంచుకొనజాలక యేడువజొచ్చెను. కృష్ణమోహన్ ఆమె చెంత గూర్చుండి, "స్వర్ణా! దుఃఖింపకుము. కర్మానుభవము ఎంతవారికిని తప్పదు. గడచిన దేదియో గడచిపోయినది! భవిష్యత్ సౌఖ్యమునకై భగవంతుని ప్రార్థింపుము!" అని యోదార్చెను.

దుర్భరమైన హృదయవేదనతో ఇంక మాటాడజాలక నామె కన్నులు మూసికొనెను. కృష్ణమోహన్ చెదిరియున్న యామె ముంగురులను సరిదిద్దుచు, చేరుమాలుతో చెమ్మట నొత్తుచు,

"స్వర్ణా! ఆయాసముగ నున్నదా?" అని మెల్లగ నడిగెను. ఆమె యత్యంత ప్రయాసమున కన్నులు విప్పి, "ప్రభూ! ఇపుడు నా హృదయ భారము...తగ్గినది! నేను ధన్యనైతిని! మహానందమున తమ చేతులలో...నేను...మరణించుచుంటిని! తమకై...తమకై... కాలవాహినియందు...వేయికండ్లతో...కనిపెట్టుకొని యుందును... సెలవిండు...అనంతకోటి నమస్కారములు!...కుమారి...లీల!... లీల!..."

చైతన్యము తప్పిపోయెను. గాఢ నిద్రాగత యయ్యెను. కృష్ణమోహన్ బాష్పాకుల నేత్రుడై మెల్లగ లేచి తలుపు తెరచుకొని బయటకు వచ్చి, "అక్కా! నేను వచ్చుపర్యంతము ఇచ్చటనే ఆమెను కనిపెట్టుకొని యుండుము." అని మేడమెట్లు దిగెను. ఆమెయు మంజరియు మంచముకడకు బోయి, అచేతనయై యున్న రోగి ముఖమువైపు జూచుచు నిశ్శబ్దముగ కూరుచుండిరి. మరి పదునైదు నిముషములు కాబోలు, ఆమె యూపిరి శబ్దము వినసయ్యెను. తదుపరి, ఆ శుష్కశరీరము నిశ్శబ్దమై నిశ్చలమై శీతలమైపోయెను.

"పాపము! నిర్భాగ్యజీవి! పరమేశ్వరు డీమె యాత్మకు శాంతి ప్రసాదించుగాక!" అని పెద్ద నిట్టూర్పు విడచి కన్నీరు తుడుచుకొనుచు ఆ వృద్ధాంగన లేచి బయటకు పోయెను.

వెక్కి వెక్కి యేడ్చుచు మంజరి యా మృతదేహము చెంతనే నేలపై కూలబడెను.

హేమ మరణించెనన్న విషాదవార్త తత్క్షణమే సర్వత్ర వ్యాపించెను. హేమయే స్వర్ణలత యను విషయము మాత్రము పరివ్యాప్తము కాలేదు. ధారానగరమునందున్న దేవేంద్రరాయలకు కృష్ణమోహన్ సత్యము వివరించుచు ప్రత్యేకముగ వర్తమానమంపెను. సకుటుంబముగ దేవేంద్రరాయలు సువర్ణదుర్గమునకు వచ్చెను. యథాయోగ్యముగ స్వర్ణలత అంత్యక్రియలు నిర్వర్తింపబడెను.

తదనంతరము కృష్ణమోహన్ హేమ మరణవృత్తాంతము శాంతకు లేఖ వ్రాసెను. ఆ లేఖ నందుకొని శాంత దుఃఖాకులయై తత్క్షణమే బయలుదేరి సువర్ణదుర్గమునకు వచ్చెను. కృష్ణమోహన్

హృదయము అశాంతి సంకుల మయ్యెను. స్వర్ణలతా రహస్యమును దెలిసి శాంత యెట్టి మనోవేదనకు లోనగునో యని యాతడు భయ పడ జొచ్చెను. ఎట్లైనను ఆరహస్య మామెకు తెలియకపోదు. అట్టిచో తానే ఆ విషయ మామెకు చెప్పుట యుక్తమని భావించి, యాతడు శాంతకు సమస్తమును తెలియజేసెను. శాంత వదనము నిస్తేజ మయ్యెను.

"శాంతా! దుఃఖభాజనమైన ఆ యభాగిని జీవనయాత్రన పరిసమాప్త మైనది. తన యపరాధమును క్షమింపుమని కొనయూపిరితో నామె నన్ను ప్రార్థించినది."

శాంత నోట మాటరాక ముఖము వంచుకొని నిలువబడెను. ఆమె హృదయాంతరాళమున నుత్పన్నమగుచున్న భావపరంపర యామె ముఖబింబముపై ప్రతిఫలించుచుండెను.

కృష్ణ:- శాంతా! ఏమాలోచించుచున్నావు? ముఖము వివర్ణమై యున్నదేమి?

శాంత:- (కన్నీటితో) మోహన్! ఈ సంఘటనము ... మీ ప్రేమ హృదయమునుండి ... నన్ను బహిష్కరించుచున్నదా?

కృష్ణ:- శాంతా! అట్టి సందేహము నీకేల కలిగినది? నా హృదయము నీ వెఱుగవా? ఈ సంఘటనము కేవల మొక స్వప్నగత సముద్రమునందలి తరంగము. వాస్తవిక ప్రపంచమునందు దానికి స్థానమే లేదు. శాంతా! నన్ను నీవు శంకించుచుంటివా?

శాంత:- నా యజ్ఞానమును క్షమింపుడు. స్వార్థచింత తాత్కాలికముగ నన్ను అంధురాలిని జేసినది. ఇంక నెన్నడును అట్టి వికృతి భావములకు నా హృదయమున స్థానము నీయను.

కృష్ణ:- శాంతా! మన మనఃప్రాణ సర్వస్వమునకు ద్వైతభావము లేదు! విశ్లేషము లేదు! ఛాయారహితమైన విశ్వాసమునందే పరమశాంతి యిమిడి యున్నది!

ఆ యేకాంత మందిరమునందు ప్రేమతత్వమును వితర్కించుకొనుచు ఆ ప్రేమ దంపతులు ఎంత కాలము ప్రేమ సుధాడోలికల నూగులాడుచుండిరో తెలియదు.

—♦ సమాప్తము ♦—